# సాధు సుందర సింగు

## దేవునివల్ల పిలువబడినవారు

# SADHU SUNDAR SINGH

## CALLED OF GOD

ఈ పుస్తకము ఏ. పార్కర్ దొరసానిగారిచేత ఆంగ్లేయభాషయందు
రచింపబడినది
రెవ. గానుగపాటి కాంతయ్యగారిచేత ఆంధ్రీకరింపబడినది

CHRISTIAN LITERATURE SOCIETY FOR INDIA
(UNITED SOCIETY FOR CHRISTIAN LITERATURE)
MADRAS COLOMBO BANGALORE SECUNDERABAD
1942

# యేసునాధుడే పదివేలలో ముఖ్యుడు

గీ. విని, కని, తెలిసికొంటె యాతనిని, నీదు
మనమును వశంబుగాఁ జేసికొనఁడె, ముఖ్యుఁ
డొక్కఁడే పదివేలలో నొనరఁ దెలసె
నతఁడు సంతోషమున ముఖ్యమైన దన్న. 1

గీ. భూమిపైనున్న విగ్రహంబులను గలుగు
బింబసౌందర్య మెద్దానఁ జేరుమాసె!
యద్దినైజంబునను విధి ననుసరింపఁ
బో, దనర్ఘవస్తువు నడిపొనరఁగను లె. 2

గీ. ఘోరముగ నా ప్రతిమలను గొట్టఁగూడ
దతనియందంబు వెలయింపనగును మఱియు
దనరనాతని నిర్మలాంతఃకరణము
నెల్లఁ బ్రకటనసేయుట యే యెలర్పు. 3

గీ. పేతురుమనంబుఁ గరగించి వెసనుస్త్రీ పై
నుంగనుంగొన్న మేల్చూపునున్ముఖంబు
మేరితోఁగూడి దుఃఖించి మించుహృదయ
మును నవియె ప్రతిమలనుండి మనల నెడవు. 4

గీ. అటుల మనలను దూరంబునందునుంచి
మదిని సంతోషమున నింపునది యగుటను
నతనితోఁగూడి యుండినట్టైన మనకుఁ
బ్రతిమలన్నిఁటిలో నేమి పనియులేదు. 5

# సాధు సుందరసింగు ఉత్తరము

ఈ పుస్తకముయొక్క లిఖితప్రతిని నేను చదివినప్పుడు ఆర్. జే. పార్కరు దొరసానమ్మ దీనిని దేవుని ఆత్మయొక్క ఆశ్చర్యకరమైన సహాయముచేతనే తప్పులు లేకుండ వ్రాసినట్లు నేను గ్రహించితిని. ఇది దేవుని మహిమ నిమిత్తమును, అనేకుల ఆత్మీయ లాభముకొరకును నుండునని నేను దృఢముగా నమ్ముచున్నాను. నావలె కష్టములలోనుండిన దేవుని సేవకులు, ప్రభువు నీచపాపినైన నన్ను ఎట్లు రక్షించెనో, తన పరిశుద్ధమైన సేవకు తన అత్యధికమైన కృపచేత ఎట్లు ఏర్పర్చుకొనెనో గ్రహించినప్పుడు ఎంతో ఆదరణ పొందుదురని నమ్ముచున్నాను.

గడచిన పదమూడేండ్లనుండి అనేక కష్టనష్టములను సుఖదుఃఖములను అనుభవించిన నేను, క్రీస్తుప్రభువు నిన్న, నేడు, నిరంతరము ఒక్కటేరీతిగా నున్నాడని ఎంతో కృతజ్ఞతతో చెప్పగలను (హెబ్రీ, 13: 8.)

నా ప్రభువైన దేవుడు ఈ పుస్తకమును తన మహిమకొరకును, మానవుల ఆత్మక్షేమముకొరకును ఉపయోగించవలెనని నా ప్రార్థనయై యున్నది.

సెప్టెంబరు నెల
3-వ తేది 1918-వ సం॥

సుందరసింగు.

# విషయసూచిక

# పీఠిక

తిరువనందపురములోనున్న అనేక సభలలోచేరిన ప్రొటెస్టాంటు క్రైస్తవులు 1918 సంవత్సరము ఫిబ్రవరి మాసమును సులువుగ మరువలేరు. ఆ మాసములో అదివరకెన్నడును జరుగనిదిని, అనేకుల ఆత్మలకు విశేషమైన మేలు కలిగించినదియైన ఒక సంగతి జరిగెను. అదియే సాధు సుందరసింగు యొక్క దర్శనము. ఈ విధమైన పురుషుడు క్రైస్తవ సభలను ఇదివరకెన్నడును దర్శింపలేదని మా మిషనెరీలలో నొకరు చెప్పిరి. అవును; సుందరుడు మమ్మును దర్శించినది దేవుడు తానే తన జనులను దర్శించెనని నిశ్చయము కలిగించుచున్నది.

సుందరసింగు మా మధ్యకు రాకముందు ఆయన కీర్తినిగూర్చి మేము వింటిమి. ఇక్కడనున్న కొందరు ఆయననుగూర్చియు ఆయన చేసిన దేవుని పనినిగూర్చియు పుస్తకములలో చదివిరి. కొందరు ఆది సభలో జరిగిన అద్భుతములు ఇప్పుడును జరుగునని తలంచిరి. కాని అనేకులు ఆయనను చూడవలెననియు, ఆయన మాటలు వినవలెననియు, అందు మూలముగ ఆత్మీయమైన ఆశీర్వాదములను పొందవలెననియు, బహుగా కోరిరి. ఈ కోరికలను దేవుడు తీర్చకుండా పోలేదని, అనేకమంది సంతోషముతో సాక్ష్యమియ్యగలరు.

సాధు సుందరసింగు ఎక్కివచ్చిన పొగబండి తిరువనందపురము స్టేషనులోనికి రాగానే అక్కడనున్న మిషనెరీలును కొందరు స్వదేశ క్రైస్తవులును ఆయనకు స్వాగతమిచ్చుటకు సిద్ధముగానుండిరి. ఆయన మిషను బంగాళాకు వచ్చినప్పుడు ఆయనను చూచుటకు అనేకమంది గుంపుకూడియుండిరి. స్నానముచేసి భోజనము చేయుటకైనను ఆయనను పోనిచ్చుటకు వారికిష్టము లేకపోయెను.

సాధు సుందరసింగు పాదరక్షలు లేకుండ కాషాయపు నిలువుటంగీని భుజములమీద అదేరంగు కలిగిన ఉత్తరీయమును, తలగుడ్డను, ధరించి, సొగసైన

ఎర్రని ముఖమును, నల్లని కన్నులును, వెంట్రుకలును కలిగి, ఆరడుగుల పొడుగైన చక్కని సిక్కు యౌవనునివలె కనిపించెను. ఇరువదితొమ్మిది ఏండ్ల వయస్సుగలవాడైనను, బహు గంభీరముగాను ఇతరులను వశపర్చుకొనగలిగిన చిరునవ్వుతోను తత్తరపాటులేని అభినయముతోను ఆయన కనుపించినప్పుడు, "లోకముయొక్క నిరీక్షణ" యను బొమ్మలో సమస్త దేశస్థుల చిన్నపిల్లలను తన కౌగిట చేర్చుకొనినట్లు యేసునాథుని చిత్రించిన చిత్రకారుడు, సుందర సింగు ముఖమును చూచి మన ప్రభువుకును అట్టి ముఖము ఉండవచ్చునని ఊహించెనాయని తోచును.

వేద గ్రంథములోని మరుగైన అనేక సంగతులు ఈ పురాతన భూమియైన హిందూదేశములో గ్రహించుకొనుటకు వీలగునుగాని మన రక్షకుడు ఈ లోకములో ఎట్లు సంచరించెనో యని సుందరసింగు తెలియపరచినట్లు మరి యెవరును నా అనుభవములో తెలియపరచలేదు. సుందరుడు తిరువనందపురములో ఎక్కడ ప్రసంగించబోయినను జనులు గొప్ప గుంపులుగా కూడిరి. పిల్లలు ఆయనచుట్టు కూడుకొని ఆయన వస్త్రములు తాకవలెనని కోరిరి. ఆయన ప్రార్థించవలెనని అనేకమంది రోగులను ఆయనయొద్దికి తెచ్చిరి. నేను రోగులను స్వస్థపరచలేనని సుందరుడు స్వయముగ చెప్పినను ప్రజలు దానిని నమ్మలేకపోయిరి.

సుందరుని ప్రసంగములు వినుటకుకూడిన ఒక పెద్ద కూటములో ఒక రోగిని మంచముమీద మోసికొనివచ్చి వాడు సుందరుని చల్లని ముఖమును చూడ గలుగునట్లును ఆయన మధురమైన వాక్యములు వినగలుగునట్లును వానిని ఒక చోటనుంచిరి. వాడు ఒక క్రైస్తవుడు; ఏడుమైళ్ల దూరముననున్న వారి గ్రామమునుండి ఈ కూటముకొరకు ఆ ముందురాత్రి వానిని మోసికొని వచ్చిరి. పరితాపకరమైన ఈ సంగతి చూచినప్పుడు యేసునాథుని రోగులు ఎంత ఆశతో వెతకియుండిరో మా మనస్సుకు స్ఫురించెను.

నికోదేము యేసును రహస్యముగ వెతుకుచు రాత్రివేళ ఆయనయొద్దకు వచ్చిన సంగతి ఆ రాత్రి జరిగిన ఒక సంగతినిబట్టి మాకు జ్ఞాపకమునకు వచ్చెను. చరాచరములైన జీవములన్నియు నిద్రించుచున్న రాత్రి రెండు

ఘంటలవేళను, సాధువుతో మతవిషయములనుగూర్చి మాటలాడుటకు కోరి గొప్ప కులస్థుడైన హిందువుడొకడు తలుపుతట్టి లోపలికివచ్చి నేను పగటి వేళ వచ్చుటకు బిడియపడి ఇప్పుడు వచ్చితినని చెప్పెను. యేసుక్రీస్తు మీకొరకు నీచమైన సిలువమీద మిట్టమధ్యాహ్నము వ్రేలాడి శ్రమపడుటకు సిగ్గుపడలేదే. నీవు ఆయనకొరకు కొద్ది కష్టము పడకూడదా అని సుందరు డడిగెను. మరునాడు తన సిగ్గునంతను విడచి క్రైస్తవుల పెద్దకూటమునకు ఈ హిందువుడు ధైర్యముగావచ్చి సాధువుచేసిన ప్రసంగమును వినెను.

మా కందరికిని సాధు సుందరసింగు దేవునిగూర్చియు యేసుప్రభువును గూర్చియు నూతనమైన జ్ఞానమును కలుగజేసెను. క్రీస్తుతో సమీపముగ సహవాసము చేసినందువలనను ఆయన చిత్తమునకులోబడి ఆయనను మన స్ఫూర్తిగ వెంబడించుటవలనను సుందరుడు తన ప్రభువుయొక్క ముఖవికాసమును కలిగియున్నట్టు మాలో అనేకమంది ఎంచిరి. ఆ కారణముచేతనే గదా ఈయనను చూచినవారందరును ఈయన క్రీస్తును పోలియున్నాడని చెప్పుకొనిరి.

సాధు సుందరసింగును చూచుటచేతను ఆయనమాటలు వినుటచేతను హిందూదేశస్థులు ఇకముందును సాగిపోవుదురు. పశ్చిమ దేశస్థులు ఇది వరకు గ్రహించనట్టి రక్షకుని కల్యాణగుణములలో కొన్నింటిని తూర్పు దేశస్థులు నూతనముగ గ్రహించి వెల్లడిపరతురన్న నమ్మికయు, నిరీక్షణయు కలుగుచున్నది. హిందూదేశస్థుల మనస్సును వశపరచుకొనగలిగిన మహా పురుషులు బయలుదేరవలెనని గడచిన ముప్పది సంవత్సరములనుండి మేము కని పెట్టుచుంటిమి. నేటికి అధిక వినయముతో సిలువనెత్తుకొని తన ప్రభువును వెంబడించుచున్న సాధు సుందరసింగునందు మా మనోరథ మీడేరెను.

A. PARKER,

*London Mission, Trivandrum.*

# ఈ పుస్తకముయొక్క వర్తమానము

ఈ చిన్న పుస్తకము సాధు సుందరసింగుయొక్క జీవిత చరిత్ర కాదు. ఆయన చేసిన పనియొక్క చరిత్రయూ కాదు. కాని దీనిలో విశేషమైన దైవభక్తిగల ఒక మనుష్యుని సొగసైన నడతయొక్క రహస్యమును బయలు పరచి, తనను సంపూర్ణముగా దేవునికి సమర్పించుకొనిన వానికి ఇతరులను వశ పరచుకొనుటకుగల శక్తినిగూర్చి జ్ఞాపకము చేయుటకు ప్రయత్నించితిని.

క్రీస్తు ప్రభువుయొక్క దాసులలో ఉత్తముడైన ఒకడు ఆయనవలె జీవించుటవల్లను, ఆయన సువార్తను బోధించుటవల్లను, అనేకులను ఆయనవైపునకు ఆకర్షింపగలిగెననియు, ఇతరులు క్రీస్తును ఎక్కువ భక్తితో వెంబడించుటకు ప్రేరేపించబడి, సుందరసింగుయొక్క ఆవేశము కొంచెము పొందినయెడల ఈపుస్తకముయొక్క ఉద్దేశము నెరవేరినదనియు చెప్పవచ్చును.

సాధు సుందరసింగును చూచినందున మేలుపొందిన నాకు ఆత్మలను క్రీస్తు పాదములయొద్దకు నడిపించుటకు ఆయనకుండిన ఆశ్చర్యమైన శక్తిని గూర్చి సాక్ష్యమిచ్చుట ఎంతో సంతోషమును కలుగజేయుచున్నది. ఈ పుస్తకముయొక్క వర్తమానమును వినువారందరును దీనివల్ల ఆత్మీయమైన మేలును పొందవలెనని నా ప్రార్థన.

ఆర్. జే. పా.

'నేను భూమిమీదనుండి పైకెత్తబడినప్పుడు, సమస్తమైనవారిని నాతట్టు ఆకర్షించుకొందును'ని యేసు చెప్పెను.

# సాధు సుందరసింగు

# 1. అధ్యాయము

## సాధువు, సన్యాసి

ఈ దేశములో హిందువులు మతాచారములను క్రమముగ ననుష్ఠించుట గొప్ప సంగతిగ నెంచినట్టు లోకములో మఱి యే దేశస్థులును ఎంచుట లేదనవచ్చును. వైదికమునకు తమ జీవితకాలమును ప్రతిష్ఠించుకొనిన వారియెడల నత్యధికమైన గౌరవమును వారు చూపుదురు. ఈ దేశస్థులు ప్రాచీనకాలమునుండి లోకమును పరిత్యజించినవానిని, దేశమును జయించి, దానిని పరిపాలించువానికంటె నధికునిగ గౌరవించుదురు. మత గురువునకుండు శక్తి యందరు నెరిగిన విషయమే, గనుక దాని నిక్కడ వివరింప నవసరములేదు. పశ్చిమదేశ విద్యావ్యాపనముచే నతని యధికారమునకు కొంత లోపము కలిగినను, హిందూకుటుంబములో పౌరోహితునకు ఇంకను పలుకుబడి కలదు. కాని బ్రాహ్మణేతరు లనేకులు వైదిక వేషమును ధరించుదురు, వీరిలో ముఖ్యులను సాధువులని, సన్యాసులని యందురు. ఈ రెండు పదములు ఒక తెగవారికే చెందునని తప్పు అభిప్రాయము కలదు; కాని వీటికుండు ముఖ్యభేదమేదనిన, సాధువు ఆరంభమునుండి వైదిక ఆశ్రమములో ప్రవేశించును; సన్యాసి తన జీవితకాలముం దెప్పుడైనను; అంతమందుకూడ ఈ వేషము ధరింపవచ్చును.

హిందువు లనేకులు చివరకాలములో సంసార బంధకములు, లౌకికాపేక్షలు, ఇతర బాధ్యతలను విడిచి, తమ ఆయుశ్శేషము సన్యాసాశ్రమ సంబంధమైన కష్టములను సహించుటకు తమ్మును ప్రతిష్ఠించుకొందురు. అట్టివారు సాధారణముగ తమకున్న బాధ్యతలు అనగా గృహస్థాశ్రమబాధ్యతలు నెరవేర్చి, లోకములో తమ కర్తవ్యమును నిర్వహించునట్టు లెంచుదురు.

అయితే సాధువు బాల్యములోనే లోకమును, దాని సౌఖ్యములను పరిత్యజించును. అతడెన్నడు వివాహమాడడు, లోకతాపత్రయములలో జోర ఒడడు.

సాధువుయొక్క జీవితములో లోకమునకు చెప్పశక్యముకాని గొప్ప మేలుచేయుట కవకాశమున్నది, కాని యది భయంకరమైన శోధనలతో కూడ నిండినది. సాధువు లోకమును, లోకము తనకు సమర్పించు సమస్త వైభవమును పరిత్యజించిన శూరుడగుటచే నీదేశమందంతటను అధిక గౌరవమును పొందును. కావుననే హిందూదేశములో చక్రవర్తులు సహితము ఇట్లు లోకమును పరిత్యజించినవానియెదుట బహు భయభక్తులతో నెల్లప్పుడు వంగి నమస్కృతులు చేయుచున్నారు. సన్యాసియు, సాధువును కాషాయవస్త్రమును ధరింతురు. ఈ వేషము చిరకాలమునుండి గౌరవనీయమైనదైనందున, ఈ దేశములో జాతి కులభేదములను మీరి యెక్కడికైనను పోవుటకు వారికి అధికృతను కలిగించును. వారికి నిలువనీడయు, చేత కాసును, తమ స్వంతమనునవి యుండవు గనుకనే హిందువులు వారికి సమస్తోపచారములను చేయుట తమ మతధర్మముగను, పుణ్యకార్యముగను ఎంచుదురు.

ప్రాచీనకాలమునుండి ఇండియాలో భక్త్యావేశములుగలవారనేకులు ఇట్టి జీవితము శ్రేష్ఠమైనదని యెంచి, లోకమును, అందలి సంపదల నన్నిటిని స్వేచ్ఛాపూర్వకముగ పరిత్యజించి, తమ్ము నుపేక్షించుకొని, సకల విధములైన కష్టములపాలై, తద్వారా మనశ్శాంతిని, భగవత్సాన్నిధ్యమును సాయుజ్యమును సంపాదింప యత్నించిరి.

ఇండియాలో పుణ్యక్షేత్రములలో నెద్దానియందైనను ఒకరిద్దరు సాధువులు తాము పూనుకొనిన నిష్ఠ ననుసరించి, పంచాగ్ని మధ్యమందు కూర్చుండుటగాని, గోళ్లు చేతిలోనుండి పొడుచుకొని వచ్చునట్లు దానిని పైకెత్తి యుంచుటగాని, ముండ్లమీద పరుండుటగాని, పుణ్యతీర్థపుటొడ్డున మౌనవ్రతము వహించి భగవధ్ధ్యానము చేయుచుండుటగాని సామాన్యముగ చూడవచ్చును. కాని యిట్టి వ్రతము నవలంబించినవారు కొందరు మిక్కిలి యవమానకరమైన బ్రతుకు బ్రతుకుచుండుటచేత దీనినిగూర్చి నీచమైన తాత్పర్యము కలదు. ఒకానొక మురికిభిక్షుకుడు కాషాయవస్త్రము ధరించి, యింటింటికి తిరుగుచు, తానడిగినదాని నియ్యనందున అమాయకులైన యింటివారిని భయపెట్టి శపించుట యెంతో అసహ్యముగనుండును.

చలికాలములో సీమదేశమునుండి యీ దేశమును చూచుటకు వచ్చెడు విదేశీయులు పుణ్యక్షేత్రములగుండ బోవుచు, అనేకమంది దేవుని కనుగొనవలెనని ఈ విధముగ సన్యాసివేషముతో ఆయనను వెదుకుచుండుట చూడవచ్చును. అనేకమంది మురికిగానున్న ఫకీర్లను చూచినప్పు డెంతో అసహ్యము కలిగినను, అనేకమంది సన్యాసులు తమ్మును క్రూరముగ కష్ట పెట్టుకొనుట చూచినప్పుడు క్రైస్తవుడు వారు వెదకుచున్న మనశ్శాంతి కలుగు రక్షణ మార్గమును గూర్చి వారికి తెలుపగోరుననుటకు సందేహము లేదు.

ఈ దేశములో బహు స్వల్పవ్యయముతో జీవింపవచ్చును. ఇచ్చటి శీతోష్ణస్థితి కొద్ది బట్టలతో బయట చెట్లక్రింద జీవించుటకు తగియున్నది. పశ్చిమదేశస్థులవలె సుకుమారముగ జీవింపవలెనను వారు కొందరే. కాని ప్రజలు సాధారణముగా స్వల్ప సౌఖ్యముతోను అల్పాహారముతోను తృప్తి పొందియుందురు. గనుకనే యనేక శతాబ్దములనుండి భక్త్యావేశము గల వారు మనశ్శాంతిని వెదకబోయినప్పుడు సాధ్యమైనంత స్వల్ప జీవనము నభ్యసించి, దానితో కష్టమైన బాధలను బుద్ధిపూర్వకముగ ననుభవింప బూనుకొనిరి.

పాశ్చాత్యులు మిగుల చలిగల దేశమం దుండుటచేతను, వేరు అల వాటులు గలవారై యుండుటచేతను ఇట్టి కష్టములతో జీవించుట వారి కసాధ్యము. అంతియేకాక నిట్టి స్వల్పజీవమును ఊహించుట సహా వారి కసాధ్యమే. ఈ దేశములో నిజమైన సాధువు పాశ్చాత్యులవలె తినుట కాహారము, ఉండుట కిల్లు తప్పకుండ దొరకునట్టి మఠములోనికి బోడు, గాని యతడుండుట కిల్లులేక యూరూరు దిరుగుచు, తాను ధరించుకొనిన యొక్క వస్త్రముతో నిరాధారిగ పరదేశివలె నుండును.

లోకాంతపర్యంతము ఇండియాలోని సన్యాసుల కష్టపు బ్రతుకును గూర్చి జనులాశ్చర్యపడక మానరు. వారు ఇహసంబంధమైన లాభమునంతను తృణీకరించి సమస్తవిధములైన శ్రమలను మనోనిబ్బరముతో సహించుటను గూర్చి ఆలోచించువారికి ఎంతో ప్రోత్సాహమును పరవశమును తప్పక కలుగును. సుమారు మూడువేల సంవత్సరములనుండి యీ దేశములో సన్యా సుల బ్రతుకు ఆత్మీయమైనజీవము శారీరజీవముకంటె నధికమైనట్లు స్పష్ట ముగ సాక్ష్యమిచ్చుచున్నదని డాక్టరు ఫార్కరు వ్రాసెను.

# సాధు సుందరసింగు

ఈ యాత్రముయొక్క ఉద్దేశము బహు గొప్పది. ఇది క్రీస్తు ప్రభువుయొక్క బోధ ననుసరించి "లోకములో నున్నను లోకమును హత్తు కొనక," సమస్తసౌఖ్యములను పరిత్యజించి, వాటికి బదులుగ సమస్తవిధము లైన కష్టముల ననుభవించుచు, ఎడతెగకుండ నితరుల యాత్మరక్షణ పైనకు చుండు క్రైస్తవసన్యాసియాత్రమముగ మారినయెడల. ఈ లోకములో నంతకంటె శ్రేష్ఠమైన జీవితముండబోదు.

# సాధు సుందరసింగు

సమస్తమును పరిత్యజించిన సాధువుయొక్క జీవనము మహాత్మ్యపూర్ణ మైనదను ఉద్దేశము ఈ దేశస్థులందరి మనస్సులలో చిరకాలమునుం పారంపర్యముగ నున్నది. ఉండుటకు ఇల్లులేకను, మరుసటి పూటకు అన్న మెక్కడ దొరకునో తెలియకను, స్వంత ఆస్తి యేమియు లేనివాడుగ. సాధు సుందరసింగు మనముందర నిలువబడినప్పుడు; ఈయనలోను ఆ యుద్దే శము మూర్తీభవించినట్లు మనకు దోచునని చెన్నపట్టణములో ప్రచురింప బడు నొక పత్రికలో చెప్పబడినది.

కాని యీయన తనకొఱకు కాక యితరుల యాత్మరక్షణకొఱకు 'సమస్తము నష్టమ'ని యెంచుకొనుటచేత ఈ యుద్దేశము పరిపూర్ణముగ నెర వేర్చగలిగెను. చెప్పశక్యముకాని కష్టములలోను, నష్టములతోను, బాధల తోను, హింసలతోను కూడిన తన జీవమును తనకొఱకు ప్రాణము పెట్టిన రక్షకుని కనుదినము అర్పణగా చెల్లించుచుండెనని చెప్పదగును.

తాను అధికముగ ప్రేమించిన కీర్తిశేషురాలైన తన తల్లి కోరిన ప్రకా రము సుందరసింగు ధైర్యముతో క్రైస్తవ సాధువుగా బయలుదేరెను. అందుచేత కలిగిన హిందువుల కోపమును, క్రైస్తవసోదరుల పరిహాసమును, ఐరోపియనుల విరోధమును ఆయన యెంతమాత్రము లక్ష్యముచేయలేదు. తాను బాప్తిస్మము పొందిన ముప్పదిమూడవ దినమందే పదునారేండ్ల లేత ప్రాయమందున్నను, దేవుడు ఈ విధమైన తనసేవకొరకు తన నేర్పరచుకొనె నని మనోనిశ్చయము చేసికొని, సాధువుయొక్క కఠినమైన జీవితమును పూనుకొనెను. నాడుమొదలు 'తలవాల్చుటకు తనకు చోటులేద'ని చెప్పిన యా పరమపురుషుని దివ్యరూపమును, స్వార్థత్యాగులను ఘన పరచు ఈ దేశస్థులకు సుందరసింగు తన జీవితములో చూపుచు క్రీస్తు

ప్రభువు బయలుపరుపగోరిన సత్యములను వారికి ప్రకటించుచుండెను. ఈ దివ్యమైన పరిచర్యలో ఈయన యనుసరించిన యీ తూర్పుదేశస్థుల పద్ధతులు సరియైనవాయని యడుగువారి సందేహమును తీర్చుటకు సుందరసింగు ఒక యుపమానరూపముగ నిట్లు ప్రత్యుత్తరమిచ్చెను. దాహముచేత తపించుచు చావసిద్ధముగనున్న యొక హిందువు విదేశీయపాత్రలో నియ్యబడిన యుదకమును త్రాగకపోయెను. పిమ్మట నా జలమునే యొక యిత్తడి పాత్రలోబోసి యిచ్చినప్పుడు దాహము తీర్చుకొనెను. గాజుగిన్నెలో నున్నది జలమే, కాని యా పాత్ర అన్యదేశపు దగుటచేత నా జలమును త్రాగలేదు.

స్వదేశ క్రైస్తవులు సువార్తవ్యాపకులునకు నూతన పద్ధతుల నవలంబించుట యవశ్యము. ఎందుకనిన, వీరు తమ దేశస్థుల యవసరములను బాగుగ నెరిగినవారు, తమదేశపు పారంపర్యవాదుకలును, అభిప్రాయములును వీరికి నూతనమైనవి కావు. ఇది యిట్లుండగ, సుందరునియొక్క పరిచర్యవల్ల అనేకవేలమంది ప్రజలకు చెప్ప నలవికాని మేలు కలుగుచున్నందుచేత నిట్టి నూతన పద్ధతులు అనుసరింపతగినవనియే చెప్పవచ్చును.

సకలజాతులవారును సుందరసింగును చేర్చుకొందురు. పురుషులు పోగూడని అగ్రజాతిస్త్రీ లుండునట్టి యంతఃపురముల లోనికిగూడ ఈయన వెళ్లి, అనేకులకు క్రీస్తును గూర్చి చెప్పునట్టి ధన్యత గలవాడయ్యెను. (ఇట్టి మంచిసందర్భము లీయనకు కలుగుట యీ యన యొక్క సాధువు వేషము చేతనే). ఆ దుస్తులనుగూర్చి యీయన యొకప్పుడు చెప్పినదేమనిన: 'నేను సాధువుగా బయలుదేరినదినమున కాషాయవస్త్రములకు నేను వివాహమైతిని. ఆ వేషమును నే నెన్నడును బుద్ధిపూర్వకముగ విడనాడను.'

నీవెంతకాలము నిన్ను నీవు త్యజించుకొని యిట్టి జీవము జీవించుదువని ఆయనను తరుచుగ నడుగువారితో: 'నా జీవితకాలమంతయు నేను ప్రభువుకు ప్రతిష్ఠించుకొంటిని. ఆయన కృపచేత నేనీ ప్రతిజ్ఞను తప్పకుండ నెరవేర్తున'ని చెప్పెను.

ఎక్కడను అనేక దినములుండక, ఈ దేశమందంతటను సంచారము చేయుచు, తిరువాన్కూరు, సింహళముల యుష్ణమును టిబెట్టుయొక్క అధికమైన శీతలమును సహించుచు, ఏమి తిందును ఏమి ధరింతునను శరీరమును గూర్చిన చింత యేమియులేకుండ, పాదరక్షలుగాని ద్రవ్యముగాని లేకుండ, ననేకులకు ప్రయోజనమును తన పరమయజమానునికి మహిమయును కలుగు

నట్లు సుందరసింగు ఎడతెగకుండ యాత్రచేయుచుండెను. టిబెట్టులోకూడ ఆయన పాదరక్షలు ధరించలేదు. ఈయన రక్తము కారుచున్న తన పాదములతో కొందరిని యేసునొద్దకు నడిపింపవలెననెడి వైరాగ్యము వహించియుండెను. ఉర్దుబాషలో నున్న యొక నూతన నిబంధన ఈయన యెల్లప్పుడు తనచేత నుంచుకొనును. ఈ పుస్తకము, ప్రకృతి, తన స్వానుభవము అను ఈ మూడుమాత్రమే యీయన ప్రసంగములకు సారమును శక్తియు నిచ్చుటకు చాలినవై యుండెను.

పరమపురుష దివ్యలక్షణ ప్రదీపిక, (The Manhood of the Master) అను పుస్తకములో ఫాస్డిక్ (Dr. Fosdick) అను ఆయన, 'యేసునాధుడు ఆ కాలమందు పాలస్తీనా దేశమునందుండిన జనులలో మిక్కిలి సంతోషస్వభావము గలవాడై యుండవలెనని కనబడినట్లు చెప్పుచున్నాడు. అది యేవిధమైన ముఖవికాసమో సాధు సుందరసింగును చూచినవారికి తెలియును. క్రీస్తుకొఱకు శ్రమ ననుభవించుట ఈయనకు మహదానందము. ఈయన ముఖమునందు లోతైన సమాధానమును సంతోషమును ఎల్లప్పుడు కనబడుచుండును. గడచిన పదమూడేండ్లలో పలువిధములైన శ్రమల ననుభవించినను ఈయన ముఖములో నెంతో తృప్తి కనుపించును. ఈయనకుముందు అపొస్తలుడైన పౌలువలె నీయనయు, 'ఎటుబోయినను శ్రమపడుచున్నను ఇరికింపబడలేదు; అపాయములలో నున్నను కేవలము ఉపాయము లేకుండలేదు; తరుమబడుచున్నను దిక్కులేకుండలేదు; పడద్రోయబడినను నశించలేదు; యేసుయొక్క జీవముకూడ తన మర్త్యశరీరమునందు ప్రత్యక్షపరచబడుటకై యేసుయొక్క మరణానుభవమును తన శరీరమందెల్లప్పుడును వహించుకొని పోవుచున్నాడు' (2 కొరింథీ 4: 7—10).

## సుందరుని గుణగతులు

ఈ యధ్యాయమును వ్రాయువారు పశ్చిమ దేశమునుండి వచ్చిన మిషనెరీయైనను ఇండియాదేశమును చాలాకాలమునుండి ప్రేమించుచుండినందున ఈ మాటలు అంగీకరింపతగును. సుందరసింగునకును అనేకమంది యితర క్రైస్తవులకునుండు గొప్ప వ్యత్యాసమును, మనుష్యుల నాకర్షించుటకు ఆయనకుండినశక్తియు, ఆయనను చూచినప్పటినుండి మనస్సులో ఎక్కువగా తోచుచున్నది. ఈ వ్యత్యాసమును శక్తియు ఆయన సమస్తమును పరి

త్యజించుటచేతను, క్రీస్తు చిత్తమునకు తనను సంపూర్ణముగా లోబరచుకొనుట చేతను, క్రీస్తునందు తనకున్న అగాధమైన ప్రేమచేతను కలిగినవని చెప్ప వచ్చును.

మన ప్రభువుదినములలోవలెనే 'బీదలకు ప్రకటింపబడుచున్న సువార్త'ను విని యంగీకరించిన యీ దేశములోని క్షుద్రజాతులవారు కొందరు ఉన్నతమైన స్వాతంత్ర్య పదవిని పొందియున్నారు. అగ్రజాతులవారు కొందరు క్రీస్తును వెంబడించినందున గొప్ప నష్టమును హింసను పొందియు న్నారు. కాని తమకున్నదంతయు పోగొట్టుకొని క్రీస్తు దాసులైనవారు కొందరే.

సుందరసింగు క్రైస్తవుడైనప్పుడు ఆయనకు గొప్ప యుపద్రవము మాత్రముకాకుండ అధికమైన ద్రవ్యనష్టమును కలిగెను. ఆయనకు కలిగిన లాభము క్రీస్తేకాని మరేమియులేదు. దీనిని సంపాదించుటకు ఈయన లోకసంబంధమైన యైశ్వర్యమునంతయు విసర్జించెను. అప్పటినుండి క్రీస్తు కొరకు ఆయనతోకూడా శ్రమననుభవించుటే సుందరసింగుకు ఎప్పుడును పరమానందము కలిగించుచున్నది. ఈ దేశప్రజను లనేకులు ఈయనవలె యేసుప్రభువును తమ రక్షకునిగా నంగీకరించి, ఆయనను వెంబడించు నప్పుడే, వారు తను దేశస్థులను క్రీస్తుపాదములయొద్దకు తేగల సామర్థ్యము కలవారగుదురు.

మనుష్యులను క్రీస్తువైపునకు ఆకర్షించుటకు సుందరసింగుకు గల ఆశ్చర్యకరమైన శక్తియొక్క రహస్యమేమి? ఈయన చిన్నతనమందే దైవమును కనుగొనవలెనను కోరికతో నిండినవాడై, తన మతసంబంధమైన వేదగ్రంథము లలో తన ఆత్మీయదాహమును తీర్చుకొనదగిన 'సుబోధ యేదైనను దొరకు నేమో'యని వెదకి ఆశాభంగమును పొంది, నూతన నిబంధన నొకదానిని కను గొని దానిని చదువ నారంభించెను. దీనిని ఆయన, క్రీస్తు పాతనిబంధన లోని ప్రవచనములను ఎట్లు నెరవేర్చెనో తెలుపు పుస్తకముగాకాని, లేక తాను చిన్నతనమునందే విని పాతబడిన కథలుగల పుస్తకముగాకాని యెంచ లేదు. దీనిలోని నూతన పురుషుడైన క్రీస్తు ఈయనముందర తిరుగులాడుచు ఈయనతో మాటలాడుచున్నట్టుండెను. ఈ పుస్తకమును చదివిన సుందర సింగుకు ఈ చరిత్ర చదివినకొలది ఆశ్చర్య మెక్కువగుటయేకాక, తన మన స్సును పరవశపరచిన యేసునాథుని అనుసరించి ఆయనలో జీవింపవలె ననెడు వాంఛచేత లోకధనమంతయు పెంటకుప్పయని త్రోసివేయుటకు

మనస్సు పుట్టెను. నూతన నిబంధనలోని సంగతులు వివరించుటకైనను, దాని యర్థమును మరుగుచేయుటకైనను, వేరే పుస్తకమేదియు ఈయనకు దొరకక పోవుట మంచిదే. నూతన నిబంధనయు, దైవాత్మయు, అనేకదినములనుండి దైవమును వెదకుటచే గలిగిన వైరాగ్యముతో నిండిన తన యాత్మయు, ఈయన క్రీస్తును కనుగొని, తనకు దేవునియందున్న వాంఛను పరిపూర్ణముగ సంతృప్తిపరచుటకు సహాయకరములయ్యెను.

శత్రుమిత్రుల కన్నులకుదాగి, ఒంటరిగ నొక చెట్టునీడను కూర్చుండి, నూతన నిబంధనలో క్రీస్తుచరిత్రను చదువుకొనుటచే మనస్సు కరిగి, యీ హిందూబాలుడైన సుందరసింగు అనేకసార్లు నిట్టూర్పు విడిచెనని మనము విని నప్పుడు మన కంటకూడ నీరు జారకుండునా? ఈ విధముగ మనము 'క్రీస్తును నేర్చుకొంటిమా' అను ప్రశ్న మన మనస్సులో పుట్టును. మన విద్యాజ్ఞానముచేతను, వేదశాస్త్రజ్ఞానముచేతను, క్రీస్తునుగూర్చి మనకు కలిగి యున్న యభిప్రాయములు మరచి, సుందరసింగు యేసుప్రభువును కనుగొనినట్లు మనమును కనుగొనవలెనని యాశపుట్టుట లేదా?

ఆ దినములలో తాను కనుగొనిన క్రీస్తుదాసుడుగా సుందరసింగు దేశమందంతటను సంచారము చేయుచున్నాడు. తన నూతన నిబంధన చేతిలో నుంచుకొని, క్రీస్తు తనలో నుండినందున క్రీస్తుపోలిక తన ముఖమందు ప్రకాశించుచుండెను.

రెవ. హాలండు (Rev. W. E. S. Holland) అను ఆయన తన పుస్తకమం దిట్లు చెప్పుచున్నాడు:

'లోకములోని జనులలో సగము మంది ఇండియాదేశపు మతముల నవలంబించువారైనందున వారి కీదేశము ఆత్మీయమైన తల్లి యనదగును. ఇండియాయొక్క నిజరూపమును ఇతరులకు చూపుటకై వ్రాయబడు గ్రంథములో ఇండియాయొక్క మతాభిమానమునే మొట్టమొదట వివరింపవలెను. హిందువులకు మతమొక్కటే ముఖ్యమైనది. తక్కినవన్నియు వారియాత్మకు తృప్తి కలిగింపవు. మతాచారము లన్నిటికిని శిరస్సువలె నున్నది స్వార్థత్యాగమే. సాధువు కష్టములను లక్ష్యపెట్టకుండుట మహాత్మ్యశ్రేష్టమైనదిగా ఎంచబడుచున్నది. క్రీస్తుప్రభువు ఈ మహోన్నతోద్దేశమును నెరవేర్చగల శక్తిమంతుడు. ఈ దేశస్థులు క్రీస్తునుగూర్చి వినుటమాత్రమే గాన ఆయనను చూడగోరుచున్నారు. శాంతము మృదుత్వమే తనకు అలంకారముగా ధరించుకొని, ప్రేమతో ఇతరులకు సేవచేయు మనస్సుగలవాడై, ఇహలోకధన

మును డంబమును పరిత్యజించిన క్రైస్తవుడే తన ప్రభువుయొక్క సౌందర్యమును ఈ దేశస్థులకు చూపగలడు. అట్టివాడొకడు వెలయవలెనని నిరీక్షించుచున్నాము.'

బహుకాలమునుండి ఈ దేశస్థులు గౌరవించుచున్న సన్యాసి వ్రతమును పూని, హిందూ సన్యాసులవలె కష్టములను వెదకి తెచ్చుకొనక, పరోపకారార్థము చేయు సేవలో శ్రమలు సంభవించినయెడల అది దైవ చిత్తమని యెంచి సంతోషముతో సహించుచున్న సుందరసింగునందు క్రీస్తుయొక్క సుందరరూపము ప్రతిబింబించుచున్నది.

'ఇదిగో క్రీస్తు ఆసియాఖండవాసిగా మన ముందరికి వచ్చుచున్నాడు. ఈయనయే అనేక శతాబ్దములనుండి దైవముతో ఐక్యపడవలెనని యీ దేశస్థులు అనుభవించుచున్న ఆత్మదాహమును తీర్చునట్టి మార్గమును చూపగలవాడ'ని కేషబ్ చంద్రసేన్ చెప్పెను. దీని సత్యమును సాధు సుందరసింగు ఇప్పుడు నిరూపించుచున్నాడు. ఈయనను చూచినవారు ఈయనద్వారా మానవులకొఱకు తనను దరిద్రునిగ జేసికొనిన యేసునాథుని చూచుచున్నారు. ఇదే సుందరసింగుయొక్క శక్తికి కారణము.

ఇటువంటి ఒక మహాపురుషుని చూచుటకును ఆయన మాటలు వినుటకును ప్రజలు గుంపులు గుంపులుగ వచ్చుట ఆశ్చర్యమా? ఈ దేశము స్వదేశీయులవలననే క్రీస్తుపాదములయొద్దకు తేబడవలెను. సుందరసింగు ఎట్టి హిందువుని మనస్సునైనను ఆకర్షింపగలవాడుగా నున్నాడు. ఆయన వేషమును, స్వార్థత్యాగమును, సువార్తబోధించు చాతుర్యమును, ఆయన క్రైస్తవుడైన చరిత్రయు ఏ మతస్థులనైనను ఆయన చెప్పుమాటలు గమనించునట్లు చేయును. ఏ మతస్థులైనను సుందరసింగుయొక్క విశేషమైన భక్తిని గ్రహించి ఆయనను పరిపూర్ణముగా నమ్ముదురు. అందుచేతనే ఈ దేశస్థులను ప్రేమించు విదేశీయులకు లేనట్టి శక్తి సుందరసింగుకు కలదు.

'ఒక దీర్ఘదర్శియొక్క వేంద్రముతోను, అపొస్తలునికి గల శక్తితోను, కాషాయపు నిలువుటంగీ ధరించి, నల్లని కొద్దిపాటి గడ్డము గలిగిన యొక యౌవనుడు ప్రసంగించుచున్నాడు. ఆయన పెదవులనుండి వచ్చిన మధుర వాక్కులు వినినప్పుడు హిందూ మతసిద్ధాంతములలో శ్రేష్ఠమైనదంతయు సువార్తవెలుగుచే ప్రకాశించుచున్నట్లు తోచినద'ని యీ దేశపు నొకడు చెప్పెను.

'సుందరసింగు ప్రతిదినము చూచుచుండిన క్రీస్తుయొక్క సౌంద ర్యము ఆయన ముఖమునందు ప్రతిఫలించుచున్నందున ఆ సౌందర్యమును స్పష్టముగా ఇంతవరకు ఎవరిలోను చూడని వివేకులైన కొందరు హిందువులు ఆయనలో ప్రతిబింబించుచున్న అందమైన ముఖవికాసము ఎవరిదని తెలిసి కొన గోరుచున్నారు. సుందరసింగుయొక్క జీవితమే ఆయనకు శక్తిని కలి గించుచున్నది. ఆయన శక్తి మనలో కనబడవలెనని కోరినయెడల ఆయనవలె మనమును జీవింపవలెన'ని యొక అమెరికాదేశస్థుడనెను.

'మన సాధు సుందరసింగుయొక్క శక్తిని వివరింప తరముకాదు. ఆయన తనను ప్రభువే పిలిచెనని నిశ్చయించుకొని సన్యాసి యయ్యెను. సాధువు వేషము ధరించుటలో ఏదో మహిమయైనను పుణ్యమైనను కలదని ఆయన యెంచుటలేదు. ఆయన గంభీరభావము గలిగిన ప్రసంగములు, ఆయన విశేషమైన దైవభక్తితో నిండినవాడని చూపుచున్నవి. ఆయనచెప్పెడి సత్యములన్నియు ఎంతో గంభీరభావము గలవి. ఆయన యుపన్యాసములు తాను కండ్లారచూచి, ప్రకృతిలోనుండి తీసిన దృష్టాంతములతో నిండి యున్నవి. వినువారు ఎన్నటికి మరువలేని సొగసైన యుపమానములచేత తాను చెప్పెడి యంశము మన మనస్సులో నాటుకొనునట్లు చేయును. ఈయన ప్రసంగములు ఇంపైనవి మాత్రమేకాక, ఎంతో శక్తిగలవియునై యున్నవి. క్రైస్తవ సాధువుగా మొట్టమొదట బైలుదేరినవానిలో ఇట్టి దృఢ మైన విశ్వాసమును, క్రీస్తు దివ్యలక్షణములును నిండియుండుట ఇండియా లోని పరిశుద్ధ సంఘమునకు గొప్పలాభమే'యని ఒక యౌవన క్రైస్తవ సమాజపు పత్రికలలో ప్రచురింపబడినది.

సాధు సుందరసింగు వట్టి వైరాగ్యావేశముచే మతి తప్పినవాడు కాడు. తనకు గలిగిన మంచి వరములన్నియు క్రీస్తుప్రభువువలననే కలిగిన వని చెప్పుచుండును. ఆయన యే మతశాఖలోను చేరినవాడుకాడు. ఒంట రిగా నిలువబడి స్వార్థత్యాగబుద్ధితోను శుద్ధమైన మనస్సుతోను యేసు ప్రభువును ప్రేమించి దేవునినామమునకు మహిమకలుగవలెనని, మనుష్యుల యాత్మలు రక్షింపబడవలెనని, ప్రయాసపడుటయందే మన దినములు గడుపుటకు సుందరసింగు మనలను పిలుచుచున్నాడు. ఇట్టి సదుద్దేశములను నెరవేర్చుటయందు తన జీవితకాలమంతయు గడుపుటే పురుషార్థమని సుందర సింగు ఎంచుకొనుచున్నాడు. అందుచేత ఆయన ఆసక్తితో చెప్పెడిమాటలు ఈ దేశస్థులు సులభముగా మరచిపోజాలరు.

## వంశము, జననము

మన సాధువు, సీక్కులను, ఉత్తరదేశమందలి యొక జాతిలో పుట్టిన వాడు. ఈ కులము అనేక కారణములచేత విశేషమైనదని చెప్పవచ్చును. ఇది ఆరంభమందు మత సంస్కరణ చేయుటకు బయలుదేరినను ఒక సత్య మతమును స్థాపింపగోరెను. పిమ్మట క్షత్రియధర్మమైన యుద్ధశౌర్యమును వహించి తమకు కీడుచేసినవారిమీద పగతీర్చుకొనుట కారంభించిరి. అనేక పర్యాయములు హింసపొందినను ఈ కులస్థుల జాతిగర్వము తగ్గలేదు.

'పదునారవ శతాబ్దమందు పంజాబులోనుండిన కల్లోలములలో ఒక మతకక్షిగా బయలుదేరి కొద్దివారుగా నుండిన సీక్కులు, కొంచెము కొంచె ముగా జయమునొంది, ఒక బలమైన రాజ్యమును స్థాపించెన'ని యొక గ్రంథకర్త వ్రాసెను.

'ఐదు నదులు పారెడు పంజాబు' సీక్కుల స్వంతదేశము. తాము ఏలుచునచ్చిన ఆ దేశములో వీరు లెక్కకు కొద్దిమందిగ నున్నారు. అయి నను ఈ జాతివారి బలమునకు కారణము వీరి దైవికమత్యతయు, మతవైరా గ్యమును యుద్ధప్రతాపములే. వీరు దేనినైనను తెగించి చేయుదురు, ఎట్టి కష్టమునైనను ముఖము చిట్లించకుండ సహింతురు. అపజయము నొందినను అధైర్యము నొందరు. తమ గురువులైన నానక్, గోవిందుసింగ్ అనువారి యుద్దేశప్రకారము తమ మతము ఈ దేశమందంతటను వ్యాపించునను దృఢ మైన నమ్మిక వీరికి గలదు.

ఈ జాతివారినిగూర్చి కొన్ని విశేషమైన సంగతులు ఈ పుస్తకము చివరను చూడవచ్చును. వీటినుండి సుందరసింగు ఎట్టి మతావేశముగలవారి మధ్య పెరిగినో తెలియును.

'సీక్కుల నాయకుడు తన రాజకీవిచేతను పౌరుషముచేతను ఎక్కు వైనవాడుగా కనుపించినను, సీక్కుల గురువు తన గాంభీర్యమును దేవుడు తనతో నున్నాడను భక్తియును కనపరచు ముఖవికాసముచేత విశేషమైన వాడుగా కనుపించును. వీరి మతి వైరాగ్యమును, లౌకికవాంఛలును ఇండి యాలో మరి యేజాతివారిలోను కనుపించుట అరుద'ని ఒక చరిత్రకారుడు చెప్పుచున్నాడు.

ఆన 1889 సం॥ సెప్టెంబరునెల 3-వ తేదిని యీ కీర్తి వహించిన కుల మందు సుందరుడు పుట్టెను. ఆయన తండ్రి పాటియాల సంస్థానమందున్న

రాంపూరు అను పట్టణమందు ప్రసిద్ధిగాంచిన సర్దార్ షేర్ సింగను ధనవంతుడైన యొక భూస్వామి. సుందరుడు ఈయనయొక్క కనిష్ఠపుత్రుడై నను తన సహోదరులందరికంటె నున్నతపదవికి వచ్చియున్నాడు. సుందరుని యొక్క అన్న సర్దార్ నాత్ సింగు అనునతడు ఒక సిక్కు సంస్థానములో సేనానాయకుడుగ నున్నాడు. మిగిలినవారు ఇతనికంటె గొప్ప యుద్యోగములలో నున్నారు. సుందరుడు చిన్నతనమందు సుకుమారముగ ధనసంపత్తులో పెంచబడెను.

వేసవికాలమందు తన తల్లిదండ్రులతో సిమ్లా మొదలైన హిమాలయ పర్వతమందలి శీతల ప్రాంతములకు బోవువాడు.

ఆయన తల్లి నాగరికతయు, నధిక సమర్థతయుగలిగి, మూఢభక్తిలేని బుద్ధిమంతురాలైన స్త్రీరత్న మనదగును. అమెరికానుండి వచ్చిన మిషనెరీ దొరసానులు ఈమెకు స్నేహితులై వీరింటికి తరుచుగా బోవుచుండిరి. పసివాడుగా నున్నప్పుడే సుందరుడు తన తల్లిని నధికముగ ప్రేమించుచుండెడి వాడు. ఈయనతల్లియు ఈయనయెడల అత్యంతానురాగము గలిగియుండెను. ఈయన కనిష్ఠుడైనందున తన తల్లిచెంతనే యెల్లప్పు డుండువాడు. నీవు నీ సహోదరులవలె లౌక్యుడవుగ నుండగోరక, నీ యాత్మశాంతిని వెదకి సన్మార్గము ననుసరించి సాధువు కావలెనని తల్లి తరుచుగా జెప్పుచువచ్చెను.

అందుచేత ఈయన మఱి యే జీవనోపాయముమీదను తన మనస్సు పోనీయలేదు. తన కనిష్ఠపుత్రునికి తనకు తెలిసిన సద్బోధనంతయు నేర్పుటకు తండ్రి తాను పోవుచోటికెల్లను ఈయనను తోడుకొనిపోవుచుండెను. ఈయన యేడేండ్లవాడైనప్పుడే సంస్కృతములో భగవద్గీతలన్నియు కంఠత వల్లించెను. ఈయన ప్రీతితో ప్రేమించి స్నేహించిన తల్లి పదునాల్గవ యేట పరలోకగతురాలైనప్పుడు ఆ వియోగమువలన ఈయనకు కలిగిన దుఃఖము వర్ణింప తరముకాదు. నేటికిని ఆమెనుగూర్చి ప్రస్తాపించినప్పుడు ఈయన మాటమందగించి ముఖఃకుడౌను. తన తల్లి సజీవురాలై యున్నయెడల నిప్పుడు తాను పూనిన వ్రతమునుగూర్చి జీవితమునుగూర్చి పరమానందభరితురాలగునని చెప్పుచుండును.

# 2. అధ్యాయము

## సుందరుడు దేవుని వెదకుట

మీరు నన్ను వెదకినయెడల పూర్ణమనస్సుతో నన్నుగూర్చి విచారణ చేయునెడల మీరు నన్ను కనుగొందురు. యిర్మియా 29: 13.

సుగుణసంపత్తియు సన్మార్గమును గలిగి ఘనులనిపించుకొనువా రనేకులు తమ తల్లిదగ్గరనుండగ చిన్నతనమందు పొందిన సన్మార్గ బోధనలచేతనే యిట్టి యౌన్నత్యపదవి నొందిరని సామాన్యముగా నెంతురు. ఆ యభిప్రాయము సుందరసింగుయొక్క జీవితములో విశదమగుచున్నది. ఈయన తన తల్లితోకూడ దేవాలయములకు పోవుచుండెను. అట్టి సమయమందు తల్లి లోకములో మనకుండు సమస్త వైభవములో పరమోత్తమమయినది దైవభక్తియని నేర్పెను. తనకు సన్మార్గము చూపుమని తల్లి తరుచుగ నెంతో భక్తితో వెళ్లి సాధువుల నడుగుచుండెను. అది చూచుటచేత సాధువుయొక్క జీవితము పరమోత్కృష్టమైనదని యీయన మనస్సుకు తట్టెను.

ఇహలోకైశ్వర్యమంతటిలో పరమోత్తమమైనది మనశ్శాంతియనియు, దానిని దేవుడుమాత్రమే ప్రసాదింపగలడనియు, దాని నెంతో భక్తితో వెదకవలసినదనియు, తన తల్లియొక్క వైరాగ్యమునుబట్టి సుందరుడు గ్రహించెను. దీనినిగూర్చి ఆమె తరుచుగ చెప్పుచుండుటచేత నీ యక్షయ నిధి వెదకి సంపాదించవలెననెడి యాశ ఈయనలో నధికముగ వృద్ధి నొందెను. ఈ కారణముచేతనే తనతోటివారిని చూచి దేవాలయపుద్వారము నొద్ద నిలువబడి ముఖము నేలనంటునట్లు సాష్టాంగపడుచు, గురువుల పాదములయొద్ద కూర్చుండుచు, దైవవిచారణచేసిన హిందూబాలుడు, ఇప్పుడు తానే ఆ పరమనిధిని వెదకి కనుగొన బయలుదేరెను.

సీకుల గ్రంథ్ అను వేదమును, హిందువుల వేదగ్రంథములను, మహమ్మదీయుల ఖురానును సుందరుడు విశ్రాంతిలేకుండ చదివి చూచెను. ఇంటిలోనివారందరు నిద్రపోయిన తరువాతనుకూడ నీ గ్రంథములలో నొకదానిని ఈయన జాగ్రత్తగ చదువుకొనుచుండును. అనేక వాక్యములను కంఠతకూడ

వల్లించెను. ఈ వేదములను చదివినకొలది యీయనకు మనోవ్యాకులము ఎక్కువైనదేగాని తాను వెదకిన మనశ్శాంతి దొరకలేదు.

ఆలయములోని పూజారులును, సాధువులును, తన తల్లియును తమ వేదములలోనుండి ఆయా వాక్యములను పఠించిరి కాని యీయనకు తృప్తి కలుగదయ్యె. ఈ విధముగ తన పూర్వుల మతాచారములయందు అతృప్తి నొందియుండిన యీ సమయమందు ఈయన తమ యూరిలోని క్రైస్తవ పాఠశాలకు బంపబడెను. అంతకుముందు సుందరుడు క్రీస్తునుగూర్చి విని యుండలేదు. పాఠశాలలో తనకు నేర్పబడిన బైబిలు పాఠమును అంగీకరింప మనస్సులేక అతడు అందలి సత్యములను తృణీకరించెను.

బైబిలుపాఠము చదువవలసినదని ఉపాధ్యాయుడు చెప్పగానే యీయన రక్తముపొంగి, సిక్కులమైన మేము ఈ వేదము నెందుకు చదువవలెను? గ్రంథ్ అను వేదము మాకులేదా? యని యెంతో తిరస్కారముగ మాటలాడెను. అయినప్పటికి ఈయనయు, ఈయనవంటి ఒక స్నేహితుడును, పాఠశాల చట్టప్రకారము నూతన నిబంధనయొకటి కొనుక్కొనిరి. సుందరసింగు నూతన నిబంధన చదివి దానిబోధ తాను చిన్నప్పటినుండి నేర్చుకొని తన మనస్సులో భద్రపఱచుకొనిన తన మత సిద్ధాంతములకు కేవలము వ్యతిరిక్తముగ నున్నట్లు కనుగొని దానియెడల సహింపశక్యముకాని ద్వేషమును వహించెను. ఈయనలో మత వైరాగ్యముప్పొంగి, తాను భక్తితో నమస్కరించిన మతాభిమానముచేత ఆ పాఠశాలలో క్రీస్తుమతమును ద్వేషించిన యితర బాలురకు మొనగాడయ్యెను. ఈయన బహిరంగముగా నూతన నిబంధన గ్రంథమును చింపి అగ్నిలో కాల్చివేసెను. సుందరుడు చేసిన దుష్కార్యమునుగూర్చి తండ్రి విని: 'నీ విట్లు చేయుట సరికాదు. బైబిలు మంచి గ్రంథమే. నీ కది యిష్టము లేనియెడల మిషనెరీలకు దానిని తిరిగి యిచ్చివేయవలసినద'ని బుద్ధి చెప్పెను.

అంతట తిరిగి తన మతగ్రంథములలో తన తల్లి చెప్పిన మనశ్శాంతి కనుగొనవలెనను నిశ్చయముతో వెదక మొదలు పెట్టెను. ఆయన హిందు మతసిద్ధాంతములను, వేదములను బహుప్రయాసముతో పఠించుటేకాక, ఒక హిందూసాధువునొద్ద యోగాభ్యాసము చేసి మైమఱచి సమాధియందుండుటయు నేర్చుకొనెను. అందువల్ల తత్కాలమునకు కొంత ఉపశమనము కలిగినను, తిరిగి ఒడ్లు తెలిసినప్పుడు మునుపటికంటె నెక్కువ దురవస్థపాలయ్యెను. ఆయన క్రీస్తుమతమును ద్వేషించినందున మిషను పాఠశాలను

విడిచి మూడుమైళ్ల దూరములో నున్న సర్కారు పాఠశాలలో ప్రవేశించెను. కాని యెండలో ప్రతిదినము నడిచినందున వ్యాధిగ్రస్తుడై తిరిగి మిషను పాఠశాలలోనే వచ్చిచేరెను.

ఈ కాలమంతయు ఈయన మతవిచారణ విడువలేదు. ఈయన మనస్సు 'శాంతి శాంతి' యని అంగలార్చుచుండెను. ఈ శాంతియను హిందీ పదము సమాధానమని మాత్రము కాదు, ఆత్మకు పరిపూర్ణమైన తృప్తియని అర్థము గలది. ఈయన యెంతమట్టుకు దీనిని వెదకినను ఈయన ఆత్మదాహము అధికమయ్యెనేగాని తీరలేదు.

మిషను పాఠశాలలో బైబిలులోని కథలును, క్రీస్తు నామమును తిరిగి వినుటచేత అతని మనస్సులో క్రీస్తుయెడలను, క్రైస్తవ మతమందును పూర్వము కంటె నధికమైన ద్వేషము పుట్టెను. అందుచే నొకప్పుడు ఒక మిషనెరీ నీడ తనమీద పడినందున నైలు సోకినదని యొక గంటసేపు స్నానముచేసి శుద్ధిచేసికొనెను. తాను ఆసక్తితో వెదకినను ఇంతవరకు దొరకనటువంటి శాంతియను వెలలేని ముత్యమును క్రైస్తవ వేదమునందు వెదకవలెననెడు తలంపు కలలోనైనను పుట్టకపోయెను. ఈ మూర్ఖమైన వైరాగ్యము కలిగి యున్న కాలము తన మనస్సుకు బహు కష్టమైన కాలమయి యుండెనని సుందరుడు చెప్పుచుండెను.

## సుందరుని దేవుడు పిలుచుట

నీతికొరకు ఆకలిదప్పులు గలవారు ధన్యులు, వారు తృప్తిపరచబడుదురు. (మత్తయి 5: 6) నా యొద్దకు రండి; నేను మీకు విశ్రాంతి కలుగజేతును. (మత్తయి 11: 28).

ఇంతవరకు దేవుడు సుందరుని ఆయన ఎరుగనటువంటి మార్గమున నడిపించెను. అది అంతకంతకు అంధకారములోనికి ఆయనను నడిపించుచు న్నట్టు కనుపించెను. తనకు తెలిసిన మతములన్నిటిని పరీక్షించినను, అనేక మంది గురువులబోధను వినియుండినను, ఆయన వాంఛించిన శాంతిని పొందలేదు. ఇట్లు ఆశాభంగము పొందినను నిరాశ చేసికొనక సుందరుడు తన మనస్సులో నింతవరకు తిరస్కరించి నాశనము చేయజూచిన యీ అన్య వేదములో మనశ్శాంతి నొకసారి వెదకిచూతమనెడు మంచి యుద్దేశము ఈయనకు దేవుని కృపచేతనే పుట్టెనని చెప్పవలయును. సుందరుడు నూతన

నిబంధన తిరిగి చదువ నారంభించెను. ఎంతో దుఃఖముతోను, రక్షణ వెదకి కనుగొనగలవా యను సందేహముతోను నిండిన సుందరుని చెవులలో 'నా యొద్దకు రండి; నేను మీకు విశ్రాంతి కలుగచేతున'ను మధుర వాక్కులు కనబడెను. యేసుప్రభువుయొక్క మధురమైనపలుకు చెవినిపడిన నాటినుండి క్రీస్తుయొక్క సిలువలో నొక విశేషమైన మహిమ ఆయనకు కనుపించెను. సహాధ్యాయులతో కూడ క్రీస్తుమతమును దూషించుట మానివేసెను. కొన్ని సమయములందు క్రైస్తవుడైన యొక యుపాధ్యాయునితో బహు ఆసక్తితో మాటలాడుచుండును. ఈ మార్పును కనిపెట్టిన కొందరు దానినిగూర్చి సుందరుని తండ్రితో చెప్పిరి. కాని యీయన భక్తిపరురాలైన తన తల్లి యొక్క సిక్కుమతమునుగూర్చి బాగుగ నేర్చుకొనియుండెను గనుక ఆ మతాభిమాన మీయన మనస్సులో లోతుగా నాటబడియున్నదని తండ్రి అజాగ్రత్తగ నుండెను.

కాని సువార్తసత్యము ఆయన హృదయములో ప్రవేశించి పనిచేసెను. 'దేవుడు లోకము నెంతో ప్రేమించెను. కాగా ఆయన తన అద్వితీయ కుమారుడుగా పుట్టినవానియందు విశ్వాసముంచు ప్రతివాడును నశింపక నిత్యజీవము పొందునట్లు ఆయనను అనుగ్రహించెన'ను వాక్యము పుండుగా నున్న సుందరునిమనస్సుకు ఆరోగ్యము నిచ్చు తైలమువలె నుండెను. కాని ఆయన భయమును సందేహమునుదీర్చి దృఢనిశ్చయునిగ జేయుటకు ఏమియు కనుపించదయ్యెను. గనుక నొక రాత్రియందు మరునాటి ప్రాతఃకాలమునకు ముందుగనే ఇహమందైనను పరమందైనను ఇట్టి అనిశ్చయమైన స్థితిలో నుండి విడిపింపబడవలెనని తీర్మానించుకొనెను. ఇట్టి సమయమందు లూడీ యానానుండి పొగబండి తన యింటిప్రక్కగా ఉదయమున నైదుగంటలకు పోవునని ఆయనకు జ్ఞాపకము వచ్చెను. పొగబండి క్రిందపడి ఆత్మహత్య చేసికొని తన మనఃక్లేశమును అర్చుకొనుట పాపమని తోచనందున అట్లు చేయ నిశ్చయించుకొనెను.

హిందువుల యాచారప్రకారము సుందరుడు స్నానముచేసి నూతన నిబంధన చేతపట్టుకొని తన చివరరాత్రియని యెంచుకొనిన యారాత్రిని వేదపారాయణమందును, ధ్యానమందును, ప్రార్థనయందును, గడుపుటకు తన గదిలోనికి పోయెను. సూర్యోదయమునకు కొంచెము ముందుగ దేవుని కృపచేత నొక యద్భుతమైన దర్శనము ఆయనకు కలిగెను. ఒక ప్రకాశ మానమైన మేఘము ఆయనయుండిన గదిని నింపెను. దాని మధ్యమందు క్రీస్తు

నాధుని ప్రకాశించుచున్న స్వరూపము చల్లని ముఖముతో ఆయనకు కనుపించెను. మరియు ఆ క్రీస్తుప్రభువు తనతో, 'నీవు నన్నెందు కెదిరించుచున్నావు? నేనే నీ రక్షకుడను. నీ కొరకు సిలువ మ్రానుమీద నా ప్రాణము పెట్టితి' నని చెప్పినట్టుండెను. ప్రేమతోను కనికరముతోను నిండిన యీ దివ్యమైన ముఖమును చూడగానే సుందరుని హృదయమందుండిన ద్వేషము మాయమైపోయెను. ఆ నిమిషములోనే, సుందరుడు అనేక సంవత్సరముల నుండి ఆశతో వెదకుచుండిన శాంతి ఆయన హృదయములో నుదయించెను. ఆయన మోకాళ్లమీదనుండి లేవగానే యీ పరమదర్శనము అదృశ్యమయ్యెను. కాని క్రీస్తు నాటినుండి నేటివరకు ఆయన హృదయకమలమును ఒక నిమిషమాత్రమైనను విడిచిపోలేదు. నాడు ఆయన హృదయమును నింపిన సమాధానము నేటికిని ఆయనకు అతి శ్రేష్ఠమైన ధనముగా నున్నది. మనస్సులో సంతోష ముప్పొంగగా ఆయన తన తండ్రిగారి గదిలోకి వెళ్లి 'నేనిప్పుడు క్రైస్తవుడనై యున్నా'నని చెప్పెను. కుమారుడు నిజముగా నిట్లు చెప్పెనని తండ్రి నమ్ముట కిష్టములేక, కుమారుని పరుండి విశ్రాంతితీసికొనుమని చెప్పి మోసమేమియు రాదని యెంచి తిరిగి నిద్రపోయెను. కాని మరువ శక్యము కాని ఆ రాత్రిలో ముండ్లకిరీటధారియైన యేసునాధుడు తన అడుగుజాడలను వెంబడింప సుందరుని పిలిచెను. అప్పటినుండి క్రీస్తు సిలువద్వారా రక్షకుని సముఖము చేరువరకు, సుందరుడు సిలువనుగూర్చి అతిశయించుచు దాని మహిమనే ప్రకటింపవలెనని తీర్మానము చేసికొనెను.

## శ్రమ ననుభవించుటకు పిలువబడుట—1

ఒక మనుష్యుని యింటివారే అతనికి శత్రువులగుదురు. మత్తయి 10: 36.

క్రీస్తునందు విశ్వాసముంచుట మాత్రమేకాక, ఆయనపక్షమున శ్రమపడుటయు ఆయన పక్షముగ మీ కనుగ్రహింపబడెను. ఫిలి. 1: 30.

యేసుక్రీస్తునుగూర్చిన అతిశ్రేష్ఠమైన జ్ఞానము నిమిత్తమును, ఆయన శ్రమలలో పాలివాడనగుట యెట్టిదో యెరుగు నిమిత్తమును, సమస్తమును నష్టముగా నెంచుకొనుచున్నాను. ఫిలి. 3: 8–10.

సుందరసింగు క్రీస్తు ననుసరించిన తరువాత తొమ్మిది మాసములవరకు తండ్రియింటనుండెను. ఆ కాలమంతయు ఆయనకు శ్రమమీద శ్రమ కూడుకొనెను. ఎంతో భయంకరమైన ఉపద్రవములు ఆయనకు కలిగెను.

యేసునాథుని తన గురువుగ సుందరు డంగీకరించెనని వినిన ఆయన యింటివారు ఈ సంగతి తమ చెవిని పడుటయే తమకెంతో దోషమని యెంచిరి. కీర్తి ప్రఖ్యాతులుగల మావంటి యగ్రజాతిలో చేరిన యొకడు తిరస్కారింపబడిన హీనజాతివారైన క్రైస్తవులలో చేరునని కలలోనైనను తలంచరాదని సుందరుని బంధువులు చెప్పదొడగిరి. ఇంత హీనమైన వెర్రితలంపును సుందరుడు విడిచిపెట్ట వలసినదని ఆయనతండ్రి బహు ఆసక్తితో బ్రతిమాలెను. నీవు జన్మించిన కులముయొక్క గొప్పతనమును నీకు రాగల ఔన్నత్యపదవిని తలంచుకొని యీ వెర్రితనమునుండి తిరుగుమని పలుమారులు తండ్రి సుందరునితో చెప్పెను. ధనసంపత్తులతో తులతూగుచు, తన జనుల కుండు గౌరవమును పొందుచు, సుఖపడగలవని యెంతచెప్పినను సుందరుడు వినకుండుట తండ్రి కనిపెట్టి, తనకును, తన కుటుంబమునకును, కులహీనులని యెంచబడు క్రైస్తవులతో సుందరుడు కలియుటచేత కలిగెడు అపకీర్తిని, అవమానమును స్పష్టముగా దెలిసి సుందరుడు చేసికొనిన తీర్మానమును మార్చుకొనునట్లు చేయుటకు ఎంతో ప్రయత్నించెను. కుమారుని హృదయమును, ఆ హృదయములో తన తల్లియెడలను, బంధువులయెడల నున్న యభిమానమును తండ్రి యెరుగును గనుక సుందరునితో నిట్లు మాటలాడుటచేత ఆయనను వశపరచుకొన తలంచెను.

తన కుటుంబముయొక్క ప్రఖ్యాతికి భంగము కలుగజేయుటనుగూర్చి సుందరుడు తలంచినపుడు ఆయన హృదయము బ్రద్దలై తాను పూనుకొనిన కార్యమును విడిచిపెట్టుట ధర్మమగునోయని సందేహింప దొడగెను. దీనితో పాటు నీడవలె కనుపించి మాయమై పోవునట్టి బంగారము, ఇహలోక మహిమ, డంబమంతయు నిత్యముగా నిలుచునట్లు కనుపించి ఆయనను మోసపుచ్చునట్లుండెను. అయినప్పటికి మనశ్శాంతి దొరకలేదను నిరాశాంధకారమునుండి సుందరుని క్రీస్తునాథుని సిలువయొక్క ప్రకాశమానమైన వెలుగులోనికి తెచ్చిన పరమతండ్రి ఆయనను లోకాశలను వలలో చిక్కుకొనకుండ కాపాడ బూనుకొనెను. తండ్రినైనను, తల్లినైనను నాకంటె నెక్కువగా ప్రేమించువాడు నాకు పాత్రుడుకాడు. తన సిలువ నెత్తుకొని నన్ను వెంబడింపనివాడు నాకు పాత్రుడు కాడని యేసుప్రభువు తానే ఆయన చెవిలో మిక్కిలి నిమ్మళమైన శబ్దముతో చెప్పినట్లుండెను. అయినను తండ్రి కంట నీరు జారుట జూచినప్పుడు సుందరుని హృదయము అగ్నిసమీపమందున్న మైనమువలె నుండెను. నాయనా! నేను మిమ్మును

పరిపూర్ణముగా ప్రేమించుచున్నానని చెప్పుచుండగ, తనను వెంబడింపుమని పిలిచిన పరమతండ్రియొక్క అధికమైన ప్రేమనుగూర్చి చెప్పుటకు పైనుండి శక్తిగలిగి, నేనాయనకు లోబడవలెనని నిబ్బరముగ జెప్పెను. తండ్రికిని, కుమారునికిని నడచిన పరితాపకరమైన వాగ్వాదమును ఇంక వివరింప తరము కాదు.

సుందరుని మనస్సును మార్చుటకు తాను చేసిన ప్రయత్నమంతయు వ్యర్థమైనదని తండ్రి కనిపెట్టి మరియొక యుపాయమును చేయ నుద్దేశించి ప్రఖ్యాతిపరుడును, ద్రవ్యసంపన్నుడునైన తన సహోదరుని పిలిపించెను. ఈయన సుందరుని తన మేడకు గొనిపోయి తలుపువేసెను. అదిచూచి సుందరుడు తన చివరిగడియ వచ్చెనని భయపడెను. కాని, ఆయన పినతండ్రి కీడేమియు చేయక, తాళము తీసికొని ఒక పెద్ద యినుపపెట్టె తెరచెను. సుందరుడు కలలోనైనను చూడని ద్రవ్యము ఆయన కన్నులయెందర నుండెను. బ్యాంకినోట్లును, వెలలేనినగలును, బంగారు వెండి నాణెములును అతివిస్తారముగ నుండెను. నీవు క్రైస్తవుడవైనందున మా కులమునకు కలుగు అపకీర్తి మాకు లేకుండజేయుమని తానెంతో వినయముతో బ్రతిమాలుచున్నానని తెలుపుటకు తలమీది పాగాతీసి సుందరుని పాదములయొద్ద నుంచెను. ఇంతియేకాక నీవు మాతో నున్నయెడల నీవు చూచుచున్న యీ ద్రవ్యమంతయు నీ దగునని వాగ్దత్తము చేసెను.

సుందరుడు ఆ ధనమును చూచినప్పుడు ఆయనలో డబ్బాశ పుట్టుటయేకాక, తనకంటె పెద్దవాడైన తన పినతండ్రి కుటుంబములో నందరికంటె చిన్నవాడైన తన ముందర తన నింతగా తగ్గించుకొనెను గదా యను వ్యసనము అధికముగా నుండెను. తాను ప్రేమించినవారికి కలిగింపబోవు అపకీర్తిని సూచించునట్టి తన పినతండ్రి తలపాగా తన పాదములయొద్ద పడియుండుట చూచినప్పుడు సుందరునికంట నీరుజారెను. ఈ సమయమందును క్రీస్తునందు గల భక్తితోను, ప్రేమతోను, ఆయన హృదయము నిండి, వ్యసనము లేశమయినను లేకుండ ఈ ధనము నా కక్కరలేదని సుందరుడు చెప్పగలిగెను. ఇట్లు చెప్పి లోభనను జయించగానే తన ప్రియరక్షకుడు తనను అంగీకరించెనను నిశ్చయము మనస్సులో కలిగెను. అందుచేత తన ప్రభువుకు చివరవరకు నమ్మకముగ నుందునని చేసికొనిన తీర్మానమును దృఢపడెను. అప్పటినుండి సుందరుడు కుమారుడు కాడుగాని, కులహీనుడైన చండాలుడుగ నెంచబడునని తండ్రి స్పష్టముగా దెలిపెను.

సుందరుడు మాత్రమే కాక ఆయన సిక్కు సహాధ్యాయుడైన మరి యొకడును నూతన నిబంధన చదివి క్రీస్తునాధుని సద్గురువని కనుగొని ఆయన పాదములు పట్టెను. ఈయనయు, సుందరుడును, తక్కువ వయస్సు గలవా రైనందున తమ యిండ్లలోనే యుండవలసివచ్చెను. సుందరసింగు స్నేహితుని బంధువులు తమ యూరిలోని అమెరికన్ మిషనెరీలు తమ కుమారుని క్రైస్తవుని కమ్మని బలవంతము చేయుచున్నారని వారిమీద అబద్ధపుఫిర్యాదు కోర్టులో తెచ్చిరి. కాని యీ చిన్నవాడు మేజిస్ట్రేటుముందర నిలువబడి తాను క్రీస్తునందు నిజమైన విశ్వాసముగలవాడనై యున్నాననియు, అది యీ పాదిరీల బలవంతమువలన కలుగలేదుగాని తన చేతిలోనున్న ఇంజీలు (నూతన నిబంధన) జాగ్రత్తతో చదువుటవలన తనకు కలిగిన యొక భాగ్యమనియు ధైర్యముతో సాక్ష్యమిచ్చెను. అందుచేత మిషనెరీలమీద తేబడిన ఫిర్యాదు అబద్ధమని కొట్టివేయబడెను. పిమ్మట కొంతకాలమువరకు వీరిద్దరు తమ యిండ్లలోనే యుండవలసివచ్చెను.

ఈ దినములలోసుందరు డనుభవించిన హింసలు వర్ణింప తరము కాదు. తమ తంత్రములన్నియు సుందరుడు చేసికొనిన తీర్మానమునుండి త్రిప్పలేక పోయినవని కనిపెట్టి ఆయన స్వజనులు ఆయనను అధికముగ ద్వేషించిరి. ఆయన సహోదరుడే గొప్ప శత్రువై, ప్రతిదినము ఆయనను ఘోరముగ హింసించెను. సుందరునిమీదను, సుందరుని యేసుక్రీస్తుమీదను వారాడిన దూషణలకు మితములేదు. సుందరుడు నూతన నిబంధన చదువు కొని తన యాత్మకు ఆదరణను పొందగోరితే, ఆయన ఏకాంతముగ తన బంధువులకు కనబడకుండ పోవలసివచ్చెను. ఆయనను మిషన్ పాఠశాలకు పోనియ్యలేదు. అక్కడ కలుగుచున్న హింసలచేత ఆ పాఠశాలకూడా మూసి వేయవలసి వచ్చెను. మరియు ఆ గ్రామములోనుండి కొద్ది క్రైస్తవసంఘము అక్కడి అంగళ్లలో ఆహారపదార్థములుకూడా కొనుటకు వీలులేనందున ఊరువిడిచి పోవలసివచ్చెను.

బంధువుల ఆగ్రహము ప్రచండముగ నున్నందున సుందరుడు తండ్రి యింటనుండుటకు అసాధ్యమని కనిపెట్టి అమెరికన్ మిషన్ ముఖ్యస్థాన మైన లూడియానాకు తప్పించుకొనిపోయెను. అక్కడి మిషనెరీలు ఆయనను దయతో చేర్చుకొని, కులమునకు భంగము కలిగినదని బంధువులు చెప్ప కుండునట్లు ఆయనకు భోజనము ప్రత్యేకముగ చేయించిరి. ఆయన పాఠ శాలలో ప్రవేశించి విద్యాభ్యాసము చేయుచుండెను. క్రైస్తవ బ్రతుకును

గూర్చి ఆయన గొప్ప తాత్పర్యము కలిగియుండినందున, యా పాఠశాల లోని క్రైస్తవబాలురు పేరుకుమాత్రము క్రైస్తవులై యుండిరని కనిపెట్టెను. కొందరి నడతయు ఆయనకు సరిపడలేదు. అందుల కాయన ఆశాభంగము నొంది, పాఠశాలను విడిచి తన యింటికి తిరిగి వెళ్లిపోయెను. రామపురము నకు సుందరుడు తిరిగి రాగానే, ఆయన క్రీస్తుమతమును విసర్జించెనని యెంచి బంధువులు ప్రేమజూపిరి; కాని, తమ పొరబాటును వారు త్వరలోనే కను గొనిరి. సుందరుడు పూర్వముకంటె నధిక వైరాగ్యముతో యేసుప్రభు వును ప్రేమించుచుండెను.

సిక్కుల గ్రంథ్ అను వేదములో తలవెంట్రుకలు ఎన్నడును కత్తిరించ కూడదని చెప్పియున్నది. గనుక సిక్కు భక్తులందరును తమ పొడుగైన జుట్టునుగూర్చి సహజముగా నతిశయించుదురు. ఈ నియమమును ఇంతవరకు గైకొనిన సుందరుడు, ఇప్పుడు తన మతమును విసర్జించి క్రీస్తుమతము నవలం బించితినని ప్రచురపరచుటకు తన పొడుగైన సిగను కత్తిరించివేసెను. ఇందు మూలముగ నాయన తన మతమును, కులస్థులను, బంధువులను కేవలము విస ర్జించినట్టు తెలిపెను. ఈ దేశములో ఆయా జాతులవారు నిడుపైన జుట్టును ఎంతో గొప్పగా నెంచుదురు. అగ్రజాతిలోచేరిన యొక హిందువు క్రైస్తవు డగునపుడు సాధారణముగా ఈ మర్యాద సూచకమైన జుట్టును విసర్జించును. సుందరు డిట్లుచేసినతోడనే కులములోనుండి వెలివేయబడెను. ఆయనను అధికముగ ప్రేమించినవారుసహా నీచాతినీచునిగ జూచిరి. 'లోకమునకు మురికిగాను అందరికి పెంటగా ఎంచబడియున్నా'మని అపొస్తలుడైన పౌలు చెప్పినట్లు, పదునారేండ్లబాలుడైన సుందరుని కిప్పుడు సంభవించెను. ఆయనను ఇంటివెలపలనుంచి అన్నము పెట్టిరి. అక్కడనే ఆయన పరుండ వలసి వచ్చెను. అంటరాని కులహీనునివలె నాయనను ఇంటిలోనుండి బయటికి త్రోసివేసిన మొదటిదినమందు ఆయన కన్నీరు ధారగా కార్చెను. ఈ సిలువ ఆయనకు భరింప శక్యముగాకుండెను.

ఇది జరిగిన కొన్నాళ్లకు సభాసంస్థానములో పనిచేయుచున్న సుందరుని బంధువుడొకడు ఆయనను తన యింటికి తీసికొనివెళ్లి, ఆయన మనస్సు మార్చ వలెనని ప్రయత్నించెను. సభారాజా ఈ సంగతి విని సుందరుని తన సముఖమునకు పిలిపించి, అట్లు చేయుట సరియా యని యడిగెను. రాజా, తన పలుకుబడిచేతను, గొప్ప ఉద్యోగము నిచ్చెదనని వాగ్దత్తము చేయుట చేతను, సుందరుని మనస్సు మార్చ ప్రయత్నించెను గాని లాభములేక

పోయెను. సీక్కువైన నీవు సింగ మనిపించుకొనుటకు బదులు, క్రైస్తవుడవై కుక్క యనిపించుకొనుటకు సిగ్గులేదా యని రాజా హేళనచేసెను. ఈ పర్యాయము సుందరుడు నయవచనములచేతకాని, పరిహాసముచేతకాని మోసపోలేదు. దేవుని కృపాసహాయము లాయనకుండుటచే లోకైశ్వర్యములమీది యాశను, ప్రాణమునుమాత్రము తీసివేయగల మనుష్యుని భయమును జయింపగలిగెను.

సుందరుడు తండ్రి యింటికి తిరిగి వచ్చినప్పుడు ఆయన ఇంతవరకు అణచియుంచుకొని యాగ్రహమునంతను ఆయనమీద జూపెను. తండ్రి ఆయనను దూషించి, శపించి, 'నీవు నా కుమారుడవు కావు, రేపే నా యిల్లువిడిచి పోవలసినది'ని చెప్పెను. ఆ రాత్రి తమ యింటి అరుగుమీద చివరిపర్యాయము సుందరుడు పరుండి, తండ్రియొక్క కఠినోక్తులను తలపోయుచుండెను. మరునాడు సూర్యోదయము కాకమునుపు తాను ధరించిన వస్త్రములును, పాటియాలా పోవుటకు రైలుఖర్చులును తప్ప మరి యేమియు లేకుండ, సుందరుడు తన యింటిలోనుండి వెడలగొట్టబడెను. స్వగృహము, బంధుమిత్రులు, లేనివాడై తాను పసితనమునుండి ప్రేమతో పెంచబడిన యింటిని విడిచిపెట్టి యేకాకిగ బయలుదేరెను.

యేసు, నాదు సిల్వనెత్తి
నిన్ను వెంబడింతును;
దిక్కుమాలియున్న నేను
నిన్ను నాశ్రయింతును.

## శ్రమ ననుభవించుటకు పిలువబడెను—2

నీవు పిలువబడి అనేక సాక్షులయెదుట మంచి యొప్పుకోలు నొప్పుకొంటివి. 1 తిమో. 6: 12.

సుందరుడు పొగబండిలో కూర్చుండి వెళ్లుచుండగ, లోపూరను గ్రామములో కొందరు క్రైస్తవులున్నట్టు ఆయనకు జ్ఞాపకమునకు వచ్చెను. వీరిలో కొందరు రామాపురములో సుందరుని బంధువులవలన కలిగిన శ్రమలు తప్పించుకొని పారిపోయినవారు. గనుక లోపూరులో దిగి అక్కడిబోధకుని యింటికి వెళ్లెను. ఆయనయు ఆయన భార్యయు బహు మంచివారు. సుందరుడు ఈ సమయమందు వీరి శరణుజొచ్చినది దైవికముగా జరిగిన సంగతియే.

ఎందుకనిన, ఇక్కడికి వచ్చిచేరగానే సుందరునికి ఘోరమైన జబ్బు సంభవించెను. ఆయన జీవముతో క్రైస్తవుడుగ తిరిగినయెడల తమకు కలుగు అవమానమును తప్పించుకొనుటకు, ఆయన రైలుబండిలోనే చనిపోవలెనని ఆయనకు చివరపెట్టిన అన్నములో ఆయన యింటివారు విషము పెట్టిరి. వైద్యుడు వచ్చి ఆయనను చూచి విషప్రయోగమువల్ల కలిగిన యీ రోగము నుండి తప్పించుకొని బ్రతుకలేడు; రేపు ఉదయమున నేను ఈయన భూస్థాపనకే రావలసియుండునని దుఃఖముతో చెప్పి వెళ్లిపోయెను. ఆ రాత్రంతయు నిద్రపోకుండ బోధకునిభార్య వైద్యుడు చెప్పినట్టు ఆయన ప్రాణము పోవునని కనిపెట్టుకొని యుండెను.

సుందరుని నోటనుండి రక్తము ప్రవహించుచున్నందున మరణవేదన పడుచుండెను. ఆయన బల ముడిగిపోవుచు అక్కడ పరుండగా, అంధకారమునుండి యిన్ని శ్రమలగుండ తన వెలుగులోనికి పిలిచిన దేవుడు, క్రీస్తు ప్రభువునందు తన కుండిన విశ్వాసమునుగూర్చి సాక్ష్య మియ్యకుండ చనిపోనియ్యడను దృఢవిశ్వాసము గలవాడై, శేషించిన తన భక్తితో ప్రార్థింప దొడగెను. ఉదయ మగునరకు సుందరు డింకను సజీవుడుగ నుండెను, గాని బలహీనత యధికముగనుండెను. వైద్యుడు చెప్పినట్టు ఉదయమున తిరిగివచ్చి సుందరు డింకను బ్రతికియుండుట జూచి ఆశ్చర్యపడెను. సుందరునియొక్క ప్రార్థనలో తన వైద్యముకంటె నెక్కువ శక్తియున్నదని కనిపెట్టి, యీయనయు ఒక నూతన నిబంధన కొనుక్కొని చదువ నారంభించెను. ఇప్పుడాయన క్రీస్తుదాసుడై బర్మాదేశములో క్రీస్తుమతమును బోధించుచున్నాడు.

సుందరుని స్నేహితుడుకూడా క్రైస్తవుడై, ఆయనవలెనే హింస ననుభవించి, చివరకు తన బంధువులవల్ల పెట్టబడిన విషమును తినెను. సుందరుడు వ్యాధిగా నున్నప్పుడు ఈయనయు బహు జబ్బుపడెను. ఈయన స్వల్పాయుష్యము ముగించు సమయమందుకూడ క్రీస్తునందు తనకున్న విశ్వాసమును గూర్చి యితరులకు చెలుపుచు తన విమోచకుడైన ప్రభువుతో నిత్యముగా నుండుటకు ఆయన పరమసన్నిధికి వెళ్లెను.

ప్రయాణము చేయుటకు చాలినంత బలము పట్టగానే సుందరుడు లూడియానకు వెళ్లి, అక్కడనున్న మిషనెరీలయొద్ద నుండెను. అప్పుడును ఆయన బంధువులు ఆయనను తీసికొనిపోవుటకు అనేకసార్లు ప్రయత్నించిరి. ఒకప్పు డాయనను కొట్టి బాధ పెట్టినందున పోలీసువారిని పిలిపించవలసి వచ్చెను. కాని వీటన్నిటికంటె ఆయన మనస్సునకు ఎక్కువ కష్టము ఆయన

తండ్రి చివరసారి వచ్చినప్పుడు కలిగెను. దుఃఖమువలన ముఖము మారి, వయోవృద్ధుడైన యా తండ్రి, ఆయన తల్లియొక్క ప్రేమనుగూర్చియు, కుటుంబములో కనిష్ఠుడైనందున యింటిలో ఆయనకు చూపబడిన అనురాగ మునుగూర్చియు ఏడ్చుచు చెప్పినప్పుడు, పసితనమునందు గారాబముతో పెంచబడిన యా యింటిలోని సౌఖ్యపదవియంతయు జ్ఞప్తికి వచ్చెను. సుంద రుని కంటజారిన నీరు ఆయన చెక్కిళ్లు మండునట్లు చేసెను. ఆయన హృద యములో తన బంధువులయెడల నున్న ప్రేమచే గొప్ప పోరాటము కలిగెను. ఈ యుద్ధ మాయన ఒంటరిగ చేయలేదు. కాని ఆయన ప్రేమించిన యా ప్రభువు ప్రక్కనుండి తన సిలువ నెత్తుకొని తనను వెంబడించుటకు కావలసిన శక్తి ననుగ్రహించెను.

తండ్రి యీ చివరిసారికూడా ఆయన మనస్సును త్రిప్పలేక యింటికి తిరిగిపోవునప్పుడు, సుందరుడు తన బంధువులమీది యపేక్షనంతను క్రీస్తు కొరకు ధారపోసెను. ఈ విధముగ నిహలోక సంపత్తునంతను విసర్జించిన సుందరుని ప్రభు వంగీకరించి తన సేవకునిగ జేసికొనెను. శ్రమలతోను శోధ నలతోను నిండిన యీ మాసములు సుందరునకు గొప్ప పరీక్ష దినములుగ నుండెను. ఆయనకు వచ్చిన ప్రతి కష్టమును ఆయనకు మనోనిబ్బరము, ప్రేమ, సహనము మొదలైన సుగుణములను కలిగించి, ఆయనను ప్రభువు కెంతో ప్రియశిష్యునిగ జేసెననుటకు సందేహములేదు.

ఈ సంగతులు జరిగిన పిమ్మట బంధువుల హింసనుండి సుందరుని కాపాడుటకు సిమ్లాకు ఇరువదిమూడు మైళ్లదూరములో సబాటు అను గ్రామ ములో నున్న అమెరికన్ మిషనరీలయొద్దకు పంపిరి. అక్కడాయన మనస్సం తయు తనకు ప్రియమైన నూతన నిబంధన గ్రంథమును పఠించుట కీయ గలిగెను. లోకబంధకములనుండి విముక్తుడైనందున క్రీస్తు ప్రభువును బాప్తి స్మముద్వారా బహిరంగముగ నొప్పుకొనవలెనను ఆశ అంతకంతకు వృద్ధి యయ్యెను. అట్లు చేయుటకు తనకు సెలవియ్యుమని యనేక పర్యాయము లడిగి, చివరకు ఆయన జన్మదినమైన 1905-వ సం॥ సెప్టెంబరు మూడవతేదీని రెవరెండు జే. రెడ్మన్ దొరగారిచే సిమ్లాలోనున్న ఇంగ్లాండు సభాలయ ములో సుందరుడు దీక్షాస్నానము పొందెను. మరునాడు సబాటుకు తిరిగి వెళ్లెను. బాప్తిస్మమందు క్రీస్తుతోగూడ పాతిపెట్టబడి, విశ్వాసముచేత ఆయ నతోకూడ లేచితినను తెలివికలిగి, ఆయన హృదయము ఆనందముతో నిండి పొర్లుచుండెను. (కొలొస్సై 2: 12.) గతించిన మాసములలోనుండిన శ్రమ,

మనోవ్యాకులమంతయు, తన ప్రియరక్షకుని నామము ధరింప కలిగినందున సంతోషములో మరుగుబడిపోయెను.

తనను రక్షించిన క్రీస్తుప్రభువు ప్రేమనుగూర్చి యితరులకు ప్రకటింపవలెనను నేడు ఆశ సుందరునకు కలిగెను. మరియు సాధువుగా సుందరు తన జీవమును ప్రతిష్ఠించుకొనవలెనని బహుకాలమునుండి నిరీక్షించుచుండెను. మనశ్శాంతికొరకు దేవుని కష్టముతో వెతుకుచుండిన దినములలో దైవకృపచే తనకా శాంతి దొరికినయెడల, ఇహమందలి సౌఖ్యముల నన్నిటిని పరిత్యజించి, తనను దేవునికి సమర్పించుకొందునని వ్రతము చేసికొనెను. ఆ తీర్మానము నిప్పుడు నెరవేర్చుకొనుటకు వీలు కలిగినదని యెంచి యెన్ని కష్టములున్నను క్రీస్తు ప్రభువుకు తన జీవితమును సమర్పించుకొన నిశ్చయించెను. ఆయన యొద్దనున్న పుస్తకములను ఇతర సామగ్రిని అమ్మివేసి 1905 సం॥ అక్టోబరు నెల ఆరవ తేదీని, బాప్తిస్మము పొందిన ముప్పదిమూడవదినమందు సాధువు వ్రతము పట్టినవానికి గురుతైన కాషాయవస్త్రమును ధరించెను. పాదరక్షలుగాని, జీవనాధారముగాని, ఏమియులేకుండ, చేత నూతన నిబంధనమాత్రము పట్టుకొని, తన ప్రభువుతో కూడ సాధు సుందరసింగు సువార్త బోధచేయుటకు బయలుదేరెను.

## దేవుని సేవకొరకు పిలువబడుట

తల్లిగర్భమునందు పడినది మొదలుకొని నన్ను ప్రత్యేకపరచి తన కృపచేత నన్ను పిలిచిన దేవుడు నేను అన్యజనులలో తన కుమారుని ప్రకటింపవలెనని ఆయనను నాయందు బయలుపరచననుగ్రహించెను. గలతీ. 1: 15–16.

మీరు యెరూషలేములోను........నాకు సాక్షులై యుందురు. అపో. 1: 8.

సుందరుడు అనుభవింప నిశ్చయించుకొనిన స్వార్థత్యాగమును, కష్టములను, లోకములో బహు కొద్దిమంది అనుభవింప గలుగుదురు. హిందూ మతములనుండి క్రీస్తునొద్దకు సుందరుడు వచ్చిన మార్గము సంకటమును ముండ్లతో నిండినదియునైయుండెను. ముండ్లకిరీటము ధరించినవాడైన క్రీస్తు ప్రభువును దర్శించి ఆ రక్షకుడు తెచ్చిన శాంతిని అనుభవించినప్పటినుండి ఆయనకొరకు అనుభవించిన యెట్టి కష్టమును గొప్పదిగా కనుపించలేదు. ఒక భక్తుడు పాడిన పాటలోని యీ క్రింది మాటలు ఆయనయందు నెరవేరిన వనవచ్చును.

ప్రపంచ మంత గల్గినన్
ఇదీ ‘వి కాదు లేశమున్
విచిత్ర మిట్టి ప్రేమయే
వరించు నాదు జీవమున్.

యేసుప్రభువుమీద ఆయనకుండిన ప్రేమచేత, తన దనదగిన సమస్తమును ఆయనకు సమర్పించితేనేగాని తృప్తిపొందనట్లుండెను. అందుచేత తనను సంపూర్ణముగ క్రీస్తుకు సమర్పించుకొని, ఆయన కృపాకటాక్షములచేత తన జీవితకాలమంతయు ఈ విధముగ గడుప సుందరుడు నిశ్చయించుకొనెను.

అప్పుడు చిన్నవాడైనను, సుందరసింగు ఇప్పటివలెనే ఆత్మలను రక్షించవలెనను దాహముచేతను, యేసుప్రభువునందున్న తీక్ష్ణమైన భక్తి ప్రేమల చేతను కొద్దికాలముక్రిందట తాను తరిమివేయబడిన స్వగ్రామములోనే మొట్టమొదట బోధింపవలెనని పూనుకొనెను. తన బంధువులు తనను విసర్జించిన కొన్ని మాసములకే సుందరుడు రామాపుర వీధులలో తన రక్షకుని శక్తినిగూర్చియు, ఆయనయందు తనకు ఇప్పుడున్న సమాధాన భాగ్యమునుగూర్చియు నమ్మకముగ సాక్ష్యమిచ్చెను. వీధులలో నిలువబడి పురుషులకు మాత్రమేకాక ఇంటింట అంతఃపురములోనుండు స్త్రీలకుకూడ క్రీస్తు జీవిత చరిత్రను చెప్పగలిగెను. రామాపురము చుట్టునున్న గ్రామములలో కూడ యేసుప్రభువుద్వారా కలుగు శాంతినిగూర్చి ధైర్యముతో ప్రజలకు బోధించెను.

పంజాబులో నితరమైన యనేక గ్రామములను పట్టణములను దాటి ఉత్తరముననున్న ఆఫ్ఘనిస్థానము కాశ్మీరములకుకూడ బోయెను. ఇట్టి దీర్ఘ ప్రయాణము అంతకుముందు చేసియుండనందునను, ఈ ప్రయాణములో వేళకు ఆహారము దొరకక పోయినందునను, చలిచేతను ఆయన బహు కష్టముల పాలయ్యెను. ఇదిగాక ఆ ప్రదేశములలోని ప్రజలు కఠినహృదయులై ఆయన బోధకు చెవి నియ్యనందున ఆయన మనస్సుకు బహు కష్టము తోచెను. కాని పురాతన పట్టణమైన జలలాబాదులో కొందరు పఠానులు మొదట ఆయనను నాశనము జేయదలచి చివరకు ఆయన వర్తమానమును అంగీకరించుట కిష్టపడిరి. ఈ చరిత్ర, తరువాత ఒక అధ్యాయములో కనుపించును.

ఇంతవరకు మానవుడు తనకు అండగా జేసికొను ప్రతిదానిని ఒకటొకటిగా సుందరుడు విసర్జించునట్లు దేవుడు చేసెను. బంధువుల ప్రేమను,

ఇంటిసౌఖ్యమును, ధనముయొక్క సంభ్రమమును క్రీస్తుకొరకు ఆయన పోగొట్టుకొనెను. గొప్ప కులస్థుడు క్రైస్తవుడైనందున కలుగు జౌన్నత్యదశను, గౌరవమును తృణప్రాయముగ నెంచి, సర్వతములలోని గ్రామస్థులకు క్రీస్తును గూర్చి తెలుపుటకు ఈ మొదటి ప్రయాణము చేసెను. చలిగాలి ఆయన ధరించిన సన్నని బట్టలలో దూసికొనిపోయెను. ముండ్లును రాళ్లును ఆయన పాదములను గాయపరచెను. పెక్కురాత్రులు దాగుటకు చోటులేక గాలి వానలో చలికి వణుకుచు బయట నుండవలసివచ్చెను. అలాగే అనేకదిన ములు తినుటకు ఆహారము దొరకనందున, తానదివరకు ఎరుగని ఆకలిబాధ అనుభవింపవలసివచ్చెను. ఇంత విశ్వాసావేశములు కలిగిన ఆయన సహా నిష్ప్రయోజనముగ తా ననుభవించుచున్న శ్రమలకు కొన్ని సమయములందు వేసారి అంగలార్చెను. ఎందుకనిన తరుచుగ ప్రజలు ఆయన మాట నమ్మక బయటికి త్రోసివేసినందున ఆకలితో రాత్రులలో గుహలలోను అరణ్యములో చెట్లక్రిందను దాగవలసివచ్చెను. ఆయన వేసికొనిన సాధువు వేషమువల్ల ఆయనను ఇంటిలోనికి రానిచ్చినవారు క్రైస్తవుడని తెలియగానే ఆయనకు ఏ సహాయము చేయకుండ పారదోలినందున తరుచుగ గ్రామములోనుండి ఆకలితో వెళ్లిపోవలసివచ్చెను.

కాని యెట్టి కష్టములైనను ఆయన కధైర్యమును కలిగించలేదు. ఎట్టి అపాయమునకైనను మరణమునకైనను వెరచి తాను పూనినవ్రతమును విడిచి పెట్టుట పురుషధర్మముకాదని యెంచెడు సీక్కుజాతివాడైన సుందరసింగు మత వైరాగ్యముతో ఈ దేశములో నిదివరకు సువార్త వినని ప్రజలకు క్రీస్తు మతబోధచేయుచు దిరిగెను. వారు అన్యమతస్థులను హింసించుటకు జడియు వారు కారు. అట్టి ప్రజలు గ్రామములోనున్నను పట్టణములలోనున్నను, ఊరూరు తిరుగుచు కొండలలో వసించువారైనను అందరికి క్రీస్తునుగూర్చి బోధించుచు పాటుపడుచుండును. ఆయన అనేక సంవత్సరములనుండి హిందూదేశముయొక్క ఉత్తరపు సరిహద్దులలోని ప్రజలకే పరిచర్య చేయు చుండెను. వారివల్లనే ఆయన కనేక ఘోరమైన శ్రమలు కలిగెను. వీరే ఆయనను బహు నీచముగ జూచిరి. కాని అట్టివారికి సువార్త బోధించితినను ఆనందమేకాక, అనేకులను క్రీస్తు పాదములయొద్దకు నడిపించెడి భాగ్యమును ఆయనకు కలిగెను. ఆయన అన్యులమధ్యనే ముఖ్యముగ పనిచేసెను. ప్రభువు తనను అందుకొరకే పిలిచెనని ఆయన నమ్మెను.

## సువార్త బోధకొరకు పిలువబడుట

నేను యేసుక్రీస్తును, అనగా సిలువ వేయబడిన యేసుక్రీస్తును తప్ప మరి దేని నెరుగకుందునని నిశ్చయించుకొంటిని. 1: కొరింథీ 2: 2.

పంజాబు, కాశ్మీరము, బెలూచిస్థానము, అఫ్ఘనిస్థానముగుండ కష్టమైన దూరప్రయాణముచేసి తాను వెళ్లినదారిని తిరిగి హిమాలయ పర్వతములలో సిమ్లాకు పైనున్న కోట్ఘురను ఊరికి సుందరుడు విశ్రాంతినిమిత్తము వచ్చెను. ఈ కోట్ఘురను చిన్న గ్రామము ఆయనకు వెనుకటి సంగతులను జ్ఞాపకమునకు దెచ్చెడు ప్రియమైనచోటు. సువార్తబోధ ఆరంభించినప్పుడు మొదటి మాసములు ఆయన యిక్కడ గడిపెను, దీర్ఘ ప్రయాణము చేసినపిమ్మట నూతన బలము పొందుట కిక్కడికే ఆయన వెళ్లుచుండును. టిబెట్టు నేపాళ దేశములకు వెళ్లి అక్కడి మూఢజనులను దర్శించకముందు ఇక్కడ కొంతకాలము గడిపి సుందరుడు బయలుదేరెను.

1906 సంవత్సరము వేసవికాలములో కోట్ఘురుసమీపమందు వసించుచున్న స్టోక్సు అను అమెరికా దేశస్థుని సుందరుడు మొదట కలిసికొనెను. భాగ్యవంతుడైన యీయన తన దేశమునువిడిచి ఈ దేశజనులమధ్య దేవుని మహిమకొరకు పని చేయుటకు వచ్చియుండెను. సాధు సుందరసింగును ఈయన చూడగానే తానుసు సమస్తమును పరిత్యజించి సుందరునితో కలిసి సాధువువలె తిరుగవలెనని బహుగా కోరెను. దానినిగూర్చి బహుగా ప్రార్థించి ఆలోచించినమీదట సన్యాసివ్రతమును పూనెను. పిమ్మట నీ యిద్దరు సాధువులును ఘాంగ్రా లోయలోని గ్రామస్థులకు సువార్త బోధించుటకు బయలుదేరిరి.

ఆహారమును, తల దాచుకొనుటకు చోటును దొరకక, ఈ యిద్దరు సహోదరులును బహు కష్టపడినను వీరు చేసినపని బహు శ్రేష్ఠమైనది. వారి సహవాసము బహు మధురమైనదై యుండెను. ఈ ప్రయాణములోనే సుందరసింగు కాయలాపడెను. వందలకొలది మైళ్లదూరము అశుభ్రమైన సత్రములలో బసచేయుచు, చాలిచాలని అనారోగ్యమైన ఆహారమును తినుచు వీరిద్దరును ప్రయాణము చేసిరి. వీరు దాటివచ్చిన లోయప్రదేశము ఆరోగ్యకరమైనదికాదు. అందుచేత సుందరసింగు జ్వరముచే దేహము మండుచు, కడుపునొప్పికలిగి, బహుకష్టపడెను. అయినప్పటికి ప్రయాణము ఆపలేదు. చివరకీయన స్మారకముతప్పి నడువలేక దారిలో పడిపోయెను.

స్టోక్సు ఆయనను ఊరడించి వసతిగానుండు చోటికి తీసికొనిపోయి పరుండ బెట్టి మీకేలాగున్నదని యడుగగా నా కెంతో ఆనందముగ నున్నది, నా ప్రభువుకొరకు శ్రమ ననుభవించుట ఎంత యింపుగ నున్నదని సన్నని స్వర ముతో ప్రత్యుత్తర మిచ్చెను. ఎన్నడును తన కష్టమునుగూర్చి సుందరుడు సణిగియుండలేదు, గనుక స్టోక్సు ఈ ప్రత్యుత్తరమునకు అచ్చెరువొందలేదు. సుందరసింగును బాగుగా నెరిగినవారు ఈలాగు క్రీస్తుసేవలో శ్రమ ననుభ వించుటే ఆయన పరమానందముగ నెంచుకొనుచున్నాడని యెరుగుదురు.

సుందరసింగు జబ్బుచేత పడిపోయినచోటు అరణ్యప్రదేశమైనందున స్టోక్సు బహు ప్రయాసముతో ఆయనను కొన్ని మైళ్లదూరములోనున్న ఒక యూరోపియనుని యింటికి తీసికొనిపోయి, అక్కడ చికిత్స చేయించి, స్వస్థత కలిగించెను. సుందరుని దయతో చేర్చుకొనిన ఆ యూరోపియనుడు భక్తిహీను డుగ నుండెను. కాని సుందరుని, ఆయన దేవునికొరకు పడుచున్న శ్రమ లను చూచి, సుందరుని నోట పరమ సత్యములను విని, ఆ యూరోపియనుడు భక్తిపరు డయ్యెను. సుందరసింగు పడిన యీ వ్యాధివలన ఒక ఆత్మ గుణపడి, యేసుప్రభువునందు సంతోష సమాధానములు కలిగిన దయ్యెను.

చీకటిలో బొమ్మలు చూపు మ్యాజిక్ లాంతరు స్టోక్సు దగ్గర నుండెను; దీనిని సుందరుడు గ్రామాపురములోను ఇతర స్థలములలోను వీధు లలో చూపి గుంపులుగుంపులుగ వచ్చిన ప్రజలకు బొమ్మలలోని సంగతు లను వివరించెడివాడు. విశ్రమింపకుండ ఊరూరు తిరుగుచు, ఈ యిద్దరు సాధువులు క్రీస్తు మహిమనుగూర్చి ప్రకటించిరి. స్టోక్సు తలమీద టోపీ లేనందున, ఎండకు జడిసి, వీరిద్దరును రాత్రివేళ ప్రయాణముచేసిరి. ఈ కాలమందే స్టోక్సు సుందరుని పనినిగూర్చి పొగడుచు మాటలాడెను; ఎందు కనిన బాలుడైనను, సుందరుడు నిజవిశ్వాసమును వైరాగ్యమును గలవాడై నందున ఆయన మాటలకు ప్రతివారును చెవినిచ్చి వినినట్టు స్టోక్సు కని పెట్టెను.

1907 సం॥లో సబాటులోనున్న కుష్ఠరోగుల వైద్యశాలలో వీరిద్ద రును పనిచేయ బోయిరి; పిమ్మట లాహూరులో ప్లేగువ్యాధివలన చనిపోవు చుండిన వారిని పరామర్శింపబోయిరి. ఈ రెండు స్థలములలోను వీరు రాత్రిం బగళ్లు కష్టపడుచు రోగులతోనే పరుండి, కొన్ని గడియలసేపు మాత్రము నిద్రించి సేద దీర్చుకొనుచుండిరి.

మరుసటి సంవత్సరము స్టోక్సుదొర అమెరికాకు వెళ్లెను. అప్పుడు సుందరుడు మునుపటివలె ఒంటరిగ తిరుగవలసివచ్చెను. ఆయన లాహోరు నుండి సింధుప్రాంతములకు వెళ్లి, రాజపుతానామీదుగ ఉత్తర హిందూస్థానమునకు తిరిగివచ్చెను. వేసవికాలము సమీపించినప్పుడు టిబెట్టుదేశమునకు మొదటి ప్రయాణము చేసెను. అంతకుముందు ఆ దేశమునకు సువార్తబోధించుటకు ఎవరిని రానియ్యలేదు. ఆయన యెక్కడికి వెళ్లినను ఎడతెగకుండ సువార్తను బోధించెను; తనయొద్దకు వచ్చినవారి నెవరినిగాని పాపులను రక్షించుటకు క్రీస్తుయేసు లోకమునకు వచ్చెనను వార్త చెప్పకుండ పంపివేయలేదు.

టిబెట్టునుండి తిరిగి వచ్చినప్పుడు రక్షకుడు పుట్టి పెరిగి, మేలు చేయుచు సంచరించి, చివరకు ప్రాణత్యాగముచేసిన పుణ్యభూమిని చూచుటచేత, తనకు విశేషమైన ఉత్సాహమును, ఆయనను సేవించుటకు అధికమైన ప్రేరేపణయును కలుగునని పాలస్తీనాకు యాత్ర చేయవలెనని యోచించెను. ఈ యుద్దేశముతో బొంబాయికి వెళ్లినప్పుడు, పాలస్తీనాకు పోవుట అసాధ్యమని తెలిసికొని, 1909 సంవత్సరములో మధ్యపరగణాలగుండ ప్రసంగించుచు ఉత్తర హిందూస్థానమునకు వెళ్లి చేరెను.

## ఈ జ్ఞాన మెట్టిది?

ఈ సంగతు లితని కెక్కడనుండి వచ్చెను? ఇతని కియ్యబడిన ఈ జ్ఞాన మెట్టిది? మార్కు 6: 2.

ఆరంభమునుండి సుందరసింగు చేసిన ప్రసంగములు క్రైస్తవులుకాని వారు శ్రద్ధతో వినుట చూచినవారికి దేవుడే యీయనకు బోధకుడుగనుండి కావలసిన జ్ఞానమును దయచేసెనని ప్రత్యక్షమయ్యెను. ఈయనకు విశేషమైన కృపయును, వినువారి మనస్సును రంజింపచేసి, పరవశపరచగలిగిన విధముగ సువార్తను బోధింపగల సామర్థ్య మున్నట్లు సుందరుని స్నేహితులు కనిపెట్టి, యీయన క్రైస్తవులకుకూడ తన విశేషమైన పరిచర్య చేయవలెనని కోరిరి. ఇందుకొరకు తనను పరిపూర్ణముగ సిద్ధపఱచుకొనుటకు వేదశాస్త్రపాఠశాలలో చదువుకొనవలెనని కోరెను. లాహోరులో నున్న సెంటుజాను వేదశాస్త్రకళాశాలలో చదువుకొనుచున్నవారు మొదటి సంవత్సరాంతమందు ఇయ్యవలసిన పరీక్షకు ఈయన వెంటనే ఒడబడి, అందులో కృతార్థుడయ్యెను. వెంటనే రెండవ సంవత్సరపు పాఠములను చదువుకొను

టకు ఆ కళాశాలలో ప్రవేశించి 1909, 1910 సంవత్సరము లక్కడ గడి పెను. సెలవు దినములలో ఈయన మునుపటివలెనే సువార్తబోధ చేయు చుండెను.

సుందరసింగు అప్పుడును కాషాయవస్త్రములు ధరించుచుండెను. ఆ కాలమందు క్రైస్తవుడు సన్యాసివేషము వేసికొనుట ఒక నూతనమైన సంగ తిగ నున్నందున, అది అనుమానాస్పదమైన వేషమని అనేకులు సందేహించి దానినిగూర్చి ఆయనకు మనస్తాపము కలుగునట్లు మాటలాడుచుండెడివారు. అందుచేత నా దినములలో మనస్సుకు తొందర కలిగినను, సుందరుడు తన మొదటి తీర్మానప్రకారము కాషాయవస్త్రములను విడువనని చెప్పివేసెను.

సుందరుడు కళాశాలలో నుండగ స్టోక్సు అమెరికానుండి ఇంగ్లాం డుకు వెళ్లి, సువార్తబోధ పనికిమాత్రమేకాక, మరి యేవిధమైన సేవకైనను, మానవునికి ఆపత్కాలమందు సహాయకరముగను, దేవునికి మహిమార్థము గను జీవింపవలెనను ఉద్దేశము కలిగిన సజ్జనసోదర సంఘ మొకటి స్థాపింప వలెనని నిశ్చయించుకొని యీ దేశమునకు తిరిగివచ్చెను. కాంటర్బరీ ప్రధానాధ్యక్షుడు ఈ విధమైన సంఘము మంచిదని కనిపెట్టి, స్టోక్సు ఇండియా చేరగానే ఐదుగురితో సంఘమును ప్రారంభింప నియమించెను. వీరిలో ఈ దేశస్థుడు మన సుందరసింగు ఒక్కడే. లాహోరు అధ్యక్షప్రభు వులవారి దేవాలయములో ఈ సంఘమును బహు గంభీరముగ స్థాపించిరి. ఆ యైదుగురిలో నిద్దరు సన్యాసివ్రతము పూనిరి. సుందరుడు అదివరకే క్రీస్తు కొరకు ఆ వ్రతము పూనియున్నందున, ఆ సమయమందు అభిషేకము పొంద లేదు.

సుందరసింగు కళాశాల విద్య ముగించినప్పుడు, ఇంగ్లాండుసభ యొక్క అధ్యక్షమండలపు కవున్సిలువారి శిఫారసుమీద ఉపగురువుగ నియమింపబడి, ప్రసంగించుటకు అధికారము పొందెను. అటుపిమ్మట, వేసవికాలము ఆరుమాసములు టిబెట్టులో గడిపి, కోట్ఘరుకువచ్చి, చర్చిమిష నెరీ సొసైటీవారి సంబంధముగ పనిచేయుచుండెను.

ప్రసిద్ధిగాంచిన ఆంగ్లేయ ప్రసంగియైన జాన్ వెస్లీవలె, క్రీస్తుసభలోని ఆయా తెగల సంబంధముగాకాక, అన్ని తెగలవారని ఒక్కవిధముగజూచి, వినువారి కెవరికైనను ఈయన సువార్త ప్రసంగించుచుండెను. ఇంగ్లాండు సభలో చేరినవారికి మాత్రమేకాక, క్రైస్తవుల కందరికిని యీయన పరి చర్యచేయుట సరికాదని ఆ సభవారు ఈయనమీద తప్పు మోపిరి. ఇంగ్లాండు

ములనుండి చేయుచుంటిమి. కాని నేను నా స్నేహితుని పిలిచినప్పుడు వాడు పలుకలేదు; దుప్పటి యెత్తిచూడగా వాడు నిజముగానే శవమై పడియున్నాడు. నాకు కలిగిన భయ మింతింతకాదు! తమరు గొప్ప ఋషులు! తమను మేము మోసపుచ్చినందున దేవతలు మామీద కోపగించి, యిట్టి భయంకరమైన మరణము పంపియున్నారు. తమరు నా తప్పితమును మన్నించవలెన'ని బతిమాలెను. అప్పుడు సుందరుడు జీవాధిపతియైన క్రీస్తును గూర్చి యీ మహాపాతకునికి చెప్పెను; ఆ సమయమందు అతడు తన పాపమును గూర్చి విరిగిన మనస్సుగలవాడై సుందరుని మాటలు విని దుఃఖపడెను. వీనిని ఆయన ఘూర్వాల్‌లో నున్న మిషన్‌స్థానమున కనిపెను, అక్కడ వాడు తగినట్టుగా సిద్ధపడి బాప్తిస్మము పొందెను.

పర్వతములమీదు ప్రయాణము చేయుచుండగ నొకచోట రెండు త్రోవలు కనుపించెను. ఏ మార్గమున పోవలయునో తెలియక, సందేహించుచు, సుందరుడు తప్పుదారిని బడెను. చివరకు ఒక గ్రామము చేరినప్పుడు తాను దారితప్పినట్టును, తాను వెళ్లవలసిన గ్రామము పదునొకండు మైళ్ల దూరమున నున్నట్టును, కనుగొని, వ్యసనముతో తిరిగి పోవుచున్నప్పుడు, ఒక మనుష్యుని కలిసికొనెను. అతనితో క్రీస్తు మహిమనుగూర్చి మాటలాడెను. అప్పుడతడు తన వస్త్రములలో దాచుకొనియున్న నూతన నిబంధనను ఎత్తి చూపి, సుందరుడు ఒక హిందూ సన్యాసియని తలంచి దానిని దాచితినని చెప్పెను. అతడు తన సందేహములను సుందరునకు చెప్పినప్పుడు ఆయన వాటిని నివర్తి చేసి అతని విశ్వాసమును బలపరచెను. అప్పుడతడు క్రీస్తు శిష్యుడాయెను. 'ప్రభువు తనను ఆసక్తితో వెదకిన యీ మనుష్యునికి సహాయము చేయుటకే నా మార్గము తప్పునట్లు చేసెనని సంతోషించితిన'ని యీ సంగతినిగూర్చి మాటలాడినప్పుడు సుందరుడు చెప్పెను.

నార్కండాయనుచోట పొలములో కోతకోయుచున్న వారియొద్దకి సుందరుడు వెళ్లి, వారు పనిచేయుచున్నప్పుడు వారితో యేసుప్రభువును గూర్చియు, పారమార్థికమును గూర్చియు మాటలాడెను. అన్యమత బోధను వినుట కిష్టములేక వారు మొదట అశ్రద్ధగా వినుచుండి, పిమ్మట కోపము తెచ్చుకొని సాధువును శపించుటకును బెదరించుటకును మొదలుపెట్టిరి. వారిలో నొకడు ఒకరాయి తీసికొని సుందరుని తలకు తగులునట్లు రువ్వెను. ఈ చెడ్డపని చేసినవాడు కొంతసేపటిలో అధికమైన తలనొప్పిచే బాధ పడుచు, పని మానివేయవలసివచ్చెను. అప్పుడు సాధువు వాని కొడవలి తీసి

కొని, యితరులతో కూడ తానును కోతకోసెను. అంతట వారి కోపము కొంత చల్లారెను; పని ముగిసిన తరువాత వారు ఇండ్లకు పోవునప్పుడు సుందరుని తమతో బసచేయుటకు పిలిచిరి; సాయంకాలము చల్లగా నున్నప్పుడు వారికి సావకాశముగ సువార్త బోధించుటకు సమయము దొరికెను. క్రీస్తు ప్రభువునుగూర్చి వారికి చెప్పి, సంతోషముతో సుందరుడు తన మార్గమున బోయెను. కోతకోసినవారు కొంతసేపు విశ్రమించిన పిమ్మట, ఆ వేళ కూర్చిన ధాన్య మెంతయని పరీక్షించినప్పుడు, క్రిందటియేటి పంటకంటె నది యధికముగ నున్నట్టు కనిపెట్టి, 'ఆ వేళ మనయొద్దికివచ్చి నాయన ఒక ఋషియైయుండవలెను, అందుచేతనే పంట అధికముగనున్నది; ఆయనను మనము దూషించి అమర్యాద చేస్తిమిగదా!' యని భయపడిరి. ఆయనకు తగిన మర్యాద చేసి, ఆయన వర్తమానమును విని అంగీకరించవలెనని కోరి సుంద రునికొరకు వెదకిరిగాని ఆయన కనుపించలేదు.

ఉత్తర హిందూస్థానములో ప్రచురింపబడు నూర్ అఫ్షాఁ అను పత్రికలో ఈ సంగతి చూచిన యొకరు దీనినిగూర్చి వ్రాసి. తమ యొద్దికి సుందరుడు తిరిగి వచ్చి బోధించినయెడల తాము అంగీకరింతుమని విన్నవించుకొనెను.

పురాతన పట్టణమైన జలలాబాదులో క్రూరులును, ద్రోహులునైన యొక జాతివారికి బోధించుచుండగ, ఈయన క్రైస్తవుడని కనిపెట్టి, యీయ నను చంపవలెనని కుట్రచేసిరి. వారిలో కొంచెము దయగలవాడు వచ్చి సుందరుని కాసంగతి తెలిపెను. వారికి యే కీడును చేయునప్పుడు తనను చంపుటకు ప్రయత్నించుదురా యని సందేహించినను, సుందరుడు కొంచెము భద్రమైన చోటికి బోవుట మంచిదని యెంచి, దోమలు మొదలైన పురు గులతో నిండియున్న సత్రములో ఆ రాత్రి గడిపెను. తెల్లవారి కొంచెము మంటవేసి తడిగానున్న తన బట్టలు ఆఱబెట్టుకొనుచుండగ సుందరునియొద్దకు కొందరు పఠానులు వచ్చిరి. వారిలో మొదటివాడు ఆయన పాదములమీద పడి, ఆయనను చంప యత్నించినవారు, సుందరుడు రాత్రి మంచులో బిగించుకొనిపోక, యింకను సజీవుడుగనున్నందున అల్లాయొక్క కృపను పొందినవాడని యెంచి తాము చేయబూనిన హత్య చేయలేదని చెప్పెను. 'మా ఆతిథ్యమును దయతో నంగీకరించి మా యింటికి వచ్చి బసచేసి, మీ మతబోధచేయ ననుగ్రహించుమ'ని బతిమాలుకొనిరి. సాధువు వారితో నొకవారము గడిపినప్పుడు వారాయనబోధను శ్రద్ధతో నాలకించిరి. కఠిన

హృదయులైన యీ మోటుజనులు తన పరిచర్యకు ఫలితముగా సన్మార్గము లోనికి రావచ్చునని సాధువు నమ్మెను.

## శ్రమలపలని విధేయత

తాను పొందిన శ్రమలవలన విధేయతను నేర్చుకొనెను. హెబ్రీ. 5: 8.
ఆయనను, ఆయన శ్రమలలో పాలివాడనగుట యెట్టిదో యెరుగునిమిత్తము.........
సమస్తము నష్టముగా నెంచుకొనుచున్నాము. ఫిలిప్పి 3 : 8—11.

తన పరమ యజమానునికొరకు సేవచేయుచున్న ఈ కాలములో సుందరుడు పడిన శ్రమలు ఆయన కొక్కనికే తెలియును. అనేకసమయము లందు తినుట కాహారము దొరకనందున అడవిలో మొలచు కాయలు దుంపలుమాత్రమే తిని, నా యాకలి బాధను తీర్చుకొంటిననియు, కఠిన హృదయులైన ఆయా గ్రామస్థులు రాత్రిలో పరుండుటకు చోటియ్యక ఊరి వెలపలికి తరిమినందున తరుచుగ చెట్లక్రిందను, చీకటి గుహలలోను పరుండి నిద్రపోతిననియు సుందరుడు చెప్పెను. ఈ కష్టములు సంభవించి నప్పుడు గొప్ప అపాయములును సంభవించెను; గనుక మన సాధువు రాత్రిలో విశ్రమించుటకు పోయిన భయంకరమైన స్థలములలో ఒక యడవి మృగముగాని సర్పముగాని తనతోకూడ నుండుట అనేక పర్యాయములు తటస్థించెను.

తోరియా యను ప్రాంత్యములోని యొక గ్రామములో ఆయన గడిపిన కాలమంతయు ప్రక్కనున్న అడవిలో రాత్రిళ్లు ఉండవలసివచ్చెను. ఆ గ్రామస్థు లాయనను అంత క్రూరముగ జూచిరి. ఒక దినమంతయు నిష్ఫలముగ పాటుపడి, ఆశాభంగము నొందియున్న ఆ రాత్రి ఒక గుహలో ప్రవేశించి తన కంబళి పరచుకొని నిద్రించెను. తెల్లవారినప్పుడు తన ప్రక్కను ఒక పెద్ద చిఱుతపులి నిద్రించుచుండుట చూచి భయకంపితుడై వెలుపలికి పోయెను. రాత్రి అంతయు నిద్రించుచున్నప్పుడు ఆ మృగము యొక్క నోటినుండి కాపాడిన పరమాత్మునికి వందనములు చేయుచు తన దారిని బోయెను. ఏ దుష్టమృగము తన కెప్పుడు హాని చేయలేదని ఆయన చెప్పుచుండును.

ఇంకొకతూరి ఒక గ్రామస్థులవలన తరుమబడి, ఒంటరిగ ధ్యానించుటకు ఒక గుహ సమీపమందున్న బండమీద కూర్చుండెను. ఈయన తదేకధ్యానమందున్నందున ఆ గుహలోనుండి తనను పొంచియుండి కనిపెట్టు చున్న నల్లని చిఱుతపులిని చూడలేదు. చివరకు తానుండిన అపాయకరమైన

స్థితిని తెలిసికొని, దేవునిమీద భారమువేసి, నిమ్మళముగలేచి గ్రామములోనికి పోయెను. ఈ సంగతి గ్రామస్థులు విని, తమలో ననేకులను చంపిన యా దుష్టమృగమున కాహారము కాకుండ ఈయన యొక పుణ్య పురుషుడు గనుక నే తప్పించుకొనెనని యెంచి, అదివరకు తిరస్కరించిన వర్తమానమును శ్రద్ధతో విని, అంగీకరించిరి. ఇదిచూచి సుందరుడు దేవుని స్తుతించి ధైర్యమును పొందెను.

గంగానదీ తీరమున ఋషికేశనుచోట తీర్థమాడుచున్న జనులలో కొందరు హిందూసాధువులుండిరి. హారిమస్య నూతన నిబంధన చేతిలో పట్టుకొని సుందరుడు నిలువబడి బోధించుచుండగా కొందరు అశ్రద్ధగా వినిరి, మరి కొందరు ఆయనను ఆయన బోధను తిరస్కరించి పరిహాసము చేయుట కారంభించిరి. అకస్మాత్తుగా ఒక దుష్టుడు చేతినిండ యిసుకదీసికొని సుందరుని కండ్లలో గొట్టెను. ఈ దౌర్జన్యమును కనిపెట్టిన యొకసజ్జనుడు దానిని సహింపలేక ఆ దుష్టుని పోలీసువారి కప్పగించెను. సాధువు ఏమియు చెప్ప కుండ నదిలోనికిపోయి కండ్లను కడుగుకొనెను. తిరిగివచ్చి, తనకు కీడు చేసినవానిని విడిచిపెట్టుమని పోలీసువారిని బ్రతిమాలి, మరల తన ప్రసంగము చేయుచుండెను. సాధువుయొక్క ఆశ్చర్యకరమైన సాత్వికమును దయాళుత్వ మును చూచి విద్యానంద, తాను చేసిన తప్పితమును మన్నించుమని యడిగి, ఆయన బోధలోని సత్యమును తెలిసికొనగోరెను. సత్యవిచారణ చేయుటకై విద్యానంద సాధువుతోకూడ కొన్ని దినములు తిరిగి, ఆయన చెప్పెడు రక్షణ సువార్తను వినయముతో విని గ్రహించెను.

దీర్ఘప్రయాణముచేసి అలసి, ఆకలిచేతను దాహముచేతను బాధపడుచు సుందరుడు డోలివాలా యను గ్రామము వచ్చిచేరెను. వీధిలో తిరుగుచు ప్రతియింట తనకు ఆ రాత్రి బసయిమ్మని ప్రార్థించినను, క్రైస్తవుడని తెలియ గానే యీయన కెవరును సహాయముచేయుటకు సమ్మతించలేదు. కుంభవర్షము కురిసి యెంతో చలిగానుండెను. సుందరుని దేహములోని అలసట సహింప శక్యము గాకున్నందున తలుపులు కిటికీలు లేని రెండు గదులుగల గుడిసెలో ప్రవేశించి, పొడిగానున్న యొక మూలను కంబళి పఱచుకొని పరుండెను. ఆకలిబాధ తప్పకున్న వర్షమును తప్పించుకొంటినని దేవుని స్తుతించుచు నిద్రించెను.

సూర్యోదయ మగువప్పటికి మేలుకొని, తన ప్రక్కను చుట్టికొని యున్న వస్తు వేమియని చూడగా నది గొప్ప త్రాచుపామని కనిపెట్టెను.

దానిని చూడగానే భయపడి, దిగ్గునలేచి బయటికి పారిపోయెను. కాని కొంచెము నిదానించి చూచి తిరిగివచ్చి, తన కంబళి కొనపట్టి విదలించెను. పాము క్రిందపడి ఒక మూలకు నిమ్మళముగా ప్రాకిపోయెను. తాను నిద్రించుచున్నప్పుడు ఆ గొప్ప విపత్తునుండి కాపాడి, యింకను కొంతకాలము తన సేవచేయుటకు ఆయుష్యమిచ్చిన దేవునికి కృతజ్ఞతాస్తోత్రములు చెల్లించుచు సాగిపోయెను.

ఆర్యసమాజములో చేరిన యొక విద్వాంసుడైన ఘనుడు ఒక పర్వతము మీదినుండి దిగుచుండగ, దానిమీదికి పోవుచుండిన యౌవనుడైన యొక సాధువును చూచి, ఆయన యెవరో తెలిసికొనవలెనని కోరి, ఆయనతో మాటలాడవలెనని తనలోపుట్టిన యోచనను అణచుకొని, ఆయనను దూరము నుంచి కనిపెట్టుచుండెను. ఆ యూరు చేరగానే సాధువు ఒక బండమీద కూర్చుండి చెమట తుడుచుకొనుచు, క్రైస్తవుల కీర్తన యొకటి పాడెను. కొంచెము సేపటిలో ఒక గుంపు కూడెను. క్రీస్తు ప్రేమనుగూర్చి సాధువు మాటలాడగానే వినవచ్చిన ప్రజలు కోపపడిరి. వారిలో నొకడు ఎగిరిపడి లేచి సాధువును కర్రతో బలముగా కొట్టెను. ముఖమునుండి చేతినుండి రక్తము కారెను; సుందరుడు క్రింద తూలిపడెను. ఒక్కమాటయైనను పలుకకుండ సాధువులేచి, తనచేతిమీది గాయమును కట్టుకొని, ముఖముమీది నుంచి రక్తము ఇంకను కారుచుండగ తననుకొట్టి గాయపరచినవానికొరకు ప్రార్థించి, చుట్టునున్నవారికి క్రీస్తునాధుడు మానవుల పాపమంతయు క్షమించునంత ప్రేమాసముద్రుడని బోధించెను. ఈ సంగతినిగూర్చి వ్రాసిన యా ఘనుడు, సాధువుయొక్క నడతనుబట్టి, మనస్సుమారి క్రీస్తును తిరస్కరించునట్టి పాడుబావిలోనుండి యెత్తబడి జీవజలధారలయొద్దికి తేబడితినని చెప్పెను. ఆయనను కొట్టి పడద్రోసిన కృపారామ్ అనువాడు, తాను గాయపరచిన చేతితోనే దీక్షాస్నానము పొందలెనని కోరి, సుందరును అనేక దినములవరకు వెదకెను. ఆయనను కనుగొననందున మరియొకరిచేత బాప్తిస్మము పొంది క్రైస్తవుడయ్యెను. కాని నేటికిని అతడు సాధు సుందరసింగును చూడవలెనని యాశ గలిగియున్నాడు.

## ఉపవాసము

నీవు ప్రార్థనచేయునప్పుడు..............రహస్యమందున్న నీ తండ్రికి ప్రార్థన చేయుము.
మత్తయి 6 : 6.

ఉపవాసము చేయుచున్నట్లు మనుష్యులకు కనబడవలెననికాక రహస్యమందున్న నీ తండ్రికే కనబడవలెనని నీవు ఉపవాసము చేయుము. మత్తయి 6: 17.

ఆన 1912-వ సంవత్సరాంతమందు కనడానుండి కలకత్తాలోనున్న రెవ. కానన్ సాన్డీస్ దొరగారికి వచ్చిన ఒక ఉత్తరములో:—

'బ్రిటిష్ కొలంబియాలో కూలిపని చేసికొనుచున్న 4,000 మంది సిక్కులకు బోధించుటకు క్రైస్తవుడైన యొక సిక్కును పంపుమని యడిగిరి. సుందరసింగుకు ఆ సంగతి తెలుపగానే అక్కడికి వెళ్లుటకు ఒప్పుకొనెను. ...ఆయన వెళ్లుటకు సర్వసిద్ధముగ నున్నప్పుడు కనడా గవర్నమెంటు వారు విదేశీయులు తమ దేశమునకు వచ్చుటనుగూర్చి చేసిన చట్టములనుబట్టి ఆయనను ఓడమీద తీసికొనిపోవుటకు వల్లపడదని ఓడవర్తకులు తెలిపిరి. సుందరసింగుకు ఈ సంగతి బహు ఆశాభంగమును కలిగించినను, నేను కనడాకు వెళ్లుట దేవునిచిత్తము కాకపోవచ్చునని మాత్రము ఆయన చెప్పెను.'

పిమ్మట కానన్ సాన్డిస్‌దొరగారు, 'కొలంబియాలోనున్న సిక్కుల తిరుగబాటులనుగూర్చి గవర్నమెంటువారు తెలిసికొని యీ దేశస్థులు అక్కడికి వెళ్లకూడదని చట్టములు చేసినందున సుందరుకు టిక్కెట్టు సంపాదింపలేక పోతినని వ్రాసెను. ఈ ప్రకారముగా సుందరసింగు కనాడాకు వెళ్లుట మానుకొనవలసివచ్చెను.

అటుపిమ్మట సుందరుడు నిమ్మళముగా కలకత్తానుండి బొంబాయికి వచ్చి, తిరిగి ఉత్తరదేశమునకు వెళ్లిపోయెను. ఈయన బాప్తిస్మము పొందిన తరువాత, మన రక్షకుడు జీవించి పరిచర్య చేసిన ప్రదేశమైన పాలస్తీనాను చూడవలెనని, యేసుప్రభువువలె నలుబది దివారాత్రులు ఉపవాసము చేయవలెనని రెండు గొప్ప కోరికలు ఈయన మనస్సులో పుట్టెను. వీటి మూలముగ విశేషమైన పరమ రహస్యములను గ్రహించగల ననెడు నమ్మిక ఈయన కుండెను. పాలస్తీనాకు పోవలెనని 1908 సం॥లో బొంబాయివరకు వెళ్లెను. కాని యీ ప్రయాణము సాధ్యపడలేదు. కనడాకు వెళ్లవలెనను ఏర్పాటు తప్పిపోయినప్పుడు, దేవునితో సహవాసముచేయుటకును, దానిని బట్టి తన దివ్యమైన పరిచర్యకు కావలసిన శక్తిని పొందుటకును కోరి, చాలా కాలమునుండి యీయన ఉద్దేశించిన ఉపవాస ప్రార్థనలు చేయుటకు నిశ్చయించుకొనెను.

ఈ సమయమందు ఫ్రాన్‌సిస్కన్ సన్యాసి కూటములో చేరిన రోమాను వైద్యుడైన స్విఫ్టు అను ఆయనను కలిసికొని, ఆయనతో ప్రయా

ణము చేయుచుండగా సుందరుడు తాను చేయ పూనుకొనిన ఉపవాసమును గూర్చి చెప్పెను. అందుకా వైద్యుడు అట్లు చేయరాదని, అది మరణాంతక మగునని చెప్పెను. ఆ మాటలకు సాధువు ఎంతమాత్రమును జంకలేదు. తన వ్రతమును విడిచిపెట్టుటకు సుందరుని కిష్టములేదని కనిపెట్టి, ఆ వైద్యుడు ఆయన తప్పకుండ చనిపోవునని నిశ్చయించుకొని, ఆయన ముఖ్య స్నేహితుల పైవిలాసము లడిగి తెలిసికొనెను. అప్పుడా వైద్యుడు తన రోమాను మతమునకు వెళ్లిపోయెను. కాని సుందరసింగు తన దేవునితో నేకాంతముగ కాలము గడుపవలెనని హరిద్వారము, డేరాడూనుల మధ్యనుండు అడవి ప్రదేశములలో ఉపవాసము చేయుటకు వెళ్లెను. ఆ వైద్యుడు డేరాడూను సమీపమందున్న తన స్నేహితునికి జరుగుచున్న సంగతి తెలిపెను.

సుందరునిగూర్చిన సమాచార మెవరికిని తెలియకుండెను. గాని ఆయన అడవిలో ఆహారము లేకుండ దినదినము కృశించుచు అరణ్యములో తన వ్రతము సలుపుచుండెను. తనకు సంభవింపబోవు బలహీనతనుగూర్చి హెచ్చరించబడియున్నందున, ఆయన నలుబదిరాళ్లు ఏరి దగ్గిర ఉంచుకొని దినమున కొకటిచొప్పున పారవేయుచుండెను. చివరకు అది చేయుటకు కూడ శక్తిలేకపోయెను. వినికియు, దృష్టియు తగ్గి ప్రాణములేని శవమువలె సుందరుడు పడియుండెను. తనచుట్టును జరుగుచున్న సంగతులు తెలిసికొన గలిగినను, కాలుసేతులు కదల్చుటకైనను, నోరుతెరచి మాటలాడుటకైనను ప్రాణలేక పరవశుడైయుండెను. దేహబలము తగ్గియున్న యీ కాలమందు సుందరునియొక్క ఆత్మ నూతన జీవముగలదై, తన శరీరాత్మలు దేవుని హస్తమం దున్నవనియు, అన్నవస్త్రాదులు, ప్రాణము మొదలైనవాటినిగూర్చిన చింత యును, దేవుని పరామర్శను గూర్చిన సందేహమును పాపమనియు గ్రహించెను. నాటినుండి ఆయనలో నుండిన భయములును సందేహములును పోయి దేవునియందు పూర్ణ విశ్వాసము కలిగెను. ఇంకను అనేక సత్యములు సుందరునికి బైలుపరచబడెను.

కాషాయవస్త్రములు ధరించుకొని శవమువలె కదలకుండ పడియున్న సుందరుని వెదుళ్లుకొట్టుకొనుటకు వచ్చినవారు అడవిమధ్యనుచూచి, ఆయన కంబళిలో ఆయనను చుట్టి, రుషికేష్ అనుచోటికి తీసికొనిపోయి, అక్కడి నుండి డేరాడూనుకు మోసికొనిపోయిరి. అక్కడనుండి అక్షీల్లను చోటికి బండిమీద పంపిరి. ఆ గ్రామములో నుండిన ఆయన స్నేహితులు ఆయ నెంతో మారియున్నందున గుర్తుపట్టలేకపోయిరి, కాని ఆయన దగ్గరనున్న

నూతన నిబంధనలో ఆయన పేరు వ్రాసియున్నందున ఆయన సుందరసింగని నిశ్చయించిరి. అప్పు డాయనను ఎంతో జాగ్రత్తతో పరామర్శించి బల పరచుటకు అనేక దినములు పట్టెను.

ఈ మధ్యకాలములో డాక్టర్ స్విఫ్ట్‌స్నేహితుడు ఆయన వర్ణించిన సాధువువంటి మనుష్యుడు మరణావస్థలోనున్న వాడొకడు అడవిలో కను పించెనని ఆయనకు తెలిపెను. తా నను కొనినట్టే నిజముగా జరిగియుండవలె నని యెంచి డాక్టరు తానో, లేక తన స్నేహితునిచేతనో 'సుందరసింగు యేసునందు నిద్రించెను'ని ఆయన స్నేహితులకు తంతివార్త పంపెను. ఆ వార్తలు ఆరుగురికి పంపబడెను. వారిలో కలకత్తా ప్రధాన అధ్యక్షుల వారును కానన్ సాండిస్ దొరవారు నుండిరి. కానన్ సాండిస్ దొర వారు తంతివార్తలు పంపిన స్టేషన్‌మాస్టరును, ఎవరు వాటినంపిరని వ్రాసి యడుగగా, ఆయన, ఎవరో నల్లటి అంగీ ధరించినవారు తన కా తంతివార్తల నిచ్చిరని ప్రత్యుత్తరమును పంపెను.

అర్కీల్డులో తననుగూర్చి వ్యాపించుచున్న వార్తలేమియు తెలియకుండ బలహీనుడుగ సుందరుడు పడియున్నప్పుడు, ఆయన చనిపోయె ననువార్త వార్తాపత్రికలలో ప్రచురింపబడెను. ఆయన జ్ఞాపకార్థము ఆరాధనలు ప్రసంగములు జరుపబడెను. సిమ్లాలోని ఆలయములో సుందరునకు జ్ఞాపక చిహ్న మొకటి కట్టుటకు ద్రవ్యము పోగుచేయబడెను. మార్చిమాసములో సుందరుడు తిరిగి ప్రయాణము చేసి సిమ్లాకు వచ్చి, తాను చనిపోయినట్టు వ్యాపించిన వదంతి వినెను.

ఈ కఠినమైన అనుభవమువలన తనకు లభించునని నమ్మిన ఆత్మీయ జ్ఞానము ఈయనకు కలిగెను. నలుబది దినములు ముగియకమునుపు సుందరుని లెక్క తప్పిపోయినందున ఉపవాసముచేసిన దినములు నలుబదికి తక్కువై యుండ వచ్చును; అయినప్పటికి ఆయన పొందగోరిన ఆత్మీయానుభవము తన ప్రాణ మును పెట్టి సంపాదించెనని చెప్పుట తప్పుకాదు.

## ప్రయాణములు, హింసలు

నా బ్రతుకుమూలముగానైనసరే, చావుమూలముగానైనసరే, క్రీస్తు నా శరీరమందు ఘనపరచ బడును (ఫిలిప్పీ 1: 19).

ఉపవాసమువలన కలిగిన బలహీనత పోయినతరువాత సాధు సుందర సింగు బయలుదేరి 1913-వ సం॥ వేసవికాలములో ఆరుమాసములు టిబెట్టులో

గడిపి, చలికాలములో ఉత్తర హిందూస్థానములో సంచారము చేసెను. మరుసటి సంవత్సరారంభమందు తిరిగి బంగాళీ దేశమునకు వెళ్లెను. పిమ్మట డార్జిలింగు మీదుగ సిక్కిమ్‌లో ప్రవేశించెను. ఇండియాకు ఉత్తర సరిహద్దులలోనుండు సిక్కిమ్, భూటాన్, నేపాళమను సంస్థానములు స్వదేశాధిపతులక్రింద నున్నవి. టిబెట్టులో క్రీస్తుమత విరోధులున్నారు. అటువలెనే ఈ సంస్థానములలోకూడ నున్నారు. ఈ ప్రదేశములలోని ప్రజలు అజ్ఞానులును మూఢభక్తిగలవారు నైనందున, అక్కడ అన్యమతబోధ జరుగకూడదని చట్టము ఏర్పరచిరి. హింసించి ఒకవేళ చంపివేతురని సుందరు డెరిగియుండియు, ఆ జాతి ప్రజలకు సువార్త బోధింపవలెనని 1914-వ సం॥లో నేపాళము వెళ్లెను. ఇలోమ్ అను ఊరివరకు తనను ఎదిరించి భయపెట్టిన వారికి బెదరక, సువార్త బోధించుచు వెళ్లెను. అయినను ఇలోముకు వచ్చినప్పుడు సుందరుడు బోధించుట మానకున్నయెడల గొప్ప కీడు సంభవింపవచ్చునని ప్రజలు చెప్పిరి.

అప్పటికిని ప్రసంగించుట మానకుండిన సుందరును అధికారుల ఆజ్ఞప్రకారము పట్టుకొని, చెరసాలలో బంధించిరి. రాత్రింబగళ్లు దొంగతనము ఖూనీ నేరముచేసినవారితో నుండినను, క్రీస్తుమహిమను ప్రకటించుటకు సమయము దొరికెను. వ్యసనముతోనున్న యా ఖైదీలకు చెరసాలలో నుండగానే సంతోషమును కలిగించుటకు క్రీస్తు శక్తిమంతుడని సుందరుడు వారిని ధైర్యపరచెను. ఈయన వార్త వినిన ఖైదీ లనేకులు క్రీస్తును తమ రక్షకునిగ నమ్మికొనిరి. ఈ విధముగ చెరసాలలో సుందరుడు గడిపిన శ్రమదినములు ఈయనకును ఈయనతో నున్నవారికిని శుభదినములుగ పరిణమించెను.

చెరసాలలో సుందరుడు తనతోటి ఖైదీలకు తన మతమును బోధించి వారి మనస్సు త్రిప్పుచున్నాడన్నసంగతి అధికారుల చెవుల పడగానే, ఆయనను ఊరి మధ్యకు కొనిపోయి, వస్త్రములు తీసివేసి, నేలమీద కూర్చుండబెట్టిరి. ఆయన కాళ్లును చేతులును కొయ్యపలకలలోని రంధ్రములలో దూర్చి, ఆహారము నీళ్లులేకుండ, ఒక పగలు రాత్రి అంతయు ఉంచిరి. ఇది చాలనట్టు కొన్ని జలగలను ఆయన వట్టి దేహముమీద విడిచిరి. ఎంతకును తృప్తిపొందని యా జలగలు ఆయన ప్రాణాధారమైన రక్తమును పీల్చివేసెను. ఈ చిత్రవధవలన కలిగిన గాయముల మచ్చలు నేటికిని ఆయన దేహముమీద కనబడును. ఆయన ప్రభువైన యేసుయొక్క ముద్రలు తన శరీరమందు ధరించియున్నాడని చెప్పవచ్చును. ఆయనను దూషించుచు పరిహాసము

చేయుచు ప్రజలు చుట్టు గుంపుగా కూడిరి; వారిలో నెవరును ఆయన తాపము దీర్చుటకు కొంచెము నీళ్లైనను ఈయరైరి. 'కాని నా హృదయము ఆనందముతో నిండుకొని ఆ సమయమందు నాకు తెలియకుండ పాటయు ప్రసంగమును నానోట వచ్చెన'ని సుందరుడు ఈ సంగతినిగూర్చి మాటలాడి నప్పుడు చెప్పెను.

ఆ రాత్రంతయు సహింప శక్యముకాని వేదన పడినందునను, రక్తమును జలగలు పీల్చినందునను, సుందరుడు బహు బలహీనుడయ్యెను. కాని తన శరీరము కృశించినను, మనస్సు సంతోషముతో నిండుకొనియుండెను. ఉదయ మున ప్రాణముతో నుండుటమాత్రమేకాక, కలతలేని చల్లని ముఖముతో సుందరుడు కనుపించినప్పుడు, శత్రువులు ఆయనలో నేదో అద్భుతమైన శక్తి యున్నదని తలంచి భయపడి, ఆయనను బంధకములలోనుండి విడిచిపెట్టిరి. కట్లు విప్పబడినను ఆయాసముచేత మూర్ఛిల్లి క్రిందపడి పోయెను. తరువాత కొంతసేపటికి లేచినను, అనేక పర్యాయములు క్రింద పడుచు మెల్లగా ఆ భయంకరమైన చోటునుండి తప్పించుకొనెను. అచ్చోట సన్యాసి సువార్తబోధసంఘము (వీరినిగూర్చి తరువాత ఒక అధ్యాయములో చెప్పబడును) వారివలన గుణపడి రహస్యముగానున్న కొందరు క్రైస్తవు లుండిరి. వారు గాయపడిన తమ సహోదరుని దయతో పరామర్శించి బలపరచి పంపివేసిరి.

ఇలోమ్ చెరసాలలో గడిపిన దినములను గూర్చి సాధువు వ్రాసిన సంగతులు తరువాత ఒక అధ్యాయములో కనుపించును. వాటిలో నగుపడు విశేషమేమనిన ఆ దినములలో సుందరుని కుండిన సంతోషమునకు కార ణము, తనను ఎన్నడు విడువని ప్రియ స్నేహితుడైన యేసునాథస్వామి తనతో ఆ చెరసాలలోకూడ నున్నాడన్న తెలివియే.

గార్వాలులోని శ్రీనగరనుచోట ఎవరును తలంచని ఆశ్చర్యకరమైన సంగతియొకటి జరిగెను. క్రీస్తునుగూర్చి అక్కడ బోధించినయెడల కీడు సంభవించునని సుందరుడు ఎరిగియుండినను, ఆ యూరిబైట నిలువబడి బోధించుచుండెను. అక్కడనున్న కొందరు యౌవనులు, ఊరిలోపలికివచ్చి బోధించుము చూతమని పంతము పలుకగా, సుందరుడు ధైర్యముతో పట్టణ ములో ప్రవేశించి అంగడివీధిలో నిలువబడి బోధించ నారంభించెను.

ఆయన మాటలు విని కొందరు వీరావేశముతో వెళ్లి ఆ యూరిలోని పండితుని పిలుచుకొని వచ్చిరి.

పండితుడు, జనులనుకొనినట్లు సుందరుని ఎదిరించి ఆయనతో వాదించుటకు బదులు, అందరియెదుట తన రెండు వ్రేళ్లు సుందరు నోటిలో పెట్టి, 'మనమిద్దరము సహోదరులము, శత్రువులము కామని చూపుట కిట్లు చేసితిని; నేనును క్రీస్తుదాసులలో నొకడన'ని స్పష్టముగ జెప్పెను. ఈ మాటలు ప్రజలకు పిడుగుపడినట్లుండెను. కొంతసేపటిలో వారు సిగ్గుపడి తలవంచుకొని వెళ్లిపోయిరి. ఆ దినము సుందరుని కెంతో సుదినముగ నుండెను. ఆ భక్తునితో సుందరుడు సంతోషసల్లాపములలిపి, అతడు అజ్ఞానాంధకారములతో నిండియున్న ఆ పట్టణములోనున్న మరికొందరిని సత్య విజ్ఞానమునకు తేవలెనని కోరి అక్కడ నివసించుచున్నట్టును అప్పటికి పదునలుగురు దేవుని కృపవలన క్రైస్తవులై యున్నట్టును విని, దేవునికి స్తోత్రములు చెల్లించెను.

జనసంచారములేని అరణ్యప్రదేశములలో సుందరుడు అనేక గొప్ప విపత్తులపాలగుట సహజమే. భులేరాచుట్టునున్న అడవులగుండ పోవుచుండగ వృక్షములు క్రిక్కిరిసి దొంగలకు హంతకులకు ఇరవైన యొక చోటికి వచ్చెను. అక్కడ నలుగురు దొంగలు అకస్మాత్తుగ కనుపించిరి. వారిలో నొకడు కత్తి దూసి సుందరునిమీద కెగిసెను. సుందరుడు ప్రాణము పోయినదని నిశ్చయించుకొని వెంటనే తలవంచెను. అది చూచి ఆ దొంగ మనస్సు కరిగి, సుందరుని చంపక, ఆయనదగ్గరనున్న డబ్బంతయు ఇచ్చివేయుమని యడిగెను. సుందరునియొద్ద డబ్బులేకుండుటచే ఆశాభంగమునొంది ఆయనదగ్గర నున్న కంబళిమాత్రము తీసికొని దొంగలు వెళ్లిపోయిరి.

ప్రాణములు దక్కినవని దేవుని స్తుతించుచు తన మార్గమున బోవుచుండగ సుందరుని దొంగలలో నొకడు తిరిగి కేకవేసి పిలిచెను. ఈసారి తనకు మరణము సిద్ధమని నిశ్చయించుకొని సుందరుడు తిరిగి వచ్చెను. నీ వెవడవు, నీవేమి బోధించుచున్నావని వారడుగగా, సుందరుడు తాను క్రైస్తవ సాధువునని చెప్పి, నూతన నిబంధన తెరచి, ధనవంతుడు లాజరు కథ చదివి వినిపించెను. దొంగ బహు జాగ్రత్తగా వినెను. 'నీవేమి తలంచుచున్నావ'ని సుందరుడడుగగా, 'ధనవంతుని అంతము నాకు భయంకరముగనున్నది; వాని కొద్ది పాపముల కంత గొప్ప శిక్ష వచ్చినయెడల, పంచమహాపాతకుడనైన నా గతి యేమగునోయని చింతించుచున్నా'నని ప్రత్యుత్తరమిచ్చెను.

శుభసూచకముగనున్న యీ మాటలు దొంగకు సువార్తబోధించుటకు వీలుకలిగించెను. వెంటనే దేవునికి మానవునియెడలనున్న కరుణాకటాక్షములనుగూర్చి సుందరుడు తెలిపెను. దొంగయొక్క మనస్సు కరిగెను. కన్నీటితోను నిట్టూర్పుతోను తానుచేసిన పాపదోషములనంతను ఒప్పుకొనెను. సుందరుని తన గుహాలోనికి పిలుచుకొనిపోయి భోజనము సిద్ధపరచి, ఆయనను .తినుమని బతిమాలెను. మరికొంతసేపు సంభాషించిన పిమ్మట ఇద్దరును పరుండి నిద్రించిరి. ఉదయమున వేకువనే దొంగ సుందరుని లేపి ఎముకలతో నిండియున్న మరియొక గుహకు తీసికొనిపోయి, ఇవన్నియు నేను చంపిన మనుష్యుల ఎముకలు, ఇన్ని మహాపాతకములు చేసిన నాకును రక్షణగలదా?, యని ఎలుగెత్తి యేడ్చెను. వీని నిజమైన పశ్చాత్తాపమును అంగలార్పును చూచినప్పుడు సుందరుని మనస్సు అనుతాపముతో నిండుకొనగా, సిలువమీద వ్రేలాడుచున్న దొంగ క్షమింపబడెనన్న సంగతి చెప్పెను. అప్పుడు వారిద్దరు మోకరించగా, ఆ పాపి నిట్టూర్పులతో తన పాపమును దేవుని యెదుట ఒప్పుకొనెను. సాధువు వానిని విడిచి వెళ్లకముందు వాడు ఇరుకును సంకుచితమునైన నిత్యజీవ మార్గమందు నడుచుట ప్రారంభించెను. అప్పుడు వానిని లాబ్బా యను చోటనున్న మిషనెరీలకు సాధువు అప్పగించెను. అక్కడవాడు బాప్తిస్మము పొందెను. వానితోటి దొంగలు ముగ్గురును తమ దుర్మార్గ వృత్తిమాని, న్యాయమైన జీవనోపాధి సంపాదించుకొనిరి. ఈ నలుగురికిని మంచి మార్గము చూపుటకు ప్రభువు సుందరును ఉపయోగించుకొనెను.

# 4. అధ్యాయము

## టిబెట్టు

డార్జిలింగుకు ఉత్తరముననున్న చుంబియను లోయయొక్క అందము చూచువారి మనస్సును పరవశపరచునట్టిదై యున్నది. ఆసియాలోని దేశములలోకెల్ల బహు నట్టిదని, మనుష్య సంచారమునకు పనికిరాని ఊసర భూమియైన టిబెట్టుకుపోవు మార్గములలో నొకటి యీ చుంబియను లోయ గుండ నున్నది.

పదునెనిమిదవ శతాబ్దాంతమువరకు విదేశీయులు టిబెట్టుకును, దాని ముఖ్య పట్టణమైన లహాసాకును పోవుటకు మంచుతో కప్పబడి చలిగానుండు పర్వతములవలన ఆటంకము తప్ప మరి యే ఆటంకములు లేకుండెను. జెషు యిట్లు క్యాథలికులను రోమాను తెగలవారు కొందరు లహాసాకు వెళ్లి అక్కడ చాలాకాలముండి టిబెట్టు పరిపాలకుల దయను పొందియుండిరి. 1325-వ సంవత్సరములోనే విదేశీయులు టిబెట్టులో ప్రయాణముచేసినట్టు తెలియు చున్నది. కాని లహాసాలో నివసించుటకు మొదటవచ్చిన ఐరోపియనులు 1661-వ సంవత్సరములోనే టిబెట్టుకు వచ్చిరి.

రెండువందల సంవత్సరములకుముందు ఐరోపియనులు ఆసియాలో నెక్కడనైనను నిరాటంకముగ తిరుగుటకు వీలుండెను. అప్పుడు ఐరోపియనులను ఒక నూతన వస్తువుగ భావించి ఉపచరించిన జాతులవారు ఇప్పుడు తెల్లవారనగ భయపడుదురు. పదునెనిమిదవ శతాబ్దాంతమందు నేపాళ దేశస్థులు టిబెట్టుమీద దండెత్తినప్పుడు, టిబెటీయులకు సహాయముగావచ్చిన చీనావారు గుర్ఖాసైన్యమును నిర్మూలముచేసిరి. అప్పటినుండి చీనావారు లహాసాలో విశేషమైన అధికారముగలవారై యున్నారు. ఈ కాలమందే విదేశీయులు టిబెట్టులో ప్రవేశించకూడదను ఖండితమైన చట్టము బయలు దేరెను. చీనావారి అధికారము టిబెట్టులో తగ్గగానే, రష్యాకు టిబెటీయులు పంపిన రాయబారము మూలముగా రష్యావారికి టిబెట్టుమీద కొంత అధికారము కలిగెను. బర్యాట్ లామాలను టిబెట్టులోని బౌద్ధమత గురువు లనేకులు రష్యాలోని కళాశాలలలో చదువుకొనినవారై యుండిరి.

వీరిలో ముఖ్యుడైన డోర్జీఫ్ అను గురువు పైన చెప్పబడిన టిబెట్టునుండి రష్యాకు వెళ్లిన రాయబారులలో ముఖ్యుడుగ 1901-వ సంవత్సరములో రష్యాకు వెళ్లెను. ఇతడును మరికొందరు లామాలును బౌద్ధమతము బలపరచుటలో రష్యావారి సహాయము బహు అవశ్యమనియు, ప్రధానగురువైన దలాయిలామా రష్యా వారి సైన్యముల శక్తిమీద నిర్భయముగ నానుకొనవచ్చుననియు చెప్పి, అనేకు లను మోసపుచ్చిరి. ఈ మాట నమ్మిన అజ్ఞానులైన లామాలు రష్యావారు బౌద్ధమతస్థులని తప్పభిప్రాయము కలిగియుండిరి.

టిబెట్టు బహు గూఢమైనదేశము, అక్కడి నాగరికత బహు పురాతన మైనది. అక్కడ ప్రార్థనజండాలు గాలిలో నెగురుచుండును; మనుష్యులు తమ కాలములో సగము ప్రార్థనలు వ్రాసియున్న చక్రములను త్రిప్పుట యందు గడుపుదురు. ఆలాగు త్రిప్పుటవలన తామే ఆ ప్రార్థనలు అవి తిరిగి నన్నిసార్లు చేసినట్లు ఎంచుకొందురు. అక్కడి పరిపాలన ఆయిదారుశతాబ్ద ములక్రిందట ఉన్నట్లేయుండును. సంస్కరణ మెంతమాత్రము జరుగలేదు. చిల్లంగితనము, మంత్రవిద్య, అగ్ని, కాగుచున్న చమురు మొదలైనవాటివలన దోషిని విచారించుట ఆ దేశములో నేటికిని జరుగుచున్నవి. అక్కడి జనాభా అరువది లక్షలుమాత్రమే.

బౌద్ధునికిని దలాయిలామాకును ఉనికిపట్టయిన లహాస్సాలో ఇతర కట్టడ ములకు దూరముగా ఒక కొండమీద కట్టబడిన శృంగారమైన మందిరమొకటి గలదు. దీనిపేరు పొటాల. 'దీని ఎత్తయిన కోటలును, మందమైన గోడ లును మైదానము మీదనుండి శిఖరము మట్టునకు ఎంతో సొగసుగ పైకి లేచు చున్నవి. వీటిపైన బంగారముతోను రత్నములతోను ధగధగ మెఱయుచున్న కలశములు గలవు. కాని ఈ నగరునకు క్రిందనున్న పట్టణమైన లస్సా బహు మురికితో నిండినదై యున్నది. బౌద్ధమతము సకల జీవులును దైవాత్మగలిగినవైనట్టును, అహింసయే పరమధర్మమనియు బోధించుచున్నది. కాని బుద్ధుని అవతారమయిన, దలాయిలామా వసించు ఈ నగరులో పదమూడవ శతాబ్దమందు ఐరోపాఖండములోని పురాతనమైన దుర్గములలో చేయబడిన హత్యలకంటె ఎక్కువ హత్యలు జరిగినవి.'

బౌద్ధమతాభిమాన మొకటియే ఈ జనులలో ఐకమత్యత కలిగించు చున్నది; ప్రతి కుటుంబములోనుండి ఒక కుమారుడు లామాలను గురువుల సంఖ్యలో చేరవలయును. అనేక సంవత్సరములక్రిందట ఒక బౌద్ధ ఋషి

టిబెట్టు దేశమును ఒక కాలమందు అన్యులు జయించి బౌద్ధమతమును నిర్మూలము చేయుదురని భ్రమించెను. ఈ భయముచేతను, మతవైరాగ్యముచేతను, టిబెట్టులోనికి విదేశీయులు ప్రవేశించకుండ ద్వారములన్నియు మూయబడి యుండెను. ఈ కారణముచేతనే అన్యమతమును బోధించుటకు వచ్చెడువాడు, మరి యే నేరస్థునికి విధించబడని క్రూరమైన దండనను కొన్నిసమయములందు భయంకరమైన మరణమును పొందవలసియుండును.

సుందరుడు సువార్త వ్యాపకపు పని ఆరంభించిన కొన్ని దినములలోనే అన్యమతము ప్రవేశించని టిబెట్టుకువెళ్లి యేసుప్రభువు రాజ్యమును వ్యాపింపచేయవలయునని ఉద్దేశించెను. ఉత్తరదేశమందు పుట్టి పెరిగినవాడు గనుక హిమాలయ పర్వతప్రాంతములను ఈయన బాగుగ నెరిగియుండెను.

నూరు సంవత్సరములకు పైగా హిందూదేశమందంతటను విదేశీయులైన మిషనెరీలును వారి ద్వారా క్రీస్తుప్రేమ గ్రహించిన స్వదేశీయుల నేకులును ఈ సమాధానసువార్తను దేశమందంతటను ప్రకటించుచున్నారు. 'ఈ దేశములో సువార్త సత్యములను ప్రకటించువారనేకమందిగలరు. కాని నేపాళములోను ఆ పైన టిబెట్టులోను నున్నవారికి క్రీస్తు ప్రేమనుగూర్చి చెప్పెడి వారెవరునులేరని నామనస్సు పరితపించినది'ని సుందరుడు చెప్పెను.

విదేశీయ మిషనెరీలు టిబెట్టులో ప్రవేశింపకూడదని ఖండితమైన చట్టమున్నది. హిందూదేశస్థుడొక్కడు అక్కడ ప్రవేశించుటకూడ కష్టమే. దారిలోనున్న ఘోరమైన చలిని సహించుటమాత్రమేగాక అనాగరికులును మతావేశము గలవారునైన టిబెటీయుల విరోధమును సహించవలసియుండును. అయినను తన యజమానునికొరకు శ్రమ ననుభవించుట గొప్ప భాగ్యమని ఎంచుకొనిన సుందరుడు ఎంతమాత్రము దిగులుపడక మూఢులును దురభిమానులునైన ప్రజల మధ్యకు తెగించి వెళ్లెను. 'దేవుని కుమారుడైన క్రీస్తు అంధకారమయమైన ప్రాంతములలోనికి మేకులు గ్రుచ్చబడిన తన చేతులతో నన్నభిషేకించి పంపియున్నాడ'ని సాధు సుందరసింగు చెప్పుచున్నాడు.

## టిబెట్టులో సుందరుడుచేసిన సంచారము—1

రక్తము చిందించుటకు వారి పాదములు పరుగెత్తుచున్నవి. శాంతి మార్గము వారెరుగరు. రోమా 3: 15—17.

తన ప్రాణమునైనను లక్ష్యపెట్టక క్రీస్తుయొక్క పని నిమిత్తము చావునకు సిద్ధమై యుండెను. ఫిలిప్పీ 2: 30.

సుందరుడు తన ప్రయాణములనుగూర్చిన దినచర్య వ్రాసియుండక పోవుటచేత ఎంతో ఆశ్చర్యమును భయమును కలిగించు టిబెట్టులో సుందరుడుచేసిన పనియు, పడిన కష్టములును ఆయనకు కలిగిన ఫలితమును ఆయా సంగతులనుబట్టి ఊహింపవలసియుండును.

1908-వ సంవత్సరములో మొదటిసారి టిబెట్టుకు ఒంటరిగా పోయినప్పుడు సుందరుడు పందొమ్మిదేండ్ల లేతప్రాయముగలవాడై యుండుట మాత్రమేగాక ఆ దేశపు భాషనుకూడ ఎరుగనివాడై యుండెను. ఆ దేశపు సరిహద్దులలోనున్న ఒక చిన్న పట్టణములో పనిచేయుచున్న యిద్దరు మొరేవియా మిషనెరీలు ఆయనకు సహాయముచేయ బూనుకొనినప్పుడు సుందరునికి కలిగిన సంతోషము ఇంతింతకాదు. వీరితో ఒకవారము గడిపెను. టిబెట్టులో ప్రవేశించుటకు ఆయన అక్కడనుండి బయలుదేరినప్పుడు తమతోనున్న ఒక స్వదేశీయుడైన బోధకుని ఆయనతో కొన్నిదినములు తిరుగుటకును, ఆయనకు టిబెట్టుభాష నేర్పుటకును పంపించిరి. టిబెటీయులు అన్యమతస్థులను ఎంతో ద్వేషించుదురని మాత్రము సుందరునికి తెలియునే గాని వారు ఎట్టివారో వారి గ్రామములు ఎక్కడనున్నవో ఆయనకు ఎంత మాత్రమును తెలియదు కాని బహు శీఘ్రముగ వీటిని తెలిసికొనెను.

ఆయన వెళ్లినచోటనెల్లజనులును, విశేషముగ లామాలును ఆయన బోధను విసర్జించి బహు ఘోరముగ ఆయనను ద్వేషించిరి. కొన్ని స్థలములయందు సుందరునిబోధ వినుటకు కూడిన గుంపునకు వెలుపలనుండి, కొందరు దుష్టులు ఆయనను దూషించుటకును, హింసించుటకును ప్రయత్నించిరి. ఈ యవమానమునంతను సహించుచు, టాషీగంగ అను ఒక పెద్ద పట్టణమును చేరినప్పుడు ఆ యూరిలోని లామా, తనను దయతో చేర్చుకొని, ఉపచరించుట చూచి సుందరుడు ఎంతో సంతోషించెను. ఈ లామా ఒక ముఖ్యుడు. ఈయనచేతిక్రింద కొన్నివందలమంది చిన్నలామా లుండిరి.

అది బహు చలికాలమైనందున సుందరునకు అక్కడ కలిగిన ఆతిథ్యము, భోజనము, బసయు గొప్ప భాగ్యముగ నుండెను. ఇదియేగాక ఈ లామా తన యధీనమందున్న ప్రజల నందరిని సభచేసి, సుందరుని వారికి బోధించుమని చెప్పెను. ఈ గొప్ప సమయమునుగూర్చియు సుందరుడు దేవునికి హృదయపూర్వకమైన స్తోత్రములను చెల్లించెను.

అక్కడనుండి బయలుదేరి, టాషీగంగ్ లామాకు స్నేహితుడైన మరియొక లామా అధికారముక్రిందనున్న పట్టణముచేరి అక్కడను నిరభ్యంతరముగ సుందరుడు సువార్తను బోధించెను కాని, అటుపిమ్మట ఆయున దర్శించిన పట్టణములలోను గ్రామములలోను ఆయనకు అధికమైన శ్రమ సంభవించెను. ఆయనను తరుముగ భయపెట్టి, మా ప్రాంతములు విడిచి ప్రాణము దక్కించుకొనుటకు పారిపొమ్మని జనులు చెప్పిరి. వీరికి కించిత్తయినను జడియక అనేక శ్రమల ననుభవించుచు సుందరుడు తన పరిచర్య ఉత్సాహముతో చేయుచు వచ్చెను.

ఈ విధముగ సాధు సుందరసింగు మూఢభక్తికిని అజ్ఞానాంధకారమునకును దుర్గమైన టిబెట్టు దేశమును ముట్టడించెను. తెగింపుతో కూడిన ఈ పని యందు ఆయునకు కలిగిన హింసలును అవమానమును అధికముగ నున్నను, ఒక్క ఆత్మను క్రీస్తుకొరకు సంపాదించిన సంతోషముతో పోల్చతగినవి కావని ఆయున యెంచెను. 'ఇట్టి కాళ్లతో హిమముచేత కప్పబడిన టిబెట్టులో సహా నడువవలెనని సుందరుడు చేసికొనిన తీర్మానమే ఆయన ఆత్మలను ప్రభువు తట్టు త్రిప్పవలెననెడు దృఢ నిశ్చయమును చూపుచున్నద'ని సింహళములో నొక స్నేహితుడు చెప్పెను.

ఇంతకుముందు సంభవించిన కష్టములకంటె గొప్ప కష్టములు వచ్చునని సుందరు డెరిగియుండియు, క్రీస్తు మత విరోధులైన టిబెటీయులకు క్రీస్తు ప్రభువు నామమును తెలియపఱచవలెనని పూర్ణమైన నిశ్చయముతో తాను చేయుబూనిన పనిని కొనసాగించెను. రాసారను పట్టణములో బోధించుచున్నప్పుడు సుందరుని పట్టుకొని అక్కడి ప్రధమలామా యెదుటికి కొనిపోయి, సెలవులేకుండ పట్టణములో ప్రవేశించి, క్రీస్తుమతబోధ చేసినను నేరములకు ఆయునను తగినట్టుగా శిక్షింపవలసినదని జనులు కోరగా, ఆ లామా ఆయునకు మరణశిక్ష విధించెను. కఠినచిత్తులైన జనులమధ్య సుందరుని చంపబడవలసిన చోటికి తీసుకొనిపోయిరి. టిబెట్టులో ప్రాణము తీయుటకు రెండు విశేషమైన యేర్పాటులుండెను. యాక్ అను జంతువుయొక్క పచ్చి చర్మములో నేరస్థునిచుట్టి కుట్టివేయుదురు. అది ఎండలో ఎండినకొలది లోపలనున్న మనుష్యుని నొక్కి యిరికించగా వాడు చచ్చిపోవును; లేక నీళ్లులేని లోతైన నూతిలో నేరస్థుని పడవైచి, నూతికి భద్రముగ మూతవేయుటచేత నేరస్థుడు ఆకలిగొని కృశించి చనిపోవును. మన సాధువును ఈ రెండవ విధముగ చంపవలెనని నిశ్చయించిరి.

చంపబడవలసిన చోటికి చేరగానే సుందరుని వస్త్రములు తీసివేసి, ఎముకలతో నిండి చీకటిగానున్న నూతిలో ఆయనను ఎత్తి పడవైచిరి. ఆయన క్రిందపడునప్పుడు, ఆయన కుడి భుజము బెణికెను. అంతకుముందు ఆ పాతాళములో వేయబడిన అనేకుల ఎముకలును, కుళ్లిన మాంసమును, సహింప శక్యముకాని దుర్వాసన కొట్టుచుండెను. అట్టి భయంకరమైన చోట సుందరుడు పోయిపడెను. ఇట్టి కసుమాలముమీద పడి చచ్చుటకంటె మరి యేవిధమైన చావైనను అంగీకారముగ నుండును. చేయి పెట్టిన చోటెల్ల కుళ్లిన మాంసమే తగిలెను. దాని దుర్గంధము సహింపక శక్యముకాకుండెను. తన రక్షకుడు చెప్పినట్టు 'నన్నెందుకు చెయ్యి విడిచితిన'ని యీయన అంగలార్చెను.

పగలు గడచి రాత్రి ఆయెను. సుందరునికో విశ్రాంతిలేదు. నిద్ర మొదలే లేకుండెను. నీళ్లుగాని ఆహారముగాని లేకుండ ఒకదినము రెండు దినములు గడిచెను. ఇక నెక్కుడుదినములు ఈ నరకబాధ సహింప శక్యము కాదని సుందరుడు నిశ్చయించుకొనెను. నిరాశ చేసికొనిన సాధువు మూడవ రాత్రిలో దేవునికి తనను అప్పగించుకొనుచున్న సమయములో నూతిపైనున్న ఇనుపమూత కదల్చినట్టు శబ్దము వినిపించెను. ఎవరో తన సమాధి తలుపులను తెరచినట్టు తోచెను. తాళము తీసినట్లును ఇనుపమూత తెరచినట్టును శబ్దము వినిపించెను. తనను విడిపించుటకు వ్రేలాడవేయబడిన త్రాటిని పట్టుకొనుమని ఎవరో చెప్పినట్టు నూతిపైనుండి యొక శబ్దము వినిపించెను. ఆ త్రాడు అందగానే శేషించిన తన బలమంతటితో దానిని పట్టుకొనెను. అప్పుడు మృదువుగ పైకి లాగబడి నూతిలోని దుర్గంధమునుండి తప్పించుకొని పైకినచ్చి ఆరోగ్యకరమైన వాయువును పీల్చుకొనెను.

ఆయన పైకిరాగానే నూతిమీద మూత తిరిగి వేయబడి తాళముతో బిగించబడెను. చుట్టు చూచినప్పుడు తనను విడిపించిన పురుషుడు సుందరునికి కనిపించలేదు. గాయపడిన చేతిబాధ తగ్గిపోయెను. పైన పవిత్రమైన గాలి పీల్చుటచే ప్రాణము తెప్పరిల్లెను. తనను అద్భుతముగా విడిపించిన దేవుని స్తుతించుచు ఆ రాత్రి అక్కడనే యుండి తెల్లవారగానే కష్టముతో ప్రాకుచు సత్రముచేరి బలపడి పని ఆరంభించువరకు సుందరుడు అక్కడనే యుండెను. ఎప్పటివలె పట్టణములో తన సువార్తబోధపని తిరిగి ఆరంభించగానే ప్రజలందరికి ఎంతో కోపము వచ్చెను. చనిపోయెనని వారు ఎంచిన మనుష్యుడు సురక్షితముగానుండి తిరిగి బోధించుచున్నాడని లామాను వెంటనే

తెలియపరచిరి. సాధువును తిరిగి పట్టుకొని లామాయొక్క న్యాయాసనము ఎదుటికి తీసుకొనిపోయిరి. ఎట్లు తప్పించుకొంటివని యడుగగా, సుందరుడు తాను అద్భుతముగా విడిపింపబడిన రీతిని వివరించెను. ఎవరో తన తాళముమును ఎత్తుకొనిపోయి, సుందరును నూతిలోనుండి విడిపించెనని, ఆ ద్రోహిని పట్టుకొనవలెనని ఆగ్రహముతో చెప్పి, లామా తాళముకొరకు వెదకినప్పుడు అది తన మొలదట్టిలోనే జాగ్రత్తగానున్నట్టు కనిపెట్టి ఆశ్చర్యముతోను భయముతోను నిండినవాడై, ఏమియు మాటలాడలేకపోయెను. సుందరుని తప్పించిన సర్వశక్తిగల దేవుడు తనమీదను తన జనులమీదను ఎదో గొప్ప విపత్తు పంపునేమోనని భయపడి, లామా తన పట్టణమును విడిచి సాధ్యమైనంత దూరముగ పొమ్మని సుందరునికి ఆజ్ఞాపించెను. ఈ విధముగ భయంకరమైన మరణమునుండి తప్పించినందుకు సుందరుడు దేవుని ఎంతో స్తుతించెను.

జనసమ్మర్దములేని టిబెట్టు మెట్టప్రదేశమునుండి అరణ్యములోనికి సుందరుడు తరుమబడినప్పుడు ఆయనకు కలిగిన ఔన్నత్యమైన ఆత్మీయానుభవములను కూర్చి ఆయన తరుచుగ మాట్లాడకపోయినను తాను దేవునివలన పిలువబడినవాడని, మానవుల సహాయము లేనప్పుడు దేవుడే తనను కాపాడుచుండెనని, ఆయన గ్రహించుటకు వీలయ్యెను. నెలల తరబడి సుందరుడు ఏ మానవుడు త్రొక్కని ప్రదేశములలో ఏకాంతముగ తిరుగులాడుచు, దేవుని మహాత్మ్యములను చూచుచు, ఆయనయొక్క సన్నని శబ్దము వినకలిగిన పర్వత శిఖరములయందు ఆనందించుచుండెను.

ఇట్టి ప్రాంతములలో సుందరుడు దివ్యదర్శనములను చూచుటయేకాక, అక్కడనుండి క్రిందికి వచ్చినప్పుడు గొప్ప సమూహములకు పరిచర్య చేయుటకు శక్తినికూడ పొందుచుండెను. దేవునితో నేకాంతముగనుండగల పర్వత వైరాగ్యములలో తన కాలము గడుపవలెనని వాంఛకలిగియున్నను, క్రింది దేశములలో ఆయనకు కలిగిన లెక్కలేని శోధనలలో సహా తాను ప్రభువు కొరకు కష్టపడుచు జీవించిన కాలములో ఆయనలోనుండిన మాధుర్యమైన పవిత్రత ఏమాత్రమైనను చెడకుండ తిరుగగలిగెను.

## టిబెట్టులోని అనుభవములు—2

క్రీస్తు సువార్త ప్రకటించుటకు నేను వచ్చినప్పుడు ప్రభువు నాకు గొప్ప ద్వారము తెరచెను ..... కాని ఇక్కడను విరోధులు విస్తరించిరి. 2 కొరిం. 2. 12.

నేనైతే ప్రభువైన యేసు నామము నిమిత్తము బంధింపబడుటకు మాత్రమేకాక చనిపోవుట కును సిద్ధముగానున్నాను. అపొ. కార్య. 21 : 13.

“శత్రువులయెడల ఉత్తముని కర్తవ్యము పగతీర్చుకొనకుండ నుండుట మాత్రముకాదు. పగవారి రక్షణకోరి వారికొరకు ప్రార్థించి, వారి నాశీర్వ దించి, వారిని కాపాడుటకు తన సౌఖ్యమును కోల్పోవుట దైవలక్షణమైన ప్రేమకు గుఱుతని యేసునాధుడు బోధించెను.” ఈ మాటలు డాక్టరుఫాస్ డిక్ అను భక్తుడు వ్రాసిన పరమపురుష దివ్యలక్షణ ప్రదీపమను గ్రంథము లోనున్నవి. ఇట్టి అపూర్వమైన ప్రేమయే సాధు సుందరసింగునకు ఉన్నది. టిబెట్టు మొదలైన దేశములలో ఘోరమైన బాధలకులోనై సుందరుడు చేయు చున్న సువార్తబోధపనిలో ఆయనను ఎదిరించు శత్రువులయెడల ఇట్టి ప్రేమను చూపుచున్నాడు. ఆయన ఉపన్యసించునపుడు తనకు సంభవించిన సంగ తులు దృష్టాంతములుగా చెప్పుట వాడుక; ‘తన ప్రాణమును రక్షించుకొన గోరువాడు దాని పోగొట్టుకొనును.’ అను విషయమునుగూర్చి ప్రసంగించు చుండగ, ఆయన ఈ విశేషమైనసంగతి చెప్పెను. చాల చలిగానున్న ఒక దినమున టిబెట్టులో పర్వతములమీద పోవుచుండగ, ఆయనయును ఆయనతో నున్న ఒక టిబెటీయుడును, అప్పుడు పడుచున్న మంచులో తమ యూరు చేరకముందే బిగిసికొనిపోయి చనిపోవుదుమని భయపడుచుండిరి. అప్పుడు క్రింద లోతైనలోయలో చచ్చినవానివలె పడియున్న ఒక మనుష్యుని చూచి, వాని నెత్తుకొని తెచ్చుగానుండు ఒక చోటికి తీసికొనిపోదమని సుందరుడనెను. కాని ఆయనతోనున్న టిబెటీయుడు ‘మనము ప్రాణముతో ఊరుచేరుటే కష్టముగానుండగ వానిని కాపాడుటెట్లు అని చెప్పి, ముందుకు సాగిపోయెను. అప్పుడు సాధువు తానే ఆ మనుష్యుని ఎత్తుకొని కష్టముతో నడిచిపోవు చుండగ, ఈ రాపిడివలన ఉష్ణముకలిగి ఆయనకును ఆయన మోయుచుండిన మనుష్యునికి ఆ చలిని సహించుటకు సాధ్యమయ్యెను. ఈ విధముగ ఆయన కొంచెముదూరము నడిచిపోగా, తనకంటె ముందు వెళ్లిన టిబెటీయుడు మార్గములో చలిచేత చచ్చిపడియుండుట చూచెను.

సుందరుడు, తాను మోసికొనివచ్చిన మనుష్యునితో ఒక గ్రామము చేరెను. కొరప్రాణముతోనుండిన ఆ మనుష్యుడును తెప్పరిల్లి బ్రతికెను. అప్పుడు తమ్మును మరణమునుండి తప్పించిన దేవుని వారిద్దరును స్తుతించిరి. ‘తన ప్రాణమును రక్షించుకొన గోరువాడు దాని పోగొట్టుకొనును. నా

నిమిత్తము తన ప్రాణము పోగొట్టుకొనువాడు దానిని రక్షించుకొనునను వాక్యములోని సత్యము అదివరకెన్నడు నిరూపింపబడని రీతిగా ఆ సమయమందు దృష్టాంతపరచబడెన'ని సుందరుడు చెప్పెను.

ఒకనాడు సుందరుడు మెరక పల్లములుగల కిరుకైన గుట్టలమీద ఎక్కుచుండగ, అక్కడనున్న ఒక గుహలో ప్రార్థించుచుండిన ఒక మనుష్యుని చూచెను. నిద్రరాకుండుటకు అతడు తన జుట్టును పైకిలాగి కట్టుకొని కండ్లు మూసికొని ఎడతెగకుండ ప్రార్థించుచుండెను. సుందరు డాగుహలో ప్రవేశించి, నీవు ఇంత శ్రమతో ప్రార్థించుటకు కారణమేమని యడిగెను. అనేకులైన ఇతరులవలెనే ఆ మనుష్యుడును లౌక్యసంబంధమైన కార్యములలో తన కాలమును గడిపినను, వాని మనస్సులో భవిష్యత్తునరాబోవు ఏదో భయంకరమైన విమర్శనుగూర్చిన భయము ఎప్పుడునుండెను. చివరకు, ఈ భయముచేతనే లోకమునువిడిచి, తన ప్రార్థన ధ్యానములద్వారా తన యాత్మకు శాంతిని సంపాదించుకొనవలెనని అచ్చోటికి వచ్చియుండెను. కాని తన యాత్మలోనున్న వ్యాకులము ఎంతమాత్రము పోలేదని అతడు చెప్పెను. అందుకు సాధువు తన నూతననిబంధన తెరచి 'ప్రయాసపడి భారమును మోసుకొనుచున్న సమస్తమైనవారలారా నా యొద్దికి రండి' అను మధురవాక్యములు అనేకము చదివి, వినిపించి, క్రీస్తుప్రభువే అతనికి నిజమైన సమాధానము దయచేయగల సమర్థుడని చెప్పెను. సుందరుడు చెప్పిన ఈ ఆశ్చర్యకరమైన మాటలు నిర్భాగ్యుడైన ఆ మనుష్యుడు నిశ్చేష్టితుడై విని, చివరకు దిగ్గున లేచి ఇప్పుడు నా మనస్సుకు నెమ్మది కలిగినది. ఆ సద్గురు పాదములయొద్దకు నన్ను నడిపించి, ఆయన శిష్యునిగ జేయుమని కేకవేసి చెప్పెను. సాధువుచేత వెంటనే బాప్తిస్మముపొంది క్రైస్తవుడు కావలెనని తొందరపడిన ఆ మనుష్యుని ఒక గ్రామమునకు తీసికొనిపోయి ఎక్కువ బోధపొందుటకు అక్కడనున్న మిషనెరీలకు అప్పగించెను.

ఒక ఊరిలో ఆయన మాటలకు చెవినియ్యమని యెదిరించిన జనులు, సుందరునికి సంభవించిన ఒక స్వల్పమైన ఆపదవలన ఆయనకు స్నేహితులైరి. ఒరకాటముగానున్న పర్వతముమీదికి ఎక్కుచుండగా ఆయన కాలుజారి పడెను. ఆయన పడుచుండగా ఒక పెద్దరాయి ప్రపాతమునుండి క్రిందికి దొర్లెను. ఈ పెద్దరాయి పడినచోట చుట్టుకొనియున్న ఒక పెద్ద త్రాచుపాము వెంటనే నలిగి చచ్చెను. పశువులను కాచుకొనుచున్న ఒక చిన్నవాడు, అదిచూచి, సాధువునొద్దకు పరుగెత్తుకొనివచ్చి, తన యూరి

లోని అనేకమందిని ఆ పాము చంపినదనియు, ఆ దారిని నడుచుటకు ఎవరును తెగించుటలేదనియు చెప్పెను. వాడు ఊరిలోనికి పరుగెత్తుకొనిపోయి గ్రామస్థులకు జరిగిన సంగతి చెప్పెను. ఊరివారు అది విని సుందరుని యెడల ఎంతో కృతజ్ఞతగలిగి, ఆయనను సంతోషముతో చేర్చుకొనిరి. అందువల్ల అక్కడనున్న అజ్ఞానులైన జనులకు క్రీస్తు ప్రేమనుగూర్చి తెలుపుటకు సుందరునికి సమయము దొరికెను.

## రక్తముకారిన పాదములు

ఒకనాడు కరుకైన కొండదారివలన సుందరుని పాదములు గీచుకొని రక్తము కారుచుండెను. సుందరుడు కూర్చుండి గాయము కట్టనారంభించెను. ఆ దారిని వచ్చుచున్న మరియొకడు దగ్గరకువచ్చి ఆ గాయము ఎట్లు కలిగెనని యడిగెను. అప్పుడు వారిద్దరు దీర్ఘమైన సంభాషణచేసిరి. అందు మూలముగా ప్రతిదినము అనేక మైళ్లదూరము ఆయాసములో నడిచి, కల్వరిగిరిమీద రక్తముకార్చిన తన సద్గురువుయొక్క తిరుపాదముల మహిమను ప్రచురము చేయుటయందు సుందరుడు ఇంత శ్రమపడి తిరుగుచున్నట్టు ఆ మనుష్యుడు గ్రహించెను. అతని పేరు టాషీ. అతడు బహుకాలము నుండి క్రీస్తుమతవిచారణ చేయుచుండినవాడు, అందుచేత వీరిద్దరును దీనినిగూర్చి బహు మధురమైన సంభాషణను సలిపిరి. సుందరుడు టాషీకి కలిగిన అనేక సందేహములను తీర్చి రక్షణమార్గమును స్పష్టముగ వివరించెను. నీ గాయపడిన పాదములను చూచినప్పుడు కష్టములను ఇట్లు సంతోషముగ సహించుటకు ఒక అద్భుతమైన శక్తి నిన్ను ప్రేరేపించుచున్నదని తలంచుచున్నాను. నీవు నాతోకూడ కొన్ని దినములుండి నాకు మతోపదేశము చేయుట అవశ్యకమని టాషీ సుందరునితో చెప్పెను. సుందరుడు ఆ ప్రకారమే అతనితో ఒక వారముగడిపి ప్రార్థించి ఆత్మీయ సత్యములను వివరించెను.

పిమ్మట టాషీ తనకు స్నేహితుడును క్రీస్తుమతమునుగూర్చి మంచి అభిప్రాయము గలిగిన ఒక లామాయొద్దకు సుందరుని పంపెను. సుందరుడు అక్కడినుండి తిరిగివచ్చునప్పటికి, టాషీ క్రీస్తుపాదములను పట్టుకొని, ఆయనను సేవించుటయందు సంతోషమును నిరీక్షణయును పరిపూర్ణముగ గలవాడై బాప్తిస్మము పొందవలెనని ఎంతో ఆశకలిగియుండెను. నా మనస్సులోనుండిన సందేహములన్నియు విడిపోయినవి. ఇప్పుడు నాకును, నా కుటుంబ

మునకును క్రైస్తవులము కావలెనని యున్నదని చెప్పెను. అప్పుడు తోమ్మండుగురుండిన ఆ కుటుంబమునకు సుందరుడు బాప్తిస్మమిచ్చి వారిని క్రైస్తవులను చేసితినను మహదానందము గలవాడాయెను. టాషీ లామాయొక్క ప్రధాన కార్యదర్శి యైనందునను ఆ గ్రామములో ముఖ్యుడైనందునను క్రీస్తుమతమును ఇతడు అవలంబించినప్పుడు ఇతనికి హింస సంభవించలేదు, కాని తన నూతనమతమును ఇతరులకు బోధించి దానిని ఇతరులు అవలంబించునట్లు ప్రేరేపింపకూడదని అతనికి ఖండితముగ ఆజ్ఞాపించిరి.

సుందరునివలె లోకమునంతను విడిచి ఆత్మీయమైన కార్యములలో తమను వ్యయపరచుకొనువారు తమకు ఎవరును తోడులేరని సంతాపపడునట్లు సుందరుడును తరుచుగ సంతాపపడుచుండును. మనస్సును పరవశపరచెడు ఉన్నతమైన ఆత్మీయానుభవము కలిగినతరువాత జ్ఞానతంతువులశక్తి ఉడిగి మనస్సు బలహీనముగనుండుట సహజమే. సాధారణులైన మిషనెరీలును గురువులును ఇటువంటి కాలమందు తాము చేయుచుండిన పనిని మార్చుకొనగలరుకాని సాధువుకైతేనో ఎల్లప్పుడును పని యొకటేకలదు. ఒక స్థలమునుండి మరొక స్థలమునకు వెళ్లి తన మనస్సును బలపరచుకొనవలసియుండును. ఆయన క్రైస్తవాలయములలోను కూటములలోను అన్యులమధ్యను ఆత్మలను సంపాదించుటయందే ఎల్లప్పుడు కాలము గడుపుచుండును. ఇందువల్ల కలుగు మితము మీరిన శ్రమకు అంతములేదు. ఇంత గొప్పకష్టమును సహించుటకు కావలసిన దార్ఢ్యము దేవునితో ఎంతో సమీపముగ జీవించుటవలననే సుందరసింగును కలిగినదని తిరువాన్కూరులో ఒక మిషనెరీ చెప్పెను. ఇదియే సుందరుడు ఎడతెగకుండ పాటుపడుటకు కారణము. ఎన్నడును విసుకకుండ తనను చూడగోరువారికి ఉపచారవాక్యములు చెప్పుచు రాత్రియందును పగటియందును దేవుడు తనకు నియమించుపనిని చేయుటకు సిద్ధమనస్సుగలవాడై యుండుటయందు సుందరుడు తన యజమానుడైన యేసుప్రభువును అనుకరించుచున్నాడని చెప్పవచ్చునుగదా? క్రీస్తుమనస్సు ఆయనలోనున్నది గనుక ఆయనవలెనే సుందరుడును ఎవరును తోడులేనివాడై ఒంటరిగాడై ఒంటరిగానున్నాడు. ఒకనాడు ఈవిధముగ మామూలుకంటె ఎక్కువదూరము నడిచినందున కాళ్ల నొప్పులచేతను, ఆకలిచేతను బాధపడుచు మనస్సు క్రుంగియున్న సమయమందు, అకస్మాత్తుగ నొక మనుష్యుడు మార్గమందు కనుపించెనని సుందరుడు చెప్పెను. ఆ క్రొత్తస్నేహితుని మధురమైన సంభాషణలో తన కష్టమునంతను మరచిపో

గలిగెను. వారిద్దరు గ్రామమునకు సమీపించినప్పుడు, ఆ పురుషుడు అంతర్ధానమైనందున సుందరుని మనస్సులో బహు తొందరకలిగెను. ఆయన దానిని, వివరించలేకపోయెనుగాని 'తాను బలహీనుడుగానున్న సమయమందు తనను బలపరచుటకు ప్రభువు తన దూతను పంపెన'ని చెప్పెను.

## హతసాక్షులు

హతసాక్షుల రక్తము సంఘమునకు విత్తనము.

ఆయన మనకొరకు తన ప్రాణము పెట్టెను. మనముకూడ సహోదరులకొరకు మన ప్రాణములను పెట్ట బద్ధులమైయున్నాము. 1 యోహాను 3: 16.

ఏటవాలుగా నున్న మోక్షమునకు పోవుమార్గమునందు ప్రయాసతో తెగించి ఎక్కిపోయిన శూరుల పారంపర్యములో సాధు సుందరసింగు నొకడుగా నున్నాడు. తనకంటె ముందు టిబెట్టుకు యేసుక్రీస్తు సువార్తను గొనిపోయిన అనేకమంది భక్తులు హతసాక్షులుగా తమ రక్తమును ధారపోసినట్టు సుందరుడు అక్కడనున్న కాలమందు స్పష్టముగ తెలిసికొనెను. వీరిలో మొదటి హతసాక్షి సుందరుని జన్మస్థానమైన పాటియాల సంస్థానమునకు చెందినవాడు. ఈయన కర్తార్ సింగను సిక్కుమతస్థుడు. ఒక ధనవంతుడైన జమీందారుని కుమారుడు. ఈయన తన తలిదండ్రులకు ఏకపుత్రుడైనందున ఆ కుటుంబముయొక్క పేరు నిలుపునని ఆశతో నిరీక్షించిరి. సుందరునివలెనే సుకుమారముగ సమస్తసౌఖ్యములతో పెంచబడెను. తండ్రి ఈయనకొరకు నిరీక్షించిన ఔన్నత్యపదవికి కావలసినవిద్య ఈయనకు నేర్పబడెను. ఈ విద్యతోపాటు మతమునుగూర్చిగాని దైవభక్తినిగూర్చిగాని ఏమియు ఈయనకు నేర్పబడకపోయినను, ఆత్మను ఈడేర్చుటకు అవశ్యమైనజ్ఞానమే శ్రేష్ఠమైనదని, ఆత్మదాహమును లౌక్యవిద్య సంతృప్తిపరచలేదని ఈయన కనుగొనెను. ఇట్టి సమయమందు క్రీస్తుమతమునుగూర్చి విని కొంచెముకొంచెముగా దానియొక్క సత్యమును గ్రహించెను. దానినిగూర్చి ధ్యానించినకొలది అదే ఆత్మ దాహమును తీర్చగలదని నమ్మి క్రీస్తుమతము నవలంబించుటే న్యాయమని నిశ్చయించుకొనెను. ఇరుకును సంకుచితమునైన ఈ మార్గమేగాని మరియొకటి ఈయనకు సరియని తోచలేదు.

ఒకనాడు కర్తార్ సింగు తాను క్రైస్తవుడైనట్టు బహిరంగముగ దెలిపెను. ఈ మాట వినిన బంధువులకు తలమీద పిడుగుపడినట్టుండెను, వీరి మనస్సు విచారముతో నిండుకొనెను. ఆయన చేసికొనిన తీర్మానమును

మార్చుకొనునట్లు చేయవలెనని వారెన్నో ప్రయత్నములు చేసిరి. వాటికన్ని టికి ఆయన మళ్లకుండుట కనిపెట్టి, తండ్రి ఆయనకు ప్రధానముచేయబడిన సొగసైన చిన్నదానిని ఆయనయొద్దకు పంపెను. పాప మాచిన్నది ఆయన క్రైస్తవుడైనయెడల తన గతి ఎంతో దౌర్భాగ్యమైనదగునని, ఆ తీర్మాన మును మార్చుకొనుమని కన్నీటితో బతిమాలుకొనెను. ఆమె విచారము చూచినప్పుడు కర్తారునిమనస్సు కరిగినను, ఆ శోధనను జయించుటకు దేవు డాయనకు శక్తినిచ్చినందున అతడా చిన్నదానితో ఎంతోమృదువుగ తన హృదయమునంతను క్రీస్తునాథుడడివరకే తనస్వాధీనము చేసికొనెనని చెప్పి, ఆమెను పంపివేసెను. ఆ మాటలు, వినినప్పుడు గుండెబద్దలైనదై, ఆమె కర్తారుని తండ్రియొద్దకుపోయి: 'నే నేమిచేతును, మీ కుమారుడు తన ప్రేమను మరియొక్కరి కిచ్చివేసెనట; నే నెంత బ్రతిమాలినను లాభములేక పోయినద'ని చెప్పెను.

ఇది జరిగిన కొద్దిదినములకు కర్తార్ సింగు తండ్రియింటిలోనుండి వెడల గొట్టబడెను. అన్నవస్త్రములు సంపాదించుకొనుటకు కర్తారుడు కూలిపని చేసికొనవలసివచ్చెను. అట్టి స్థితి వచ్చినదని అధైర్యపడక సుకుమారముగ పెంచబడిన ఆ చిన్నవాడు తనతండ్రి నౌకరుసహా చేయుటకిష్టపడని కఠిన మైన పాటుపడుటకు ఒప్పుకొనెను. అటుపిమ్మట త్వరలోనే దివ్యమైన తన పరిచర్య నారంభించి పాటియాలా పరగణాలోని గ్రామములలోను పట్ట ణములలోను సువార్త బోధించెను. ఆ కాలమందు ఆయన పడిన శ్రమలు పిమ్మట టిబెట్టులో తనకు కలుగబోవు శ్రమలను ధైర్యముతో అనుభవించు టకు ఆయనను బలపరిచెను. పంజాబులో అనేకస్థలములలో బోధించి, కొన్ని వారములమట్టుకు పర్వతములమీద ప్రయాణముచేసి అలసిపోయి, చివరకు తాను కోరిన టిబెట్టులో చేరెను.

టిబెట్టులో బౌద్ధమతము వ్యాపించియున్నది; క్రీస్తుప్రభువు కందులో చోటులేదు. క్రీస్తును పేరుచెప్పినతోడనే ఆ దేశస్థులకు ఎంతో ద్వేషము పుట్టును గనుక, వారు కర్తార్ సింగునకు దయచూపినట్టుగాని, ఆయనబోధ నంగీకరించినట్టుగాని కనుపించదు. అయినను ఉపద్రవములకు భయపడి తిరిగి పోవలెనను యోచన ఆయనకు పుట్టలేదు. క్రీస్తునాథుని ఎరుగని ప్రజలకు ఆయనను తెలుపుట అవశ్యమని, క్రీస్తు తన ప్రాణమును పెట్టినట్టు కర్తారుడు తానును తన ప్రాణమును తనను హింసించువారికి సాక్ష్యార్థముగ పెట్టుటకు సిద్ధపడెను. చిన్నవాడైనను వైరాగ్యముతో క్రీస్తు సువార్తను బోధించు

చున్నాడని కొందరిమనస్సు కరిగినను, ఆయనపక్షము వహించుటకు వారికి ధైర్యము చాలకపోయెను. కాని ఆయన మరణమైనతరువాతనే ఆయన పరిచర్యయొక్కయు, సాక్ష్యముయొక్కయు ఫలితము మనుష్యులకు కనుపించెను.

మన రక్షకుడు చూచినట్లే, కర్తారుడును తన కెట్టిమరణము రానున్నదో ముందుగానే చూచెను. ఆ దేశమునుండి వెళ్లగొట్టవలెనని ఎన్ని ప్రయత్నములుచేసినను, కొంతకాలమువరకు అనేకస్థలములలో బోధించినతరువాత ఆయనను పట్టుకొని త్సింగుహాము లామా ముందరికి తీసికొనిపోయి, చట్టమునకు విరోధముగా ఆ దేశములో ప్రవేశించి అన్యమతమును బోధించినాడను నేరమును మోపిరి. ఆయన నిరీక్షించిన అంతము సమీపించెను. చివరవరకు సాక్ష్యమిచ్చుటకు దేవుడు కృప ననుగ్రహించునను నమ్మికకలిగి ధైర్యముతో తన అంతమును ఎదుర్కొన నిశ్చయించుకొనెను. కర్తారుడు తనకు విధింపబడిన తీర్పును నిశ్చలమనస్సుతో విని, తాను చంపబడవలసిన చోటికి ధైర్యముతో నడిచిపోయెనని తరువాత సుందరుడు వినెను. దారిలో తన ప్రభువైన యేసు క్రీస్తుద్వారా కలుగు రక్షణను అంగీకరించుట అవశ్యమని చుట్టునున్న ప్రజలకు చివరిసారి ప్రకటించెను.

చంపబడు స్థానమునకు చేరగానే ఆయన వస్త్రములు తీసివేసి యాక్ అను మృగముయొక్క పచ్చిచర్మములో ఆయనను కుట్టి ఎండలో ఎండ పెట్టిరి. క్రూరులైన ప్రజలు ఆయన శ్రమలను చూచుటకు చుట్టును నిలువబడి ఆయనను వెక్కిరించిరి. ఆ చర్మము ఎండుటచేత మనుష్యుని ఎముకలు విరుగుచున్నప్పుడు వారు నవ్వుచుండిరట. తన పరమయజమానుని బహిరంగముగ ఒప్పుకొనినప్పుడు ఆయనకు కలిగిన హింసలలో ఆదరణగా నుండిన నూతన నిబంధన ఈ సమయమందు దగ్గిరపడియుండెను. మూడుదినములైన తరువాత తన అంతము సమీపించుచున్నదని కర్తారుడెరిగి, తన కుడిచెయ్యి కొంతసేపు విప్పుమని ప్రార్థించెను. తనకున్న శక్తినంతను సమకూర్చుకొని కర్తారుడు తన నూతన నిబంధనయొక్క పై పుటమీద తన చివరివర్తమానము వ్రాసెను. ఆ మాటలు పర్ష్యను, ఉర్దు, ఇంగ్లీషు అను మూడు భాషలలో నున్నవి. వాటి తాత్పర్యమేమనిన:—

ఒక జీవముకాదు, అనేక వేలజీవములు నా కిమ్మని నేను దేవుని అడిగితిని; నాకు జీవమిచ్చిన ఆ ప్రియరక్షకునికే దానిని తిరిగి తిరిగి సమర్పించుటకే.

తన ప్రియభర్తతో సహగమనము చేయు పతివ్రతయైన ఒక హిందూ భార్య కాటిమీదనున్న తన భర్తయొక్క మృతకళేబరమును విడువనని కౌగలించుకొని తన ప్రాణము సమర్పించునప్పుడు చూపు ప్రేమకంటె నాప్రాణనాథా నీయెడల నేను చూపు ప్రేమ తక్కువగ నుండతగునా?

నే నాయనకు సమర్పించుచున్న జీవము ఆయన అనుగ్రహించినదే. నే నింతచేసినను నేను చేయవలసినదంతయు చేసితినని చెప్పలేను.

క్రీస్తువునకైన నేను పడియున్న ఈ వేదన నిజముగా మరణవేదనయగునా!

అవును, కాని నా మరణవేదన కాదు; ఇది మరణమే కాని, నేను కాను.

ఆయన పడిన శరీరవేదన సహింప శక్యముకానిది; అయినను ఆ వేదనను తెలుపు మొర ఏమియు ఆ సిక్కువీరునినోట రాలేదు. సాయంత్రము ప్రాణముపోవు సమయములో మరణకాలమందు తనకు కలిగిన ఆదరణ నిమిత్తము దేవుని స్తుతించెను. అప్పుడు నెమ్మదిగా 'ప్రభువైన యేసూ, నా యాత్మను నీ కప్పగించుకొనుచున్నాను, చేర్చుకొనుము' అని ప్రార్థించుచు నెమ్మదిగ ప్రాణము విడిచెను.

సాధు సుందరసింగు టిబెట్టునుండి తిరిగి ఇండియాకు వచ్చినప్పుడు ఇంకను సజీవుడైయున్న కర్తారుని తండ్రిని వెదకి కనుగొనెను. కుమారుని పరితాపకరమైన జీవితమునుగూర్చి, మరణమునుగూర్చి ఆయనతో సుందరుడు చెప్పి, కర్తారును అట్టి శ్రమలు సహించునట్లు ప్రేరేపించిన క్రీస్తు ప్రేమను గూర్చి తెలిపి, ఆయనను నమ్ముచున్నారాయని అడిగినప్పుడు, ఆ వృద్ధుడు, 'నేనును ఆయనను నమ్ముచున్నాను'అని చెప్పెను. ఆ మాటలు వినినప్పుడు సుందరునికి ఎంతో ఆనందము కలిగెను.

కర్తారుని ప్రాణత్యాగమును చూచుచున్నవారిలో సింహాసనములామా యొక్క ముఖ్యుడైన కార్యదర్శికూడ నొకడైయుండెను. ఈయన కర్తారుని నూతన నిబంధనను తనయింటికి తీసికొనిపోయెను. దానిలో ఆ సిలువ సైనికుడు తన చివరి వర్తమానమును వ్రాసి, దానిని ఆ దేశములో స్థాపించుటకు తన ప్రాణత్యాగము చేసిన సంగతినంతయు ఆయన మనస్సులో దృఢముగ నాటుకొనెను. అట్టి సమయమందు ఆ గ్రంథమును చదివినతోడనే ఆయన మనస్సునకు నూతనమైన వెలుగును ఆనందమును కలిగెను. కొంత కాలమువరకు తాను కనుగొనిన ఆశ్చర్యకరమైన సంగతులనుగూర్చి తన వద

స్సులో ధ్యానించుకొనుచుండెను గాని చివరకు వాటిని రహస్యముగ నుంచుకొనలేక తన యజమానుడైన లామాతో తాను కర్దార్ సింగువలె క్రీస్తు ప్రభువుకు తన హృదయమును సమర్పించుకొంటినని చెప్పెను. లామా కర్దార్ సింగుకు విధించిన మరణశిక్ష ఆయనకును విధించెను. కాని ఈలాగు అన్యమతము నవలంబించినయెడల ఘోరమైన శిక్షకు పాత్రులగుదురని ఆ దేశస్థులకు తెలుపవలెనని, ఆయనకు విధింపబడిన దండన కర్దారున దండనకంటె పదిరెట్లు ఎక్కువ బాధకరముగ నుండునట్లు చేసిరి. ఆయనను యాక్ అను జంతువుయొక్క పచ్చిచర్మములో కట్టి ఎండ పెట్టుట చాలనట్లు, ఎర్రగా కాలిన ఇనుపకడ్డీలు ఆయన శరీరములో కిపొడిచి బాధ ఎక్కువచేసిరి. త్వరగా చనిపోలేదని తొందరపడి, ఆ జంతువు చర్మములోనుండి బయటికి తీసి, గాయపడిన ఆయన శరీరమునకు త్రాడుకట్టి, ఆ పట్టణపు వీధులవెంబడి ఈడ్చిరి. కాళ్ల వ్రేళ్లలోను, చేతులవ్రేళ్లలోను గోళ్లలోనికి పుడకలు కొట్టిరి.

ఆయన దేహమును చివరకు పెంటకుప్పమీదికి ఈడ్చుకొనిపోయి అక్కడ చనిపోయెనని విడిచిపెట్టి, తమ కసి తీరినదనుకొని ఇండ్లకుపోయిరి. ఆయన చాలాసేపు స్మారకముతప్పి అక్కడ పడియుండి, చివరకు కొద్ది కొద్దిగా ప్రాణమువచ్చి, నిమ్మళముగా తిరిగి ఇంటికి ప్రాకిపోయెను. గాయములన్నియు కుదిరినప్పుడు, తాము చచ్చెనని పారవైచిన మనుష్యుడు సజీవుడై యుండుట ప్రజలు చూచినప్పుడు, ఆయన మంత్రప్రభావముగలవాడని మిక్కిలి భయపడి, నేటివరకు ఆయనజోలికి పోకుండనున్నారు. సాధు సుందరసింగుతో కర్దార్ సింగు సంగతినంతయు చెప్పినవాడు ఆయనయే. మరియు నేటివరకు టిబెటీయులైన తన ప్రజలమధ్య క్రీస్తునుగూర్చి ధైర్యముగా బోధించుటకు దేవుడు తనకు అద్భుతమైన శక్తిని అనుగ్రహించుచున్నాడని ఆయన సుందరునితో చెప్పెను. ఈ చరిత్రలును ఇటువంటి యితర చరిత్రలును సాధు సుందరసింగుటిబెట్టులోను క్రీస్తుసువార్త వెలుగు ప్రవేశింపని ఇతర ప్రదేశములలోను విచారించి కనుగొనెను. అజ్ఞానాంధకారముతో నిండిన ఈ దేశస్థులకు క్రీస్తు ప్రేమనుగూర్చి తెలుపుట దేవుడు తనకు నియమించిన పనియైనట్లు సుందరుడు భావించి అత్యావేశముతో ఆ ప్రాంతములకు బోవుటకు ఇష్టపడుచుండెను. 'నేను దేవుని సేవను ఈ ప్రాంతములలో చేయవలెనని ఆయన నాకు నియమించియున్నాడు. క్రీస్తును ద్వేషించు ఈ జనులవలన నాకు కలుగు ఆపదలకు నేనెంతమాత్రము భయపడను.

ఆయనకొరకు ఈ ప్రాంతములలో నా ప్రాణమును పెట్టి హతసాక్షి కిరీట మును నేను సంపాదించవలసియున్నదని సుందరుడు చెప్పుచుండును.

సాధు సుందరసింగును ఎరిగియుండి, ఆయనను ప్రేమించి, ఘనపఱచు వారందరును మనఃపూర్వకముగా అజ్ఞానులైన ఈ జనులను సువార్త ప్రకటిం చుటయందు దేవుడు ఆయనకు సహాయము చేయవలెనని ఎల్లప్పుడు ప్రార్థింప వలసినదే. కాని ఆయన చెల్లింపగలిగిన శ్రేష్టమైన బలి తన ప్రాణత్యాగము వల్లకాక, 'అనేకశ్రమలద్వారా' సజీవుడైయుండి తన పరమ యజమానుని కీర్తియు, ఈ తరమువారికి ఆత్మీయమైన మేలును, అధికముచేయుటకు, దేవుడు ఆయనకు తోడ్పడవలెనని ప్రార్థించుట మన విధియైయున్నది.

## సాధు సుందరసింగు, కైలాస మహర్షి

కొంతకాలముక్రిందట ఉత్తర ఇండియాలో ప్రచురింపబడు పత్రికలో ఈ క్రింద మాటలుండెను. స్వార్థత్యాగియును దైవభక్తుడునైన మా సహో దరుడు, సుందరసింగు, మంచుతో కప్పబడిన హిమాలయ పర్వత శిఖరముల మధ్య అనేక సంవత్సరములనుండి మానవులకొరకు విజ్ఞాపనము చేయుచున్న కైలాసమహర్షి అనబడు తపసిని కనుగొనెను.—ఈ అంతరంగ సమాజము యొక్క రహస్యములలో నొకటియైన కైలాసమహర్షిని ఈయన లోకమునకు బయలుపరచెను.

తమ అంత్యకాలమును దైవధ్యానమందు గడపుటకు ఋషులు ఏర్ప అచుకొనిన గుహలను సుందరుడు టిబెట్టుకుపోవు సమయములో వెదుకుట వాడుక. హిమాలయ పర్వతపు వరుసలలో నొకటియైన కైలాసమనునది మనుష్యసంచారములేక మంచుతో కప్పబడి ఒక ప్రక్కగా నుండును. సింధూమహానదియొక్క ఉత్పత్తిస్థానము ఇదే. దీని ఉపనది అయిన సట్లెజ్ నది కైలాస పర్వతవరుసలోనే పుట్టుచున్నది. సట్లెజ్ నది సుందరుడు జన్మిం చిన దేశముగుండా ప్రవహించుచున్నది. ఇది ఒకచోట సముద్రమట్టమునకు 8,494 అడుగుల ఎత్తున ప్రవహించుచు అక్కడనుండి క్రిందికి వచ్చును. కొండల చేత చుట్టబడిన ఆ ప్రదేశము బహు శృంగారముగా నుండును. అది లోకములో ప్రకృతిసంబంధమైన వైచిత్ర్యములలో నొకటిగా ఎంచ బడుచున్నది. కైలాసపర్వతముల వరుసలలో నొక శిఖరముమీద పాడు పడిన బౌద్ధుల దేవాలయమొకటి యున్నది. ఆ దేవాలయమునకు కొన్ని మైళ్ల దూరమున సముద్రమట్టమునకు 13000 అడుగుల ఎత్తులో

నున్న ఒక గుహలో కైలాసమహర్షియను నొక గొప్ప ఋషి నివసించు చున్నాడు. హిందూపురాణములలోని దేవర్షులను, దేవతలకును ఉనికిపట్టు నియు, హిందువులు పొగడుచుండు అనేకమంది తపసులును, మహాత్ములును, అనాదినుండి తపస్సుచేసిన చోటనియు ఈ కైలాసమునుగూర్చి చెప్పుదురు. ఇక్కడనున్న ఒక గుహలో, అక్కడ తపస్సుచేయుచు చనిపోయిన ఒక ఋషియొక్క అస్థిపంజరమును సుందరసింగు కనుగొనెను.

ఎన్నటికిని కరగని మంచుగడ్డతో కప్పబడిన ఈ ప్రదేశమందు భూగర్భమునుండి పొంగుచున్న నీళ్లు ఉబుకుచున్న యూటలు కనుపించును. ఆ చుట్టు ప్రదేశము బహు శృంగారముగను, మనస్సును పరవశపరచునట్లుగ నుండును. కైలాసమునకు మూడుదినముల ప్రయాణములో ప్రసిద్ధిగాంచిన మానస సరోవరమును బహు సొగసైన సరస్సున్నది.

ఆ సరస్సుమీద అనేకమైన చక్కని హంసలు ఈదులాడుచుండును, ఆ తటాకముచుట్టునున్న కొండల శిఖరములమీద గరుడపక్షి గూళ్లవలె బౌద్ధుల దేవాలయములును, మఠములును కట్టబడియున్నవి. సుందరసింగు ఈ ప్రదేశము తాను చూచినవాటిలో కెల్ల బహు సొగసైనదైనట్టు వర్ణించెను. కాని ఇక్కడను క్రూరత్వమునందు ఉల్లసించెడు దేశ దిమ్మరులైన జాతులవా రున్నారు. వారు యాత్రికులను చంపుటచేత ఆ సొగసైన స్థలమును భయం కరమైనదిగ మార్చుచున్నారు.

1912-వ సంవత్సరపు ఎండకాలములో సుందరుడు, ఈ పర్వతముల మీద ఋషులను వెదకుచు ప్రయాణముచేయుచుండెను. ఆ ప్రదేశముయొక్క సౌందర్యము ఆయనయొక్క ఆయాసమును కొంత తీర్చినను ఆకలిచేతను, చలిచేతను, సుందరుడు బహు కష్టపడెను. మంచు అధికమైనందున ఒకనాడు కన్నులు మూతబడి తడవుకొనుచు నడచుచుండగ కాలుజారి క్రిందబడెను. స్మారకము తెలిసి లేచి కూర్చుండినపుడు తానెన్నడు మరువలేని అద్భుతమైన దర్శనము కలిగెను. ఆయన క్రింద పడినపుడు ఒక పెద్ద గుహయొక్క ముఖ ద్వారమునొద్దకు దొర్లెను. ఆ గుహలో ధ్యానముచేయుచున్న కైలాస మహర్షిని చూచెను.

మొట్టమొదట ఆయన కన్నులకు అగపడిన వస్తువు వెంట్రుకలతో కప్పబడిన ఒక నూతనమైన మృగమని సుందరుడు తలంచి తన కన్నులు గట్టిగ మూసికొని మూర్ఛిల్లెను. పిమ్మట భయముతగ్గి కొద్దికొద్దిగ పరీక్షించి నపుడు తన ముందరనున్న వస్తువు సజీవుడైన మనుష్యుడైనట్టు కనుగొనెను.

కాని ఆయన అంత ముసలివాడైయుండెను. పొడుగైన వెంట్రుకలతో కప్పబడి మొట్టమొదట మృగమువలె కనుపించెను. అప్పుడు తాను వెదకుచుండిన ఋషులలో నొకడు తాను నిరీక్షించిన రీతిని తనకు కనుపించెనని సంతోషించెను. తాను మాటలాడుటకు నోరు ఆడగానే ఋషితో మాటలాడ మొదలుపెట్టెను. ఋషి తన ధ్యానమునుండి మేల్కొని కన్నులు తెరచి సుందరునివైపు తీక్ష్ణముగచూచి, వెంటనే 'మనము మోకరించి ప్రార్థించుదము'ని చెప్పెను. ఇదేమి ఆశ్చర్యమని తనలో ననుకొనుచు సుందరుడు మోకరించినప్పుడు, ఎంతో చక్కని ప్రార్థన ఆ ఋషి చేయగా వినెను. ఈ ప్రార్థన ఋషి 'ప్రభువైన యేసుక్రీస్తుపేరట ఆలకించుము'ని చెప్పి ముగించెను. పిమ్మట ఋషి గ్రీకుభాషలో వ్రాయబడిన నాలుగు సువార్తలుగల ఒక పెద్దపుస్తకమును తెరచి మత్తయి అయిదవ అధ్యాయములో కొన్ని వచనములు చదివెను. మహర్షి అద్భుతమైన తన జీవిత చరిత్రమును చెప్పగా సుందరుడు వినెను. తన ఆయుష్యము బహు దీర్ఘమైనదని ఋషి చెప్పెను. ఆయనను చూచినను ఆ మాట నిజమేయని తోచును. ఈయన చదివిన పుస్తకపుచుట్ట, ఇండియాకు మొట్టమొదట క్రీస్తుమతము తెచ్చిన ఫ్రాన్సిస్ జేవియర్ అను మిషనెరీ వాడుకొనిన పుస్తకపుచుట్టట. ఆ చుట్టలో పురాతన గ్రీకు అక్షరములతో వ్రాయబడియున్నట్లు సుందరుడు చూచెను. అవి పండితులకు దొరికినయెడల సువార్తలలోని కొన్ని క్రొత్తసంగతులు బయలుపడుటకు వీలుండును. ఈ మహర్షి అలగ్జాండ్రియా పట్టణములో ఒక మహమ్మదీయ కుటుంబములో పుట్టినట్టును మహమ్మదీయమత వైరాగ్యముగలిగినవాడుగా పెరిగినట్టును చెప్పెను. ముప్పది సంవత్సరముల ప్రాయమప్పుడు ఆయన లోకమును విసర్జించి ఒక సన్యాసిగా మఠములో ప్రవేశించెను. కాని ఖురాను చదువుకొని ఎంత ప్రార్థించినను, ఆయన ఆత్మకు తృప్తి కలుగలేదు. అప్పుడు ఇండియా దేశమునుండి క్రీస్తుమతమును బోధించుటకు అలగ్జాండ్రియాకువచ్చిన ఒక మహాత్ముని ఆయన కలిసికొని ఆయన చేసిన ఆత్మీయ ఉపదేశమువల్ల మేలుపొంది నిరాశచేసికొనిన తన ఆత్మలో ఆనందము పొందెను. అప్పుడు ఆయన మఠమును విడిచి, తనకు సువార్తను తెలిపిన గురువు సువార్త బోధించుటకు చేసిన ప్రయాణములలో ఆయనతోకూడ వెళ్లెను. కొంతకాలము ఈలాగు గడిపి తాను స్వేచ్ఛగా దేవుడు పంపుచోటికివెళ్లి సువార్త ప్రకటించుటకు సెలవుపొంది చాలకాలమువరకు సువార్త బోధించుచు అనేక దేశములు తిరిగెను.

మహర్షి చాలకాలము కష్టపడి అలసి, తన ఆయుశ్శేషము అప్పుడు సుందరుడు చూచిన ఏకాంత స్థలమందున్న గుహలో గడుప నిశ్చయించుకొనెను. ఆ గుహలో బహుకాలము వసించుచుండినందున, హిమాలయ పర్వత ప్రాంతములలో దొరికెడు వనమూలికలు మొదలైనవాటిని కనుగొని వాటిని, దీర్ఘమైన తన ఆయుష్కాలములో తనకు ఆహారముగ చేసికొనగలిగెను. సుందరుడు ఆయనను చూచినప్పుడు సుందరుని దేహము చలిచేత చల్లబడిపోయెను. అది చూచి మహర్షి ఒక చెట్టు ఆకులుకోసి ఇచ్చెను. వాటిని తినగానే సుందరుని దేహములో వెట్టపుట్టెను. ఆత్మీయమైన సంగతులను గూర్చి సుందరుడు మహర్షితో దీర్ఘమైన సంభాషణలు చేసెను. మహర్షి నోటను అనేక ఆశ్చర్యమైన సంగతులు సుందరుడు వినెను. సాధు సుందరసింగు తన ప్రసంగములలో సమయోచితముగ చెప్పెడు ఉపమానములు వృద్ధయిన ఆ మహర్షియొద్ద నేర్చుకొనినవే. ఈ మహర్షి పైనచెప్పిన సన్యాసి సమాజములో చేరినవాడు. ఆయన సుందరునికి, వివరించిన దర్శనములన్నియు ఒక పుస్తకముగ చేసినయెడల అది బైబిలులోని ప్రకటన గ్రంధమువలె చదివినవారికి కనిపించును. ఆ దర్శనములు ఎంతో విచిత్రముగను అగ్రాహ్యముగ నుండును. గనుక సుందరుడు వాటికి అక్షరార్థము చేయుట సరికాదని హెచ్చరించుచున్నాడు. ఎందుకనిన మహర్షి తన తలంపుల అలంకారరూపముగ నూతనమైన భాషలో చెప్పవలసివచ్చెను.

సాధు సుందరసింగు ఆ మహర్షిని ముమ్మారు దర్శించియున్నాడు. మరల ఈయన కైలాసమునకును, ఆ బెట్టుకును యాత్ర చేయునప్పుడు, మహర్షిని చూతునని నిరీక్షించెను.

# 5. అధ్యాయము

## సాధు సుందరసింగు, క్రైస్తవ సన్యాసి సమాజము

సుందరసింగు క్రైస్తవసాధువుగ బైలుదేరుట దేవుని అద్భుతమైన క్రియ. ఈయన కాషాయ వస్త్రములు, క్రైస్తవు లీయన బోధను భయభక్తులతో నంగీకరించుటకు కారణముగ నున్నవి. ఈయన సాధువుగ కాకపోయినను, ఈయన యొక్క సహజమైన వాక్చాతుర్యమును, సౌందర్యమును స్వదేశ క్రైస్తవులను ఆకర్షించియుండును. కాని ఇప్పుడాయన చూపులకును, లక్షణములందుకూడ నిజమైన సాధువైనందున ఆయనబోధలో వారి మనస్సును వశపరచు శక్తి ఎంతో అధికముగ కనుపించుచున్నది.

ఈయనయొక్క వినయమును నిష్కాపట్యమును ఈయనను చూచువారి మనస్సును వశపరచుచున్నది. ఈ సుగుణములు ఈయన సొగసైన ముఖమునందు ప్రకాశించుచుండుట చూడవలెనని వేలాది క్రైస్తవులు గుంపులుగా కూడి వచ్చినప్పుడు, తానొక వింతైన పురుషుడుగ వారికి కనుపించుచున్నానని సుందరుడు ఆశ్చర్యపడుచుండెను.

సుందరుని సాధువు వేషమువలన అన్యులమధ్య ఈయన చేసిన పనిలో ఎక్కువ ఫలితము కలిగినట్లు స్పష్టముగ తెలియుచున్నది. వారిమధ్య పరిచర్యచేయుటే తన ముఖ్యమైన పనియని ఈయన ఎంచుచున్నాడు. ఈయన సాధువైనందున సన్యాసుల మఠములకు నిరభ్యంతరముగ పోగలడు. పలు విధములైన మనుష్యులతో సహవాసము చేయగలడు. అందుచేత ఈ దేశములో క్రీస్తుమతమును స్థాపింపవలెనని పూనుకొనిన భక్త్యావేశములుగల కొందరు సన్యాసులు అద్భుతమైన ఒక క్రొత్త సమాజముగ నేర్పడినట్లు సుందరుడు కనుగొని దానిని లోకమునకు వెల్లడిపరచెను.

1918 సంవత్సరమున పరలోకగతుడైన చర్చి మిషనెరీ సొసైటీతో చేరిన రెవరెండు జే. జే. జాన్సను అను మిషనెరీ ఈ దేశములో సంస్కృత పాండిత్యమునకు ప్రసిద్ధిగాంచినవాడు. ఈయన చివరి సంవత్సరములలో ఈ దేశమందలి పండితులకును విద్యాపరులకును సువార్త భోధించుటకు నియమింపబడెను. ఈయన అద్భుతమైన జీవిత చరిత్ర ఇకమీదట

వ్రాయబడవలసియున్నది. ఈయన చివరిసారి దక్షిణ ఇండియాకు వచ్చి నప్పుడు అగ్రజాతులలో విద్యాపరులైన యనేకమంది హిందువులు క్రీస్తు ప్రభువు శిష్యులు కావలెనని కనిపెట్టుచున్నారని చెప్పెను. ఇది ఈయన అనేక సంవత్సరములు ముఖ్యులైన హిందువులతో సహవాసము చేసి వారి అభిప్రాయములు బాగుగ తెలిసికొనిన తరువాత చెప్పినమాట.

ఈ మిషనెరీ చెప్పిన ఈ ఆశ్చర్యకరమైన మాటయొక్క సత్యమును సాధు సుందరసింగు బైలుపరచగలిగెను. 1912-వ సంవత్సరాంతమందు బుద్ధుడు తన మతమును మొదట బోధించిన స్థానమైన సార్నాత్ అను చోటికి సుందరుడు వెళ్లి, అక్కడ కొందరు సన్యాసులను చూచెను. వారితో సంభా షింపగా, వారు క్రైస్తవులైనట్లు సుందరుడు గ్రహించెను. వారు ఇరువది నాలుగు వేలమంది గలిగిన ఒక రహస్యమైన సమాజములో చేరినవారు. ఈ సమాజములోనివారు ఈ దేశమందంతటను చెదిరియున్నారు. వీరు శిష్యులని, స్వాములని రెండు తరగతులుగ నున్నారు. శిష్యులనగ సహవాసులనిపించు కొనువారు, లౌకికవృత్తులు చేసికొను సాధారణ సభ్యులు. స్వాములు లేక దూత లనిపించుకొనువారు, సన్యాసివేషము ధరించుకొని జీతము లేకుండ మత బోధ చేయుచు, శిష్యులు కూడుకొనుచోట దైవారాధన జరుపుచు తమ కాలము గడుపుదురు. వీరు ఏడువందలమంది ఉన్నారు.

ఈ సమాజములో చేరినవారు బాప్తిస్మము, ప్రభువు భోజన సంస్కారము లాచరించుదురు. రహస్యముగానుండు ఈ విశ్వాసులు ఈ దేశమందంతటను, మనము తలచని స్థలములయందు కనుపించుదురు. సుందరుడు ఒకసారి నేపాళములో చెరసాలలో వేయబడి హింసింపబడినప్పుడు వీరిలో కొందరు ఆయనకు దయతో ఉపచారముచేసి కాపాడిరి. వీరు వేసవనే హిందూ దేవాలయములవలె కట్టియున్న కట్టడములలో కూడుకొని దైవారాధన సలుపు దురు. ఈ ప్రార్థనాలయములలో విగ్రహము లేమియు నుండవు.

బైబిలు గ్రంథము చదివి వ్యాఖ్యానము చెప్పుదురు; క్రైస్తవమత విషయ ములను తెలుపు పత్రికలు పంచిపెట్టుదురు. హిందూదేశాచారములు అను సరించుదురు; దేవుని ఎదుట సాష్టాంగ నమస్కారము చేయుట ఈ యాచా రములలో నొకటి. దృఢమైన విశ్వాసముతో ప్రార్థించినవారికి తమ పరమ యజమానుని దర్శనము తఱుచుగ కలుగునని వారు గట్టిగ నమ్ముచున్నారు.

ఈ రహస్య క్రైస్తవ సమాజములో చేరినవారిలో తమ పరిశుద్ధతకు పేరు పొందిన సాధువులును తపసులును అనేకమంది యున్నారు. శిష్యులలో అనేకమంది విద్యావంతులును అగ్రజాతులలో చేరిన ధనవంతులు నున్నారు. వీరు ఈ సంఘమునకు ధారాళముగ విరాళముల నిత్తురు. సాధు సుందరసింగు వీరి దైవారాధనలకు తఱచుగ వెళ్లియుండెను. అనేక పర్యాయములు ఈయనయు ఆ సంఘములో చేరినవాడని ఎంచబడెను. మీరు క్రీస్తును బహిరంగముగ ఒప్పుకొనుడని సుందరుడు వారిని బ్రతిమాలగా తగిన సమయము వచ్చినప్పుడట్లు చేయుదుమని మాట ఇచ్చిరి.

గంగానదీ తీరమందు సుందరు డొకప్పుడు బోధించుచుండగ కొందరు మనుష్యులు ఈయనను చూచి 'నీవు సన్యాసిగా నుండుట మాకు సంతోషమే కాని, నీ విపరీతమైన బోధ మాకు సరిపోలేదు. ఈ సమీపములో ఒక హిందూసన్యాసి ఉన్నాడు. ఆయన చెప్పెడు మధురమైన వాక్యములు వినుటకు ప్రజలు గుంపులు గుంపులుగ కూడుచున్నారు. నీవు వచ్చి ఆయనను చూడుము'ని చెప్పిరి. ఆయనచుట్టు కూడుకొనిన జనులను దాటి ఆ సన్యాసియొద్దకు వెళ్లవలెనని మూడుదినములు సుందరుడు ప్రయాసపడినను సాధ్యపడలేదు. చివర కొకనాడు ఈబోధకుని సుందరుడు ఒంటరిగ కలిసికొనెను. ఆయన సుందరుని మెడను కౌగలించుకొని; 'సహోదరుడా, మన మిద్దరమును ఒకటే పనిని చేయుచున్నాము'ని చెప్పెను. ఆయన ఈ ప్రకారము చేయునని కించిత్తయినను నిరీక్షించని సుందరుడు భ్రమచెంది, 'నీవు క్రీస్తు నామమును ప్రకటించుటలేదే' అని యనెను. అందుకతడు; భూమిని పక్వపరచకముందు విత్తనము విత్తునట్టి బుద్ధిహీనుడైన వ్యవసాయకుడున్నాడా? నా మాటలు వినుటకు వచ్చెడువారి మనస్సులో మంచి చెడ్డల వ్యత్యాసము గ్రహించెడు తెలివి రాకముందు నేను క్రీస్తునుగూర్చి ఏమియు చెప్పుటలేదు. వారు నా ఉపదేశమును గ్రహించి నీతినిగూర్చి ఆకలిదప్పులు గలవారైనప్పుడు నీతి సూర్యుడైన యేసునాధుని రక్షణమార్గమును వారికి చూపెదను. హిందువులచేత పూజింపబడు ఈ గంగానదీతీరమందు విద్యావంతులైన పండ్రెండుగురు హిందువులకు గతసంవత్సరములో బాప్తిస్మ మిచ్చితిన'ని చెప్పెను. అప్పుడతడు ఎప్పుడు తనయొద్ద నుంచుకొను బైబిలు గ్రంథమును సుందరునికి చూపెను.

ఈ దేశములో పుణ్యక్షేత్రము లనిపించుకొను ఒక చోటనుండు రహస్య క్రైస్తవ సమాజములో చేరినవారు సుందరుని ఒక పురాతనమైన

దేవాలయమునకు తీసికొనిపోయి, అక్కడనున్న సంస్కృత లిఖితమైన పురాతన గ్రంథమొకటి కనుపరచిరి. విశ్వామిత్రుడను నొక పండితుడు శిశువుగా పుట్టిన యేసుప్రభువును చూచుటకు వెళ్లిన తూర్పుదేశపు ముగ్గురు జ్ఞానులలో ఒకడనియు, ఆయన దేవుని కుమారుని చూచి, తిరిగి హిందూదేశమునకు వచ్చెననియు, క్రీస్తు తన పరిచర్యను ఆరంభించిన తరువాత తిరిగి పాలస్తీనాకు యాత్ర చేసెననియు ఆ పురాతన గ్రంథమందుండెను. తమతో నుండకుండ ఒకడు క్రీస్తు నామమున అద్భుతములు చేయుచుండుట శిష్యులు చూచి అతనిని అడ్డగించిరని నూతన నిబంధనలో చెప్పబడిన మనుష్యుడు ఈ విశ్వామిత్రుడేయని ఆ సమాజములో చేరినవారు చెప్పుదురు. ఈ వ్రాత ప్రతిలో ఈ సన్యాసి సమాజముయొక్క చరిత్ర ప్రస్తుతపు సంస్కృత భాషలో వ్రాయబడియున్నది. సన్యాసుల సమాజము కేరీ ఇండియాకు రాక మునుపు శ్రీనాథుల నుండెను. కేరీయొక్క ప్రసంగములు వినిన ఒక క్రైస్తవ సన్యాసి నూతన వైరాగ్యముతో నిండినవాడై పనిచేసి అనేకులను తన సంఘములో చేర్చుకొనెను. ఉత్తర హిందూస్థానములోనుండు ఒక పెద్ద పట్టణములో చతుర్వేదములు చదివి ప్రసిద్ధిచెందిన ఒక హిందూప్రసంగి ఉండెను. సుందరుడు ఆయనను జూచబోయినపుడు ఆయన హిందూవేదములనుగూర్చి ఉపన్యసించుచుండెను. ప్రసంగాంతమందు, 'పాపమునుండి మనము రక్షింపబడుట అత్యావసరమని నాలుగు వేదములును స్పష్టముగ తెలుపుచున్నవి. అది నిజమైనయెడల పాపమునుండి నివర్తి చేయగల రక్షకుడెవరు? వేదములు చెప్పెడు రక్షకుడైన ప్రజాపతి క్రీస్తే. ఈయనే పాపాత్ములమైన మనలను రక్షించుటకు తన ప్రాణత్యాగము చేసినవాడని చెప్పెను. ఈ క్రొత్త సిద్ధాంతమును వినిన హిందువులు ఈయనతో తర్కించినప్పుడు 'మీరుకారు, నేనే వేదములలో ఉన్నట్టు అంగీకరించుచున్నాను. ఏమనిన, నేనే చతుర్వేదములలో దేవుడు బయలుపరచిన రక్షకుని పాదములను పట్టినవాడను. క్రీస్తే ఆ రక్షకుడు' అని ఏమియు సందేహించక వారడిగిన ప్రశ్నలకు సమాధానము చెప్పెను.

ఈ ప్రసంగి సువార్త బోధించుటలో అనుసరించిన పద్ధతినిగూర్చి మాటలాడునప్పుడు ప్రస్తుతకాలమునందు క్రీస్తు సభయొక్క గొప్ప అక్కరను గూర్చి సుందరుడు ఇట్లు చెప్పెను. క్రైస్తవసభలో ఆయా తెగలవారు చెప్పెడు పారంపర్య సిద్ధాంతములను త్రోసివేసి దేవుడు తన యాత్మ ప్రేరేపణవల్ల బయలుపరచిన సంగతులు ఏ మతములో కనుపించినను వాటిని

మనస్పూర్తిగ అంగీకరించుటకు క్రైస్తవులు నేర్చుకొనవలెను. సన్యాసి సమాజముయొక్క సేవను దేవుడు వర్ధిల్లునట్లు ఆశీర్వదించుచున్నాడనియు, వీరి పద్ధతి సాధారణముగా క్రైస్తవులు అనుసరించుపద్ధతికి భిన్నముగానున్నను, ఈ సమాజముయొక్క ముఖ్యులవలన ఈ దేశమునకు గొప్ప మేలుకలుగుననియు సుందరుడు మనస్పూర్తిగ నమ్ముచున్నాడు.

యిూషూ నాస్రీనాత్ కిజాయ్:—నజోరీయుడైన యేసునాథునికి జయమ్, అను జయధ్వని ఈ అంతరంగ క్రైస్తవసహోదరులు ఒకరినొకరు గుర్తించుటకు వాడుకొను పదములు.

# 6. అధ్యాయము

## సాధు సుందరసింగు దక్షిణ ఇండియాకు వచ్చుట

నేనాయనయొద్ద వినిన సంగతులే. లోకమునకు బోధించుచున్నాను ....తండ్రి నాకు నేర్పినట్టు ఈ సంగతులు మాటలాడుచున్నాను (యోహాను 8. 26, 28)

నీవు బ్రదికి బాగుగానుండునట్లు నేను నీతో చెప్పుచున్న సంగతినిగూర్చి యెహోవా సెలవిచ్చు మాటను చిత్తగించి ఆలకించుము (యిర్మీయా 38: 20).

సాధు సుందరసింగు 1918 సంవత్సరారంభమందు చెన్నపురికి వచ్చినప్పుడు దక్షిణ ఇండియాలో ఒక దీర్ఘమైన యాత్ర చేయవలెనని ఆయన అనుకొనలేదు. అయినను ఆయనయొక్క కీర్తి ప్రఖ్యాతులు వ్యాపించిన అనేక ప్రదేశములనుండి క్రైస్తవులు ఆయనను రమ్మని బ్రతిమాలిరి. చెన్నపట్టణములో నొకరు ఈయన ప్రసంగములను భాషాంతరము చేయుటకు సమ్మతించినందున తిరువాన్కూరు, సింహళమునకుకూడ పోవుటకు ఆయన సాహసించెను. ప్రతిదినము అన్నివైపులనుండి ఆయనను తమయొద్దకు రమ్మని వేడుచు వ్రాసిన యుత్తరములు వచ్చెను. అందువలన దక్షిణ యిండియాలోనే కాక చీనా జపానువరకు ఆయన యాత్రచేయుట తటస్థించెను. దక్షిణ ఇండియాలోనున్న సంఘములలోని తెగలను ఎంచక సుందరుని మధురమైన వాక్కులు వినుటకు క్రైస్తవులు గుంపులుగుంపులుగ కూడిరి. దక్షిణఇండియాలో ఆయన గడిపిన కాలమందు, ఉదయమునుండి సాయంకాలమువరకు, భోజనముచేయుటకుగాని తన నూతననిబంధన చదువుకొని ధ్యానించుకొనుటకుగాని ఆయనకు కాలము దొరకలేదు. ఆయన ఎక్కువ దినములు గడిపిన స్థలములలో ఆయన వెళ్లిన తరువాత, ఒక మనుష్యుడు మంచి భోజనము చేసిన పిమ్మట విశ్రమించినట్టు, ప్రజలు విశ్రమించిరి. కాని ఏ స్థలమందును, సుందరునికి విశ్రాంతి కావలెనని ప్రజలు తలంచినట్టు కనుపించదు.

ఈ విధముగ విశ్రాంతిలేనంత పాటుపడి రాత్రిళ్లు బండిలోనైనను పడవలోనైనను, పొగబండిలోనైనను ప్రయాణము చేయవలసివచ్చెను. సుందరుడు ఒక ఊరుచేరినతోడనే ఆరంభించినపని ఆయన ఆ యూరు విడిచిపోవువరకు ముగియుటలేదు. ఉదయమున, సాయంత్రమున పెద్దకూట

ములలో ప్రసంగించెను. ఆ మధ్య ఆయనను దర్శింపవచ్చిన వారందరికి సుబోధచేసెను.

ఒంటరిగా ఆయనయొద్దకు వచ్చి తమ సందేహములను, మనోవేదనలను చెప్పుకొని ఆలోచన అడుగవలెనని కోరెడువారు పలువురుండిరి. క్రీస్తు మత విచారణచేయు హిందువులు అనేకమందియుండిరి. కొన్ని సమయము లందు ఆయనతో సంభాషించుచుండువారు ఒక చిన్నకూటముగ ఆయన చుట్టునుండిరి. ఒంటరిగ సుందరుని చూడగోరువారి సంఖ్య దినదినము అధిక మయ్యెను. ఈ కూటములవలన అనేకుల మనస్సులలో సమాధానమును, సంతోషమును కలిగినవనుటకు సందేహములేదు.

ఒకచోట సుందరుని ఒంటరిగ మాటాడవలెనని కోరెడువారి సంఖ్య ఎక్కువగనున్నందున, ఆయన బసచేసిన గదియొక్క తలుపుదగ్గర ఒక విద్యార్థి నిలువబడి, సుందరుని భోజనసమయమందును, ప్రార్థన ధ్యానసమయము లందును తలుపు తాళమువేసి ఉంచెను. ఈ స్థలమందు మాత్రమే సుందరుని కొంచెము విశ్రాంతి కలిగెను. కళాశాలలున్న పెద్దపట్టణములలో ఉదయము, సాయంత్రముల ప్రసంగములమధ్య విద్యార్థులకు ఒక ఉపన్యాసము సుందరుడు చేయుచుండెను. విందులకు పిలువబడిన ఇండ్లకుపోయినప్పుడు అనేకులు సుందరుని చూడవలెనని కోరి అక్కడకూడిన వారితో ఆయన దినమంతయు పాటుపడిన పిమ్మట సంభాషింపవలసివచ్చెను. ఇంగ్లీషుభాష ఎరిగినవారితో ఆయన ముఖాముఖిగా సంభాషించెను. ఇతరులతో మాట్లాడునప్పుడు ద్విభాషియొక్క సహాయము కావలసియుండెను. ఆత్మీయమైన ఉపదేశముతో కూడిన ఆయన మాటలు వెనువెంటనే ఇతర భాషలలో చెప్పుట సులభముకాదు. తనయొద్దకు వచ్చువారి ఆత్మలకు కావలసిన ఆత్మీయాహారము ఈయవలెనని కోరెడు సుందరునికి, ద్విభాషద్వారా మాట్లాడుట తృప్తికరముగ నుండెదు. అయినను ఆయన విలువగలమాటలు ఎట్లయినను విని తృప్తిపొందవలెనని వచ్చెడివారి యాశయు అధికముగనుండెను.

ఎవరును తన దృష్టాంతమును వెంబడింపవలెనని సుందరుడు కోరుటలేదు. సాధువు కావలెనని కోరువారు, ఆయనపిలుపు వినుటవలన కాక, దేవునివలన స్పష్టమైనపిలుపు తమకు కలిగినదని గ్రహించినవారే సన్యాసి వ్రతము పూనుకొనవలెనని సుందరుడు చెప్పుచున్నాడు. ఆయన చెప్పెడు బోధ న్యాయమైనదని, వినువారి అవసరమునకు తగినదని అయ్యాన్నవి. స్త్రీలకు ఉపదేశించునప్పుడు తనతల్లి ఎట్లు పసితనమందే తనకు ఆత్మీయ

జ్ఞానమును, భక్తిని నేర్పినదో, ఆ విధమున ప్రతి తల్లియు తమ పిల్లలకు ఉగ్గుపాలతో ఆత్మీయపు సంగతులను నేర్పవలెనని ఆయన చెప్పుచుండును. అన్యులైన నా తల్లి నాకు ఇంత చేసియుండగా క్రైస్తవులైన మీరు మీ బిడ్డలకు ఎంత శ్రేష్ఠమైనబోధను చేయవలెను అని సుందరుడు తరుచుగ చెప్పుచుండును. తాను నూతన నిబంధనను ఎంతో ప్రేమించువాడైనను, "నేను బుద్ధిహీనుడనై చించి కాల్చివేసిన నూతన నిబంధనయొక్క విలువను పరిపూర్ణముగ ఎరుగను. మీరైతే చిన్నప్పటినుండి ఆ పుస్తకమును ఘనపరచి ప్రేమింప నేర్చుకొనిన మీకు ఇది ఎంత విలువగల గ్రంథమైయుండును!" అని క్రైస్తవులనుచూచి చెప్పుచుండును. ఈ మాటలు వినినప్పుడు బైబిలు గ్రంథమును ఆసక్తితో చదువకుండ అశ్రద్ధచేయు అనేకమంది క్రైస్తవులు ఎంత సిగ్గుపడవలసియున్నదో సుందరు డెరుగకుండునా!

ఊరుమాటు మణిగిన పిమ్మట, రాత్రిలో నిశ్శబ్దముగ నున్నప్పుడు, సుందరును హిందువులు వెదుకుచువచ్చుట అపూర్వమైన సంగతిగాదు. మనుష్యులు నిద్రించి విశ్రాంతిపొందెడు ఈ సమయమందుకూడ సుందరుడు ఉత్సాహముగ క్రీస్తుకొరకు తనను వ్యయపరచుకొనుచు వచ్చినవారికి తన నమ్మికనుగూర్చి సాక్ష్యమిచ్చుచుండును. ఆయన దర్శించివచ్చిన స్థలములలోని క్రైస్తవులయొద్దనుండి అనేక ఉత్తరములు వచ్చుచుండును. వాటికి ప్రత్యుత్తరములు వ్రాసిపంపుట కొద్దిపని కాదు. వందలకొలది క్రైస్తవులు తమకొరకు విజ్ఞాపన చేయుమని అడుగుచుందురు.

వేలాది క్రైస్తవులకు సాధు సుందరసింగును చూచినప్పుడు, తన రక్షకునికి తన శరీరమును, ఆత్మను సంపూర్ణముగ సమర్పించుకొనిన ఒక మనుష్యునిచేత దేవుడు ఎంతో గొప్ప కార్యములు చేయించగలడని బయలుపడినది. ఆయన వెళ్లినచోటులనెల్ల ఆయన వర్తమానము ఎంతో సంతోషముతో నంగీకరించిరి. ఆయన ముఖవికాసమును చూచినవారికి తనివితీరకుండెను. ఆయన ఇంకను కొన్నిదినములు తమతో నుండలేదను వ్యసనము అందరి మనస్సులలో నుండెను. ఆయన స్వల్పకాలములో అక్కడక్కడ చేసిన పనియొక్క ఫలితము దేవునికి మాత్రమే తెలియును. సాధు సుందరసింగు దక్షిణ ఇండియాలోని క్రైస్తవులను తగిన సమయమందు దర్శించునట్లు దేవుడే ఆయనను పంపెనని అందరు ఒప్పుకొందురు. దైవభక్తిగల జీవితమే ఉత్తమమైనదనియు, దేవునికి తనను సంపూర్ణముగ సమర్పించుకొనుటే లాభకరమైన జీవితమనియు సుందరుడు దృష్టాంతపరచి యున్నాడు.

## క్రైస్తవ మహాసభలలో సాధు సుందరసింగుయొక్క పరిచర్య

**గొప్పపిలుపు.** "యౌవనులారా మేల్కొనుడి, మీ చుట్టును ప్రతి దినము నశించుచున్న వేలకొలది యాత్మలను చూడుడి. వారిని రక్షించుట మీ భారముకాదా? క్రీస్తుకొరకు పోరాడు శూరులైయుండుడి; యుద్ధ కవచము ధరించి ముందుకు సాగిపోవుడి; సైతాను పనిని నాశనముచేయుడి; మీకు జయము కలుగును.

దేవునికి మహిమ మీరు పరిపూర్ణముగ రక్షింపబడి, యితరులను రక్షించుటకు మీకెంతో మంచి సమయమును ఆయన అనుగ్రహించి యున్నాడు. మీరు దీన్ని అశ్రద్ధచేసినయెడల ఇట్టి తరుణము మీకిక యెన్నడు దొరకదు. మీరు చేయవలసిన కార్యము ఇప్పుడే చేయుడి. ఈ యుద్ధభూమిగుండ మీరు మరియొకసారి పోరు. క్రీస్తునాధునికొరకు ఆత్మ లను సంపాదించుటలో తమ ఆరోగ్యమును, ఆస్తిని, ప్రాణమును కోల్పో యిన హతసాక్షులను మహిమానందములో నుండుట చూచెడు దినము మీకు సమీపించుచున్నది. వారు అంతగా చేసిరి. మీరేమి చేయుచున్నారు? ఓహో! ఆ నాడు మనము సిగ్గుపడకుండునట్లు ఇప్పుడే మన చేతనైనది చేయుదము"—సుందరసింగు.

ఇట్లు శంఖునాధము చేయుచు దక్షిణ యిండియాలో ప్రతిచోటను ప్రతి క్రైస్తవుని ప్రేరేపించుచు సుందరుడు తిరిగెను; కాని తిరు వాన్కూరు, సింహళములలోకూడిన క్రైస్తవ మహాసభలలో ఎంతో ఉత్సా హముతోను, వైరాగ్యముతోను ఆయన యీ పిలుపును వక్కాణించెను. దక్షిణ యిండియాలో క్రైస్తవులు ఎక్కువమంది ఉండెడు స్థలములలో ప్రతిసంవత్సరము మహామండలి సభలుకూడుట వాడుక. జనులకు ఆత్మోజ్జీ వము కలుగుటకు సహాయకరముగ జరుపబడెడు ఈ సభలకు క్రైస్తవులు తీర్థప్రజలవలె గొప్ప సమూహములుగ వత్తురు. ఇంగ్లాండులో కెజ్విక్ మహా సభవలె ఈ సభయును ఏడు దినములవరకు జరుగును. ఆ దినములలో ప్రసంగించుటకు నియమింపబడినవారు ఎంతో ఆత్మీయమైన ప్రేరేపణ కలిగించు ప్రసంగములు చేయుదురు. 1918-వ సంll జరిగిన మహాసభలలో సాధు సుందరసింగు ఉండుటవలన వచ్చినవారికి గొప్ప మేలు కలిగినది, వీటిలో గొప్పది తిరువాన్కూరులో కూడిన సభ.

మలబారులోనున్న సిరియన్ క్రైస్తవసభ ప్రభువైన యేసుక్రీస్తు అపొస్తలుడైన పరిశుద్ధ తోమావలన స్థాపింపబడెనని కొందరు ఎంచుదురు. తోమా క్రీస్తు పరలోకమునకు ఆరోహించినతరువాత కొన్ని సంవత్సరములకే ఇండియాకు సువార్త తెచ్చెనని చెప్పవలసియుండును. గనుక ఇండియాలో అనాది సభయనెడు ఔన్నత్యము ఈ సభకే చెందును. ఈ సభలో రోమాను, జాకోబైట్, మార్తోమా సిరియనులు అని మూడు తెగలవారున్నారు.

1918-వ సం॥ ఫిబ్రవరి మాసములో ఉత్తర తిరువాన్కూరులో కూడిన 20,000 మంది జాకోబైట్ సిరియనులుకూడిన సభకు సుందరుడు వెళ్లియుండెను. అది అయిన తరువాత ఆ స్థలమందేకూడిన మార్తోమ సిరియను మహాసభకు సుందరుడు వెళ్లి, ఆయన ఎన్నడును మరవలేని గొప్ప సంగతి చూచెను. తిరువనంతపురమునకు నూరు మైళ్లు ఉత్తరముగా తిరువాన్కూరులోనున్న నదులన్నిటిలో మిక్కిలి పెద్దదని, సొగసైనదియైన ఒక నది పారుచున్నది. ఎండకాలమందు ఈ నదియొక్క లోతైన భాగమందు మాత్రమే నీళ్లు పారుచుండును. అప్పుడు ఒక ప్రక్కను ఎత్తయిన ఇసుకలంక ఏర్పడును. ఆ లంకమీద 25,000 మంది కూర్చుండుటకు తగిన పెద్దపందిరి ఆ సభకు వచ్చెడు వారికొరకు కట్టుదురు.

కూటములు జరిగెడు వారములో ప్రతిదినము ప్రాతఃకాలమున పెద్ద కంఠస్వరముగల ఒక మనుష్యుడు, 'దేవునికి స్తోత్రము,' 'దేవుని కుమారునికి స్తోత్రము' అని కేకవేయుచు, అక్కడ బసచేయుచుండిన ప్రజలమధ్య తిరుగును. ఈ శబ్దము వినగానే జనులు మేల్కొని, తమ ఉదయపు దైవారాధనచేయుదురు. ఈ విధముగ చుట్టు బసచేయుచున్నవారు, సిరియను రాగములతో పాడెడు ప్రార్థనల సునాదము సముద్రతరంగముల ధ్వనివలె బయలుదేరును. ఈ విధముగ దేవుని ఆశీర్వచనము వెతికి, ఆ దినపు కూటములు ఆరంభించుదురు. సుందరసింగు ఈ కూటములోనుండినందున ఆయన మాటలు వినుటకు మరి రెండుమూడువేలమంది వచ్చియుండిరి. చివరిదినమందు 32,000 మంది స్త్రీ పురుషులు ఆయన చివరి వర్తమానమును వినుటకు కూడుకొనిరి.

ఈ కూటములు, చూచుటకు ఎంతో వింతగానుండును. పదునెనిమిది అంగుళముల ఎత్తుగల పీఠమొకటి పందిరిమధ్యనున్నది. [illegible] ఉదారంగు అంగీలు ధరించుకొని, బంగారు దట్టీలు నడుముకు కట్టుకొని, విచిత్రమైన తలపాగాలతో, మార్తోమా సిరియను సభాధ్యక్షులు పెద్దసంఘ పీఠము

మీదనున్న రెండు కుర్చీలమీద కూర్చుండిరి. వారి క్రిందనున్న, పీఠముమీద ఆ సభతో చేరిన గురువులు కూర్చుండిరి. వారిమధ్యను సాధు సుందరసింగు కూర్చుండెను.

తెల్లబట్టలు వేసికొనిన స్త్రీలు ఎడమప్రక్కను, పురుషులు ముందరి ప్రక్కను కుడిప్రక్కను, ఇసుకమీద కూర్చుండిరి. ఈ గొప్ప జనసమూహమునకు అవతల సూర్యకాంతి ప్రకాశించుచున్న నదియు, నదిమీద పోవుచున్న విచిత్రమైన పడవలును కనిపించెను. వీరికంటె ఎక్కువ భయభక్తులతో కూడుకొనిన కూటమును ఎక్కడను మనము చూడలేము. ప్రతిదినము ఆరాధన ఆరంభమందు ఒక గంటసేపు ప్రార్థనయందు గడుపబడెను. పై పీఠము మీదనున్న అధ్యక్షులలో నొకరు, ప్రార్థనాంశమును తెలుపుచుండెను. అంతట ప్రతి స్త్రీ పురుషుడును మౌనముగ ప్రార్థించుటకు తలవంచినప్పుడు క్రమక్రమముగ ప్రార్థనశబ్దము ఎక్కువయి, సముద్రపు ఘోషవలె నుండెను. ఈ శబ్దము వినువారి మనస్సులలో ఎప్పటికిని నాటుకొనెను.

సుందరుడు మాట్లాడుటకు లేచినప్పుడు, ఆ పెద్దకూటములో ఆకు కదిలిన శబ్దము సహా వినబడునంత నిశ్శబ్దముగ నుండెను. దక్షిణ ఇండియాలో క్రైస్తవ సంఘముయొక్క అభివృద్ధిని గూర్చి, సుందరుడు ఉత్తర హిందుస్థానములో వినెను. ఇక్కడ ఈ పెద్దకూటమును కన్నులార చూచినప్పుడు క్రైస్తవుల సంఖ్య ఎంత గొప్పదో గ్రహించెను. అప్పుడు ఆయన మనస్సులోనికి ఇంత గొప్ప సమూహము సువార్త నంగీకరించినయెడల ఈ దేశములో క్రీస్తు మతము ఎందుచేత శీఘ్రముగ వ్యాపించుటలేదు! అను ప్రశ్న వచ్చెను.

దేవుడు మిమ్మునేగదా ఈ దేశములో సువార్త బోధించుటకు నియమించియున్నాడు. ఈ దేశములోని నానా జాతులవారికి క్రీస్తుమత సత్యములను తెలుపుట మీ మీదనున్న భారమైయున్నది. కాని మీరు అనేక శతాబ్దములనుండి మీ ఉత్తరవాదమును గ్రహించకుండను, మీ కర్తవ్యమును చేయకుండను విడిచిపెట్టినందున, దేవుడు అమెరికానుండి, ఇంగ్లాండునుండి క్రీస్తుమతబోధకులను ఇక్కడికి పంపియున్నాడు. ఇప్పుడు మీలో సువార్త వ్యాపింపచేయవలెనను మంచి ఉద్దేశము కనిపించుచున్నది. మీరు ఇంత వరకు చేయకుండ విడిచిపెట్టిన మీ కర్తవ్యమును గ్రహించి, అజ్ఞానాంధకారమందున్న వేలాది మీ దేశ జనులను సువార్త వెలుగులోనికి నడిపించుటకు ప్రయత్నించుదురు గాక, అని సిరియను క్రైస్తవులతో సుందరుడు

ఎంతో ఆసక్తితో చెప్పెను. ఈ విధమున సుందరుడు వీరితో వాదించి నపుడు, వీరి తప్పులను ఎత్తి చూపుటకు వెనుకతీయలేదు.

(సువార్తను అందరికిని బోధించుట క్రైస్తవులందరిమీదనున్న భారమని సిరియను క్రైస్తవులు కొన్ని సంవత్సరములక్రిందట గ్రహించి, బోధకులను కొన్ని చోట్లకు పంప మొదలుపెట్టిరి. అట్లు పంపబడినవారి సంఖ్య ఇప్పుడు ఏటేట వృద్ధిపొందుచున్నది).

ఈ మాటలనే ఇతర స్థలములయందు జరిగిన కూటములలో కూడ సుందరుడు చెప్పి క్రీస్తుమతమును ఈ దేశములో వ్యాపింప చేయవలసిన భారము స్వదేశ క్రైస్తవులమీదనున్న సత్యమును, అనేకమంది గ్రహించునట్లు చేసెను. హిందూదేశములో కోట్లకొలది జనులను సువార్త వెలుగులోనికి నడిపించు భాగ్యము ఈ దేశములోని క్రైస్తవులకు దయచేయవలెనని దేవుడు తన దివ్యసంకల్పమందు నియమించినట్టు సుందరుడు స్పష్టముగ గ్రహించుచున్నాడు. ఈ మాటలవలన మాత్రమేకాకుండ, తన క్రియల మూలమునకూడ సాధు సుందరసింగు ఈ దేశస్థులు తమ సిలువ నెత్తుకొని, ఎన్ని శ్రమలున్నను, తుదకు జయమునొందుటకు, క్రీస్తుప్రభువును వెంబడింపవలెనని తన దృష్టాంతము ద్వారా కనపరచుచు, హెచ్చరించుచున్నాడు.

## సింహళము

నీవు కన్నవాటిని గూర్చియు విన్నవాటిని గూర్చియు ఆయనకు సాక్షివై యుందువు అపొ. కార్య. 22: 15.

సాధు సుందరసింగు 1918 సంవత్సరము మే మాసములో ఎంతో ప్రయాసముతో దక్షిణ ఇండియాలో తిరిగి ప్రసంగించి, మరల ఉత్తరమున టిబెట్టుకు వెళ్లకముందు సింహళద్వీపములో ఆరు వారములు గడుపవలెనని కొలంబుకు వెళ్లెను. ఆ కాలమందు ఆయన అక్కడ జరిగించిన కార్యములను గూర్చి వ్రాసినయెడల గ్రంథబాహుళ్యమగును. గనుక ఆయన పనినిచూచిన వారు వ్రాసిన కొన్ని సంగతులు మాత్రము ప్రచురించుచున్నాము. దక్షిణ ఇండియాలో ఆయనయెడల చూపిన ఆవేశము, గౌరవమువలెనే సింహళములో ఆయన వెళ్లిన ప్రతిచోటను అత్యధికముగ చూపబడినవి.

కే. ఆర్. విల్సన్ అను ఆయన కొలంబు పట్టణమందలి అన్ని తెగలలోని మిషనెరీలను, స్వదేశ క్రైస్తవులను ఒక కూటముగా నేర్పరచి, సుంద

రుని రాకకు తగిన ఆయత్తముచేసెను. వారందరు ఏకీభవించి చేసిన ఏర్పాటు లనుబట్టి సుందరుని పని సఫలముగ జరుగుటకు ఎంతో సహాయము కలిగెను. సాధ్యమయినన్ని స్థలములలోని క్రైస్తవులను ఆయన చూచుటకు ఏర్పాటులు చేయబడెను. కొళంబు, కాండీ, జాఫ్నాలలోని వార్తాపత్రికలలో ఆయన చేసిన పనినిగూర్చి ప్రచురింపబడెను. సుందరుని పనినిగూర్చి ఆయన ఇట్లు వ్రాసెను.

సాధువుని ప్రసంగములు వినుటకు గుంపులు గుంపులుగా జనులు కూడు కొనిరి. ఆరు గంటలకు జరిగెడు కూటమునకు, మూడు గంటలనుండి జనులు రానారంభించిరి. కొందరు నలుబది మైళ్ల దూరమునుండి కూడవచ్చిరి. ఈ కూటములలో రోమనుకాతోలిక్కు క్రైస్తవులును, హిందువులును బహు మంది వచ్చిరి. కూటములకు ప్రజలు విస్తారముగ వచ్చుటచేత ప్రతిదినము ఆయన ప్రసంగములు వినుటకు వచ్చిన గొప్ప సమూహములకు చాలిన పెద్ద శాలలు ఏ పట్టణమందును లేకపోయెను. ఆయా యిండ్లలోకూడ కొంత మందికూడి ఆయనతో సంభాషించిరి. బహుశా, ఈ మధ్యకాలములో సువార్త ప్రకటించిన వారెవరును హిందూ సన్యాసివేషమును ధరించిన యీయనవలె జనులను ప్రేరేపించి యుండలేదనవచ్చును. ఆయన ప్రసం గములు సింగలిభాషలోనికి తర్జుమచేయుట సాధ్యపడలేదు. కొంతవరకు ప్రయత్నించి తృప్తికరముగ నుండనందున మానుకొనిరి.

ప్రార్థనను గూర్చి సుందరుని అడుగవలెనని ఒక హిందువుడు కోరెను. అవశాత్తుగా ఆ వేళ సుందరుడు ప్రార్థననుగూర్చియే ప్రసంగించెను. దానిని శ్రద్ధగా విని చివర కాయన 'నిజముగా యీయన ఆత్మీయ గురువనదగును. ఈయనయొద్ద ఆత్మీయ రహస్యములను తెలిసికొనవలెనని యున్నాను' అని చెప్పెను.

రె. జి. జి. బ్రౌన్ అను ఆయన జాఫ్నానుండి ఇట్లు వ్రాసెను! 'మన సాధువుకు నిజముగ విశేషమైన ఆత్మీయానుభవము కలిగెను. కాని దానిని గూర్చి మాటలాడుటకు ఆయనెంతో వెనుకదీయును. అట్టి యానుభవము అందరికి కలుగవలెనని కాని అందరును తనవలె జీవింపవలెనని కాని ఆయన కోరుటలేదు. ఆయన ప్రజలను ఆకర్షించుటకు ఎంతో శక్తిగలవాడు. జాఫ్నాలో జరిగిన పెద్దకూటములలో ప్రజలు ఇంత భయభక్తులతోను నెమ్మ దిగాను కూర్చుండుట నేనిదివర కెన్నడును కనిపెట్టలేదు. ఆయనకు ప్రజ లను ఆకర్షించెడు శక్తి యింత ఉండుటకు కారణము, క్రీస్తుమత సిద్ధాంతము

లను తన జీవితములో దృష్టాంతపరుచుచు ఆయన స్వచ్ఛమైన హిందూదేశ స్థునివలె జీవించుటచేతనే యని చెప్పవచ్చును.'

దురభిమానమేమియు లేకుండ కూటములకు వచ్చినయెడల లాభము తప్పకుండ పొందుదురు గనుక రమ్మని ఉత్తరములు పంపగా, అనేకమంది బౌద్ధులు, మహమ్మదీయులు, హిందువులు వచ్చిరి. అనేక స్థలములలో ముఖ్యముగా జాఫ్నాలో సాధువు వెళ్లిపోయిన తరువాత పాఠశాలలలోని ఉపాధ్యాయులను ఆయన చెప్పిన జీవవాక్యప్రకారము నడుచుకొనుటకు కోరువారిని హెచ్చరించుమని వార్తాపత్రికలో వ్రాసిరి.

సాధువు, దినమునకు మూడు కూటములలో ప్రసంగించెను. ఇందులో ఏకాంతముగా అనేకమందికి ఆలోచన చెప్పుచుండెను. సింహళములోని ఎండ సహించలేక అధికముగ చెమటలుకార్చి అలసిపోయెను. 'నేను ఇక్కడ ఉప్పువలె కరగిపోవుచున్నాను. నేను కరిగిపోవుటవలన దక్షిణ ఇండియాలోని క్రైస్తవులు ఉప్పుసారము పొందినయెడల నాకష్టమునకు తగిన మంచి ఫలము పొందితినని సంతోషింతును' అని సుందరుడు తన స్నేహితునికి వ్రాసెను.

ప్రతిదినమును వేలకొలది జనులకు ప్రసంగించి విశ్రాంతిలేకుండ, రాత్రులలో నిద్రపోగొట్టుకొని, సుందరుని ఆలోచన అడిగినవారికి సుబోధ చేయుచు, ఆయన దక్షిణ ఇండియాలోను, సింహళములోను బహు గౌరవము నొందుచు, ప్రజలతోనే తిరుగుచుండెను. అనేక వార్తాపత్రికలలో ఆయనను పొగడుచు వ్రాసిరి. వేలకొలది క్రైస్తవుల ఇండ్లలో ఆయనను గూర్చియే ముచ్చటించుచుండిరి. పెద్దలును, పిన్నలును, చదువుకొనినవారును, చదువు రానివారును అందరును ఏకముగా తనను పొగడినను సుందరుడు లెక్కచేయలేదు. అది ఆయనకు అనిష్టముగనే యుండెను. ఆ దినములలో ఆయనకు ప్రార్థనధ్యానములకు సమయములేకుండెను. కాని ఆయనకు కలిగిన సుఖదుఃఖములను వెల్లడిపరచక, ఎంతో వినయముగల జీవితో, మనుష్యుల ఆత్మలను ప్రభువుతట్టు త్రిప్పునట్లు ప్రసంగించుటకు తనకు దొరికిన విశేషమైన సమయమును ప్రయోజనకరముగ తన పరమయజమానుని మహిమ కొరకు వాడుకొనెను.

సింహళములో సంచారముచేసి కొళంబుకు తిరిగివచ్చినప్పుడు ఆయన ప్రసంగములను చెన్నపట్టణమునుండి రెవరెండు కానన్ గోల్డుస్మిత్తు దొరగారు వెళ్లి, ఉర్దుభాషలోనుండి ఇంగ్లీషుభాషలోకి తర్జుమాచేసిరి. సింహళము

లోని ప్రజలు ద్రవ్యవంతులగుటచేత ఆడంబరమందు ఇష్టముగలవాని కని పెట్టి, ప్రతిచోటను నిష్కపటమైన క్రైస్తవ బ్రతుకునకు ఇట్టి డంబము ఎంతో ఆటంకముగా నుండునని తరుచుగా బోధించెను. మరియు ఇట్టి డంబము కనుపించు సభలలో పేదవారైన క్రైస్తవులు ప్రవేశించుటకు జంకు దురు గనుక వారు విశేషమైన క్రైస్తవజీవనములో ప్రవేశింపకుండ వారికి ఆటంకము కలిగించుట సరికాదని ఆయన తరుచుగ హెచ్చరించెను.

దక్షిణ ఇండియాలోనెలెనే యిక్కడను క్రైస్తవులలో కులాభిమానము వారి ఆత్మీయజీవమునకు ఆటంకముగనున్నట్టు కనిపెట్టి, దానిని నిర్భయముగ ఖండించి, ఈ గొప్ప ఆటంకమును తీసివేయుమని ప్రేమతో బ్రతిమాలుకొనెను.

హిందూదేశములోని క్రైస్తవసభను ఒక రాక్షసునికి పోల్చి, ఉత్తర హిందూస్థానము శిరస్సనియు, దక్షిణ హిందూస్థానము కాళ్లనియు సుంద రుడు ఉపమానరీతిగా చెప్పెను. క్రీస్తుమతము ఈ దేశములో వ్యాప్తిపొందు టకు కాళ్లవలెనున్న దక్షిణ ఇండియాలోని క్రైస్తవులు దానిని నడిపింపవలెను. కాని యీ కాళ్లు బలముగనున్నట్టు కనిపించినను, కొచ్చిలో సుందరుడు చూచిన ఒక మనుష్యుని కాళ్లవలె ఏనుగు కాళ్లవాతము కలిగియున్న నట. దక్షిణ హిందూదేశములోని క్రైస్తవసభను పీడపురుగువలె పట్టి తిని వేయుచున్న ఈ యేనుగ కాళ్లవాతము కులాభిమానమేయని సుందరుడు చెప్పెను.

దక్షిణ ఇండియాలోని క్రైస్తవులలో కనిపించు ఈ గొప్ప లోపమును ఖండించగల స్వాతంత్ర్యము సుందరునికే కలదు. ఏమనిన, అపొస్తలుడైన పౌలు తాను హెబ్రీయుల సంతానమైన హెబ్రీయుడనని చెప్పినట్లు, సుంద రుడును హిందూదేశములో ఎంతో అతిశయముగ చెప్పుకొను సిక్కుజా తిలో పుట్టిన సిక్కునని అతిశయింపగలిగినను, ఆయన క్రీస్తుకొరకు ఆ కుల గర్వమునంతను విసర్జించినవాడు. మరియు ఆయన: 'యేసుక్రీస్తు సిలువ యందు తప్ప మరి దేనియందును అతిశయించుట నాకు దూరమవునుగాక; దానివలన నాకు లోకమును, లోకమునకు నేనును సిలువవేయబడి యున్నా నని' ప్రత్యక్షముగ తన జీవితములో కనుపరచినందున, అట్లు ధైర్యముగ చెప్పగలిగెను.

సింహళములోను దక్షిణ ఇండియాలోను తమ మతసిద్ధాంతములకు విరుద్ధముగనున్న ఈ కులగర్వమును విడిచిపెట్టవలసినదని సుందరుడు ఖండి

తముగ జెప్పెను. ఈ విషయములో అందరును సుందరుని శ్రేష్ఠమయిన దృష్టాంతమును వెంబడింపవలసినవారై యున్నారు. అనేక శతాబ్దములనుండి మన దేశస్థుల కాలుసేతులను బంధించియుంచిన ఈ జాతిభేదమును సంకెళ్లను తెంపి వేసికొని, సుందరు డనుభవించుచున్న 'సమృద్ధియైన జీవము,' సహోదర ఐక్యస్వాతంత్ర్యములు క్రీస్తుసభ ఎప్పుడనుభవించగలుగునో! అట్టి సంపూర్ణమైన జీవము మనకు కలిగినప్పుడే, క్రీస్తు ప్రభువు పాదములయొద్దికి ఈ దేశజనులను నడిపించెడు మహిమగల సేవలో పాలు పొందగలము.

సాధు సుందరసింగు దక్షిణ ఇండియాలోను, సింహళములోనున్న సంఘములను దర్శించి, ఇప్పుడు ఇతరదేశములకు ఇతర సంఘములయొద్దికి వెళ్లియున్నాడు. ఆయన శబ్దమును వినిన అనేక వేలమంది ఆయన మాటలను ఆయన ముఖమును మరచిపోలేరు. వారిలో అనేకమంది జీవితము ఆయన 'దేవునితట్టు తిరుగుడ'ని బ్రతిమాలుటచేత మారియుండును. ఈ దేశములో క్రీస్తుమతము స్థాపింపబడి నప్పటినుండి ఏ పురుషునియెడలను క్రైస్తవులు ఇంత గౌరవమును, భక్తిని కనుపరచినట్లు కనిపించదు.

ఆయన ఈ ప్రాంతములలో నున్నప్పుడు ప్రజలు తమకొరకు ప్రార్థించుమని, తమ ఇండ్లలోని రోగులను దర్శించి వారికొరకు ప్రార్థించుమని, తమ పిల్లల నాశీర్వదించుమని తరుచుగ బ్రతిమాలుకొనిరి; ఆయన వస్త్రములను ముట్టుకొనుటే అనేకులకు ఆదరణగా నుండెను. దక్షిణ దేశములో సాధు సుందరసింగు తిరుగుచున్నప్పుడు ఆయన ముట్టుకొనుటవల్లను ప్రార్థించుట వల్లను రోగులు స్వస్థతపొందిరని వదంతి కలిగినందున, తాను అద్భుతములు చేయువాడని మూఢభక్తితో ఆయనను నమ్ముకొందురేమోయను భయముచేత ప్రజల ఇండ్లకుపోవుట ఆయన మానివేయవలసివచ్చెను. జనులను ఆశీర్వదింపుమని అడిగినప్పుడెల్ల ఈ చేతులతో నేను దేవుని వాక్యమును చింపి కాల్చివేసితినే, వాటితో ఎట్టి ఆశీర్వాదము కలుగగలదని ప్రత్యుత్తరమిచ్చుచుండువాడు.

ఇటువంటి అద్భుతశక్తిగల సుందరసింగు మనుష్యులను తన పరమ యజమానుని పాదములయొద్దికి తేవలెనని ప్రయత్నించలేదు. కాని తన దృష్టాంతమువలనను ఆవేశముతో ప్రసంగించుటవలనను వారిని రక్షకునియొద్దికి మృదువుగా నడిపించుటకు పాటుపడెను. సుందరసింగు ఎంతో అమూల్యమైన దేవుని వర్తమానమును ఆసక్తితో మనకు వినిపించి వెళ్లియున్నాడని మనము అనుకొనుట చాలునా?

ఆయన చేతుల ఆశీర్వాదముకంటెను, పరవశపరచగల ఆయన ముఖ వర్చస్సుకంటెను, ఆయన ఈ దేశస్థులైన క్రైస్తవులందరును తన వాక్యాను సారముగా నడుచుకొని, యేసుక్రీస్తుయొక్క నిజమైన దాసులు కావలెనని ఆయన కోరుచున్నాడన్న సంగతి మనము జ్ఞాపకముంచుకొనవలెను.

గనుక మనము లేచి సాధు సుందరసింగు క్రీస్తుప్రభువును వెంబడించు చున్నట్టు మనమును ఆయననుపోలి నడుచుకొనుటకు ప్రభువు తన కృప ననుగ్రహించునుగాక.

# 7. అధ్యాయము

## తూర్పుదేశ సంచారము

దేవుని కుమారునియందలి విశ్వాసమువలన జీవించుచున్నాను. గలతీ. 2: 20.

జూలై మాసములో సుందరుడు ఇండియాకు తిరిగి వచ్చి, దక్షిణా యిండియాలో తన పనిని ముగించుకొని, బొంబాయిలో నొక పెద్దకూటమునకు బోయెను. అక్కడనుండి కలకత్తాకు వెళ్లినప్పుడు ఆ సమయమందు ప్రబలుచున్న ఇన్‌ఫ్లూయంజా జ్వరమువల్ల బాధపడెను. దానినిగూర్చి వ్రాయుచు, దక్షిణదేశములో నాకు దొరకని విశ్రాంతియు, ప్రార్థించుకొనుటకు కాలమును ఈ వ్యాధి సమయమందు దేవుడు నాకు దయచేసెనని వ్రాసెను. తిరిగి ఆరోగ్యము కలిగినతరువాత బోల్‌పూరులో రవీంద్రనాత్ టాగోర్ అను గొప్ప జ్ఞానయోగితో కొన్ని దినములు గడుపుటకు వెళ్లెను. అప్పుడు, బర్మాకును, స్ట్రేట్సు సెటిల్‌మెంటుకును రమ్మని పిలుపు వచ్చినప్పుడు అక్కడికి పోవుటకు తిరిగి కలకత్తాకు వచ్చెను. ఈ దినములలో సింహళము నుండి ఆయనకు పంపబడిన దయగల యుత్తరములు ఆయనకెంతో ఆనందమును కలిగించెను.

బర్మాకుపోవుచు ఓడలోనుండి 'నా కిప్పుడు ప్రార్థనకెంతో కాలమున్నది, సమాజ ప్రపంచములో నెన్నియో నూతనములైన సంగతులను తెలిసికొనుచున్నాను'ని వ్రాసెను. ఆయన ప్రసంగములను వినినవారు ప్రసంగములో తాను చూచిన యీ సంగతులు ఎంత చక్కని దృష్టాంతములుగా వాడుకొనగలడో ఎరుగుదురు.

ఆయన రంగూనులో దిగినప్పుడు ద్విభాషి సహాయమువల్ల ఉర్దూభాషలోనే విశేషముగా ప్రసంగించెను, కాని ఆ సమయమునందును తన ప్రసంగములు రెండు మూడు భాషలలోనికి తర్జుమ చేయబడుటవల్ల తన వర్తమానము ప్రజలకు సరిగా అందుటలేదని విచారపడి తాను ఇంగ్లీషులో ప్రసంగింపగల శక్తి సంపాదించుకొనుటకు బహుగా కోరెను. తనకు సమయము దొరికినప్పుడెల్ల ఇంగ్లీషుభాష పరిశ్రమ నేర్చుకొనుచుండెను. మరియు సాధ్యమైనప్పుడు ఇంగ్లీషులోనే సంభాషించుచుండెను.

ఇక్కడను, ఇతర పెద్ద పట్టణములలోను, ఆర్యసమాజపు బోధకు డొకడు ఈయనను వెంబడించి, క్రీస్తుమతమునకు విరుద్ధముగ బోధించి యీ యన పనిని పాడుచేయవలెనని ప్రయత్నించెను; కాని ప్రజలు అతని కూట ములకు రానందున విసికి, చివరకు తిరిగిపోయెను. ఒక కూటములో సుందర సింగు దేశీయ మిషనరీ సంఘము (National Missionary Society) వారికి సహాయము చేయుడని అడుగగానే తమ కృతజ్ఞతార్పణగా రూ. 500 పోగుచేసిరి.

దక్షిణ యిండియాలోను సింహళములోను జరిగినట్టుగానే రంగూనులో కూడా సుందరునికి విశ్రాంతి లేకుండ కూటములు ఏర్పాటుచేసిరి. అంతకు ముందు లెఫ్రాయి అధ్యక్షులవారు రంగూను దర్శించి యున్నందున, ఆయన సుందరునిగూర్చి చెప్పిన సంగతులనుబట్టి, వారు సుందరునికి యెంతో అపే క్షతో స్వాగతమిచ్చిరి. రంగూను అధ్యక్షులవారు సుందరుడు ప్రసంగించిన ఒక కూటములో అగ్రాసనాధిపతిగ నుండుటయేకాక, జపానులోని అధ్యక్షు నికి ఆయననుగూర్చి వ్రాసినందున వారును అక్కడికి రమ్మని పిలిచిరి. అనే కులు దేవుడు సుందరునిద్వారా తమకు కలుగజేసిన మేలునుగూర్చి కృతజ్ఞతా ర్పణగా ఆయనకు కావలసిన యవసరములను తీర్చుటయేకాక ఆయన చీనా కును జపానుకును పోవుటకు పొగబండిలోను ఓడలోను మొదటి తరగతి గదులలో ప్రయాణము చేయుటకు సదుపాయము చేసిరి.

సుందరసింగు సాధువుగ బయలుదేరినప్పటినుండి 'ఏమితిందుమో ఏమి త్రాగుదుమో అని మీ ప్రాణమును గూర్చియైనను, ఏమి ధరించుకొం దుమో అని మీ దేహమును గూర్చియైనను చింతింపకుడ'ని క్రీస్తుప్రభువు చెప్పిన మాటలు అక్షరార్థము చేసికొని వాటిని నమ్మకొనెను. దేవుడును ఆయన విశ్వాసమునకు తగినట్టు సహాయము చేసెను. హిందూదేశమునుదాటి బర్మా, మాండలే, పీనాంగ్, సింగపూరు, పీనాంగులకును వేరైన శీతోష్ణస్థితు లును, భాషలును కలిగి దూరముననున్న చీనా, జపాను దేశములకును, చేతిలో ద్రవ్యము లేకుండ క్రొత్త జాతులవారితో మాట్లాడుటకు ఒక్క విదేశీయభాషను మాత్రమే యెరిగినవాడై, తెగించిపోవుట, సామాన్య జను లకు ఊహింపశక్యముకాదు. దేవునియందు ఈయనకు కలిగిన దృఢవిశ్వా సము చిన్నతనమందే తన యింటిని విడిచిపెట్టునట్లు చేసెను. ఆ విశ్వాసమే యీయన యింకను చిన్నవాడుగ నున్నప్పుడే టిబెట్టువంటి అరణ్య ప్రదేశ ములోనికి దేవుడు తనను పిలిచెనని నిస్సందేహముగ నమ్మి, తనకేమాత్రము

ఆతిథ్యమీయుని ప్రజలమధ్యకు పోవునట్లుచేసెను. ఆ సమయమందు కే. టీ. పాలుగారు చెప్పినట్లు, ఇండియాలోని క్రైస్తవులందరు సుందరుని పాద ములయొద్ద నిలువబడి, ఆయనేమి కోరినను చేయుటకు సిద్ధముగనున్నను, ఆయన అది నమ్ముకొనక, దేవునిమీదనే తన భారమువేసి తన పరిచర్య జరుపుచుండెను. ఆయన దేవుని చిత్తమునకు సంతోషముతో లోబడి ముం దుకు ఏ సదుపాయములేకుండ తన పనిమీద బయలుదేరినప్పటికి, పొగ బండ్లు ఆయనకొరకు సిద్ధముగనుండును, ఓడలు లంగరుదింపుకొని ఆయన కొరకు వేచియుండును, ఆయా భాషలవారును, జాతులవారును, వర్ణముల వారును, ప్రతిచోటను ఆయనకు సహాయము చేయుటకు కనిపెట్టుకొని యుందురు. ఇది నిజముగా దేవుని కుమారునియందలి విశ్వాసమువలన జీవించుట కాదా!

రంగూను, సింగపూరు, పినాంగు, మొదలైన పెద్దరాజధాని పట్ట ణములలో అనేకభాషలు మాట్లాడుచు, ఆయా స్థితిగతులలోనున్న అనేక జాతుల మనుష్యులతో నిండిన గొప్ప సభలలో ఆయన ప్రసంగించెను. చీనావారికి, జపానువారికి, మలేవారికి, ఐరోపియనులకు ఇండియాలోని పలుజాతులవారికి, అక్కడ ప్రసంగించినప్పుడు, సాధారణముగ ఇద్దరు ద్విభాషలు వేరువేరు భాషలలోనికి తర్జుమాచేసిరి. ఈ ప్రదేశములలో ఉర్దు, బర్మా, బంగాళీ, అరవము, తెలుగు, చీనా, ఇంగ్లీషు భాషలలోనికి ఆయన ప్రసంగములు భాషాంతరము చేయబడెను. ఆయా జాతులవారైన వర్తకులు, పటాలపు ఉద్యోగస్థులు, గురువులు, సర్కారు ఉద్యోగస్థులు ఆయన ప్రసంగించినపుడు అగ్రాసనాధిపతులై యుండిరి.

ఆయన తన పనినిగూర్చి యెప్పుడును చెప్పుకొనడు గనుకను, ఆ ప్రదేశములలో దానినిగూర్చి తెలుపుటకు క్రైస్తవ వార్తాపత్రికలు లేవు గనుకను ఆయన సంచారమునుగూర్చి తెలిసికొనుట కష్టమయ్యెను. కాని ఆయనను సంధించి, ఆయనకు ఆతిథ్యమిచ్చిన స్నేహితుల ఉత్తరములవల్ల కొన్ని చక్కని సంగతులు తెలియువచ్చును. మన సాధువు మెయిమ్యో పట్టణమునకు వెళ్లినప్పుడు దాని రమ్యతకును చల్లదనమునకును బహు సంతోషించెను. ఈ శృంగారమైన చోటనే తన దేశపువారైన కొందరు పంజాబీయులను కలిసికొనెను. వారు క్రైస్తవులు కాకపోయినను ఆయనను భోజనమునకు పిలిచి, తమతో ఒక్క పళ్లెములో భుజించుమని చెప్పినప్పుడు ఆయనకెంతో సంతోషము కలిగెను. అక్కడినుండి, ఒక మిషనెరీ:—

'ఆయన పరము లెట్లున్నను, ఆయన స్వతసిద్ధముగ మహాత్ముడు, ఆయన యితరులకు తెలుపు వర్తమానమును యాత్మలో అనుభవపూర్వకముగ గ్రహించినవాడు. ఆయన దర్శించిన ప్రతి పట్టణములోను ప్రకాశమానమైన వెలుగును ఆయన విడిచి వెళ్లిన'ని వ్రాసెను.

పేరక్కాను పరగణాలోని ఇప్పా అను చోటినుండి ఒకరు ఎంతో పరితాపముతో:

"ఆయన మాకు ప్రార్థించుట నేర్పెను, ఇప్పుడు మా ప్రార్థనలు ఎంతో మారిపోయినవి. నా మేనల్లుడు తా నెన్నడు క్రైస్తవుడు కానని, తన పూర్వుల మతములో నేయుండి, తన తండ్రి శ్రాద్ధక్రియలు జరుపుదునని చెప్పుచుండెను. కాని మన సాధువు మా యింటిలో బసచేసి, ఆ యావనుని సందేహములు తీర్చినందున, యిప్పుడతడు బాప్తిస్మము పొందగోరుచున్నాడ"ని వర్తమానము పంపెను.

సింగపూరులో ముఖ్యుడైన వైద్యుడొకడు క్లుప్తముగా:

'ఆయన మలే పరగణాలలో సంచారముచేసిన నెలదినములు ఎడతెగని పెంతెకోస్తువలె నున్నవ'ని వ్రాసెను.

స్ట్రేట్సు సెటిల్‌మెంటులోని ఒక వార్తా పత్రికలో:

'ఆయన క్రీస్తుమతమునుగూర్చి ఆవేశముతో వాదించినందున ఆయన ప్రసంగములు వినిన పలుగురి హృదయములను ఆకర్షింపగలిగెనని వ్రాసిరి.

బాస్సీనను చోట ప్రముఖులైన హిందువులును మహమ్మదీయులును ఆయన కూటములను ఏర్పాటుచేయుటలో పని పూనుకొన్నట్లు విని ఆయన ఎంతో సంతోషించెను. పినాంగులో ఆయన ఎదురుచూడని సంతోషమొకటి కలిగెను. ఒక గొప్ప నాటకశాలలో ఆయన చేసిన ప్రసంగమును అరవములోను, మలే, చీనాభాషలలోను క్లుప్తముగ జెప్పిరి. సిక్కుల కొరకు మరియొకచోట నియమించబడిన గొప్ప కూటములో ఆయన హిందుస్తానీలో ప్రసంగించెను. సభ ముగిసినతరువాత ఒక్క సిక్కు ప్రముఖుడు నిలువబడి, సాధువువచ్చి తమ సిక్కు దేవాలయములో ప్రసంగింపవలెనని కోరెను. ఆ పినాంగులోనే పోలీసు ఉద్యోగస్థుడు ఒక కూటమునకు అధ్యక్షుడుగానుండి, తనచేతిక్రింద ఉద్యోగస్థులును జవానులందరు కూటమునకు వెళ్లగలుగుటకు ఒకపూట సెలవు ఇచ్చెను.

తన పనిలో ఇంత సఫలతను పొందినందున సుందరుడు సాధువుగా కష్ట జీవనము చేయుటను మానివేయవలెనను ఉద్దేశము కలవాడగు నేమోయని

కొందరు భయపడుట ఆశ్చర్యముకాదు. కాని అట్టి సమయములో తనకు కలుగు శోధన ఆయన గ్రహించినట్లు ఇతరులు గ్రహించలేరు, గనుక ఆయన అంతమువరకు తాను వినయముగాను నమ్మకముగాను నుండవలెనని యెల్లప్పుడు ప్రార్థించుచుండెను.

ఆయా ప్రదేశములలో జరుగుచున్న పనిని గూర్చి ఆయనిట్లు వ్రాసెను:—

“బర్మావారు మంగోలియను జాతివారును బౌద్ధులునైనందున దేవుని గూర్చి ఎరుగరు. వారిభాషలో దేవుడను మాటలో మనము గ్రహించున దంతయు తెలుపు పదములేనందున, దేవుడనగ నేమియో వారికి దెలియ చెప్పుట కష్టము. కాని వారు అమాయికులు, వారి దేవాలయములలోనికి యేమతస్థులైనను పోవచ్చును. హిందువులు మహమ్మదీయులవలె వారు మూర్ఖమైన మతవైరాగ్యముకలవారు కారు. వారు మన కూటములకు వత్తురు, తమ భార్యలనుకూడా తీసికొనివత్తురు.”

మరియు ఆయనిట్లు వ్రాసెను:—

“ఈ జనులమధ్య యెంతో గొప్పపని జరుగుచున్నదని యితరులకు తోచినను నా కట్లు కనుపించలేదు.”

ఆన 1919 సంవత్సరారంభమందు సుందరుని జీవితములో రెండు విశేషమైన సంగతులు జరిగెను. ఆయన చీనా జపాను, దేశములకు తూర్పుగా గొప్ప ప్రయాణము చేయుటయేకాక, జనవరి నెల 2-వ తారీఖున యింగ్లీషు స్వభాషగా మాట్లాడుచుండు ప్రజలుగల సింగపూరుకు వెళ్లినపుడు అక్కడ హిందూస్తానిలోనుండి తన ప్రసంగములను ఇంగ్లీషులోనికి భాషాంతరము చేయుటకు ఎవరును దొరకనందున, వెంటనే, తాను ఇంగ్లీషులో ప్రసంగింపవలెనని నిశ్చయించుకొనెను. నాటినుండి ఆయన ఇంగ్లీషులోనే ప్రసంగించుచున్నాడు. అంతకుముందు కొన్ని మాసములక్రిందటనే దక్షిణ యిండియాలో ఆయా స్థలములలో సుందరుని ప్రసంగములు ఇంగ్లీషులోనికి భాషాంతరము చేయగలవారు దొరకనందున కొన్ని ముఖ్యమైన కూటములు మానుకొనవలసివచ్చెను. అందుచేత ఈ దూరదేశములో ఆయన పని సఫలముగా జరుగవలెనని ఆసక్తితో ప్రార్థించుచున్నవారు సుందరుడు నిర్భయముగా ఇంగ్లీషులో ప్రసంగించుచున్నాడని వినినప్పుడు తమ ప్రార్థనలు దేవుడు వినెనని సంతోషించుట ఆశ్చర్యముకాదు.

జపానులోని అధ్యక్షులవారికి మెలోనీ అధ్యక్షులవారిచ్చిన పత్రికను తీసికొని సింగపూరునుండి చీనాకు వెళ్లెను. అక్కడ కొన్ని కూటములు జరిపి, తిరిగి వత్తునని చెప్పి జపానుకు పోవుటకు ఓడెక్కెను. జపాను చేరినప్పుడు, అక్కడి ప్రజలు ఇంగ్లీషులో మాట్లాడుట విని యెంతో ప్రోత్సాహమును పొందిరి. అంతవరకు తనకెంతో విచారమును కలిగించిన భాషవలని ఆటంకమును తీసివేసి దేవుడు ఆశ్చర్యకరమైనరీతిగ భూదిగంతములవరకు సాక్ష్యమిచ్చుటకు తనకు సహాయముచేసెనని ఆయనను స్తుతించుచున్నాడు.

## పిలువబడినవాడు, యేర్పరచబడినవాడు, నమ్మకమైనవాడు

ఆయనతో కూడ నుండువారు పిలువబడినవారై, యేర్పరచబడినవారై నమ్మకమైనవారై యుం[illegible]
(ప్రకటన 17. 14)

జపానులోని ప్రజలు బహు సౌఖ్యులైనట్టు కనిపెట్టెను. వారిలో మతమునుగూర్చిన చింత లేశమైనను లేనట్టును, ఆత్మీయమైన సంగతులు వారికెంతమాత్రము పట్టనట్టును, డబ్బాశ, అధికారమందు ఆకాంక్ష, దుర్నీతి, అపవిత్రత అధికముగనున్నట్టును తెలిసికొనినప్పుడు ఆయనకెంతో అసహ్యము కలిగెను. వారికి తమ మతమందు భక్తిలేకుండెను. వారి ఆలయములలో ఆరాధించువారికంటె పరదేశములనుండి వచ్చినవారే యెక్కువమంది యుండిరి. వారు అతి తీవ్రముగ అటు ఇటు పరుగులిడి జీవనోపాధి సంపాదించుచుండిరి. ఈ సంగతులు సుందరుడు చూచి చాల విచారపడెను.

యొకహామా పట్టణమునుండి ఒక మిషనెరీ యిట్లు వ్రాసెను: విదేశీయులకు ఆయన ఒకసారి ప్రసంగించినప్పుడు ఆయన వాడిన దృష్టాంతములు విని బహు ఆశ్చర్యపడితిమి. ఆయన క్రైస్తవుడైన చరిత్ర అపొస్తలుడైన పౌలు మారుమనస్సుపొందిన చరిత్రను పోలియున్నట్టు మాకు తోచెను.

టోకియో పట్టణమునుండి మరియొక మిషనెరీ: ఆయన ఆత్మీయమైన సత్యములను వివరించుట మాకు ఆశ్చర్యమును కలిగించెను. ఆయన మాటలు ఆత్మీయానుభవముగలవై యుండెను. ఆయన మా యింటిలో బసచేసెనని వ్రాసెను.

ఓకసాకి పట్టణములోని జపాను పాస్టరు:

క్యోటో పట్టణములో అమెరికానుండి వచ్చిన మిషనెరీలు సుందరసింగు ప్రసంగములు విని బహు ఆవేశమును పొందిరి. కాని స్వదేశగురువులు అంతకంటె యెక్కువ ఆవేశమును పొందిరని తోచుచున్నది.

కళాశాలలో చదువుకొనుచున్న ఒక యౌవనుడు సాధువు ఇక్కడికి రాకముందు మా యింటికి వచ్చుచుండెను. అతడు ప్రకృతిశాస్త్రము చదువు కొనుచు బహు దేశాభిమానముగలవాడై యుండెను. అతడు దేవునిగూర్చి యెక్కువగ తెలిసికొనవలెనని కోరెను గాని స్పష్టమైన వెలుగు అతని మన స్సులో ప్రకాశింపలేదు. సుందరసింగు కూటములకు రాలేకపోయెను. అయినను నే నాయననుగూర్చి నా బైబిలు తరగతిలో మాట్లాడినప్పుడు తల వంచుకొని బహు నెమ్మదిగా నుండెను. కొన్ని దినములైన తరువాత కాలే జీకి పోవుచు ఉదయమున నాయొద్దికివచ్చెను. అతని కుడిచేతికి కట్టు కట్టి యుండెను. అతడు దేవుని శక్తిని ఆ రాత్రి అనుభవపూర్వకముగ తెలిసి కొంటినని చెప్పెను.

అతడు తెల్లవారి 3కే గంటలకు తన తండ్రి తన మనస్సాక్షికి విరుద్ధ మైనదేదో చేయుమని బలవంతము చేసినట్లు కలగనెను. అతడు మంచము మీదనుండి లేచి తనలో నేదో ఆత్మీయమైన శక్తి కలిగినట్లు గ్రహించెను. దాని నెదిరించినకొలది అది అధికమయ్యెను. తనకు తెలియకుండనే తన చేతులు జోడించుకొని యెంతో వణుకసాగెను. చివరకు చెప్ప శక్యము కాని యానందముతో అతని మనస్సు నిండుకొని బిగ్గరగా యేడ్చెను. అందు వల్ల దగ్గర గదిలో నిద్రించుచున్న స్నేహితులు మేల్కొని దానినిగూర్చి తెలిసికొనుటకు వచ్చిరి.

అప్పుడా పడుచువాడు ఎంతో ఆసక్తితో బోధించుచు తన కుడిచేతితో బల్లమీద కొట్టినందున దానికి గాయము తగిలెను.

అతడు నాతో ఈ సంగతి చెప్పినప్పుడు, క్రీస్తుప్రభువు నిన్ను పిలుచు చున్నాడు. గనుక ఆయనను బహిరంగముగా ఒప్పుకొని, యితరులకు తన యనుభవము చెప్పవలసినదని చెప్పితిని.

ఆ సాయంత్రమతడు వైద్యవిద్య నేర్చుకొనుచుండిన ఒక స్నేహి తుని, క్రైస్తవుడై మతభ్రష్టయిన మరియొక స్నేహితుని వెంటబెట్టుకొని వచ్చెను. వారితో రక్షకునిగూర్చి ఆవేశముతో మాట్లాడుచున్నప్పుడు కొం దరు ప్రజలు వినుటకు గుంపుకూడిరి. మతభ్రష్టయిన క్రైస్తవుడు పశ్చాత్తాప

పడి యేడ్చి, క్రీస్తు మతమునుగూర్చి క్రీస్తును వెంబడించుటనుగూర్చి అప్పుడే మొదటిసారి గ్రహించితినని చెప్పెను. ఈ విధముగా సాధువు ఇక్కడికి వచ్చి గడిపిన కొద్ది దినములలో మా ప్రజల బ్రతుకులో గొప్ప మార్పు కలిగినదని వ్రాసెను.

జపాను క్రైస్తవులు పవిత్రను వెంబడించి దేవునితో నైక్యసంబంధములు గలవారగుటకు తదేకనిష్ఠతో ప్రయత్నింపవలెననియు, ప్రార్థన అనగా కావలసిన మేళ్లను దేవుని అడుగుకొనుట మాత్రమేకాదు కాని దేవునితో సహవాసము చేయుటనియు, క్రీస్తుప్రభువుకు తనను సంపూర్ణముగా సమర్పించుకొనువాడు ప్రాణత్యాగము చేయవలసివచ్చినను ఆయన చిత్తప్రకారము సంతోషముగా చేయుటకు సిద్ధముగా నుండవలెననియు, యీ మొదలైన గొప్ప అంశములను ధ్యానించుకొనుడని సుందరుడు బోధించెను.

ఆ జపాను క్రైస్తవుడొకడు, ఈయన సాధ్యమైనంతవరకు ఇట్టి ఆత్మీయమైన నీతిమార్గములో నడిచినవాడు గనుకనే దేవునియొద్దనుండి వచ్చిన రాయబారిగా అధికారముతో మాట్లాడుచున్నాడనెను.

సుందరుడు క్రీస్తును కనుగొనిన చరిత్ర విని ఒక జపాను ఘనురాలు:

నా ప్రియ స్నేహితుడొకడు తన మతమందు భక్తి తప్పి వెలుగుకొరకు ఎంతో కష్టముతో వెతుకులాడెను గాని దానిని కనుగొనలేక పదునెనిమిదేండ్ల వాడైనప్పుడే నదిలోపడి చనిపోయెను. అయ్యో నా స్నేహితునికి క్రీస్తునుగూర్చి యేమియు తెలియకపోయెను; ఆ యంధకారములో అతడు వెళ్లుటకెవరును లేకపోయిరి. నిలుచు తావులేక ప్రాణము పోగొట్టుకొనెనని బిగ్గరగా చెప్పెను.

ఇట్టివారికి సహాయము చేయుటకే సుందరసింగు జపానుకు వెళ్లెను.

చీనాలో ప్రజలు ఇంకను తమ పూర్వమతములయందు భక్తి వైరాగ్యములు కలిగియున్నట్టు కనుగొని, వారు ఉన్నతమైన ఆత్మీయానుభవము కలవారగుదురని సుందరుడు చెప్పుచున్నాడు. జపానులోను చీనాలోను ఇండియాలోవలె కులాభిమానము లేనందున క్రీస్తుమతమును వారు సులువుగా అంగీకరింపవచ్చునని ఆయన ఆశ్చర్యపడెను.

పీకింగునుండి ఒక మిషనెరీ:

ఆయన పీకింగు పట్టణమునకు వచ్చుట యెంతో సమయోచితముగనున్నది. అక్కడి గొప్ప ఆలయములోని సంఘమునకు పునర్జీవమును కలి

గించెను. అక్కడి బిషప్పుగారి ఆలయములో మెథడిస్టు సభలోచేరిన వారొకరు సుందరుని ప్రసంగము భాషాంతరముచేయుట యెంతో బాగున్నది. ఆదివారమందు కూడెడు సంఘముకంటె యెక్కువమంది ఆయన కూటమునకు వచ్చిరి. సోమవారము కూటముజరుగునని అకస్మాత్తుగా తెలిసినను ఆ గొప్ప ఆలయము నిండునట్లు ప్రజలువచ్చిరి. ఆయన యింగ్లీషులో చేసిన ప్రసంగము సువార్తలను పోలియుండెనని వ్రాసెను.

ఆదివారమున ఐరోపియనులకును అమెరికనులకును ఐక్యసంఘము వారి ఆలయములో ప్రసంగించెను. పీకిన్ పట్టణములో చలి యెక్కువగా నున్నందున తనకు బహు ఆరోగ్యముగా నున్నట్టు వ్రాసెను.

హాంకాంపట్టణములో ఇంఫ్లుయెంజాజ్వరములు వ్యాపించియున్నను ఆయన కొంతపని చేయుగలిగెను. హడ్సన్ టేలరను గొప్ప మిషనెరీ కుమారుడు ఈయన ప్రసంగమును చీనాభాషలోనికి తర్జుమాచేసెను. అక్కడినుండి 1900 సం॥ లో అనేకమంది చీనావారిని మిషనెరీలను హత్యచేసిన షాన్సి పరగణాలకు వెళ్లెను. ఆ సమయములో తమ తలిదండ్రులను చిత్రవధ చేయుచుండగ జూచిన బాలురు సహా తమ ప్రభువుకొరకు నమ్మకముగా హతసాక్షి మరణముపొందిరని సుందరుడు వినినప్పుడు ఆయనకెంతో ఆవేశము పుట్టెను.

నాన్‌కింగుపట్టణమునకు ఆయన అకస్మాత్తుగా వెళ్లినందున కూటముల కొరకు ఏ యేర్పాటును చేయబడలేదు. అక్కడి మిషనెరీ మరియొక స్నేహితుని కలిసికొనుటకు రైలుస్టేషనుకు వెళ్లినప్పుడు అక్కడ సుందరుని చూచి తన యింటికి తీసికొనివెళ్లెను. ఆ మిషనెరీ యిట్లు వ్రాసెను.

మా క్రొత్త ఆలయములో ఆయన ప్రసంగించెను. ప్రజలు ఆయన ముఖమును చూచి బహు ఆశ్చర్యపడిరి. నవీనమైన దృష్టాంతములతో ఆయన చెప్పినమాటలు వారి మనస్సులో నాటుకొనెను. ఆయననుగూర్చి వారు ఇప్పటికిని మాట్లాడుకొనుచున్నారు. నేడొక యౌవనుడు నాయొద్దికి వచ్చి, నేనేమి ప్రస్తాపించకున్నను, సుందరసింగు నేను చూచినవారందరిలో నిజమైన క్రైస్తవజీవము జీవించుచున్నాడని చెప్పెను.

ఆ మధ్యాహ్నము క్రొత్తగా క్రైస్తవులైన కొందరితో ఆయన మాట్లాడెను. ఆ రాత్రి సాక్ష్యమిచ్చుటనుగూర్చి ఒక మిషనెరీకూటములో ప్రసంగించెను. ఈ సంగతులు తెలిపిన మిషనేరీ, "ఆ ప్రసంగమును వినిన మిషనెరీలకు అది యెంత ప్రోత్సాహమును కలిగించెనో మీకు చెప్ప నవసరములేదు" అని వ్రాసెను.

ఆ ప్రదేశములో ఆయనియ్యవలసిన సాక్ష్యము ముగించి, త్వరలోనే తిరిగి చెన్నపట్టణమువచ్చి తన స్నేహితులయొద్ద చేరెను.

# 8. అధ్యాయము

## టిబెట్టు సంచారము—1919

టిబెట్టుకు పోవలసిన కాలమానము అదివరకే వచ్చినందున చెన్నపట్టణము నుండి తిన్నగా సుందరసింగు సిమ్లా పోయిచేరెను. అక్కడినుండి సబాటు అను పట్టణమునకు వెళ్లెను. ఇక్కడనే ఆయన పదునాలుగేండ్లక్రిందట చాలాసేపు ప్రార్థించినపిమ్మట యీ సాధువు వేషమును ధరించి క్రీస్తు ప్రభువు తన నెక్కడికి నడిపించినను వెళ్లెదనని గంభీరమైన వ్రతము చేసికొనెను. తిరిగి అక్కడికి వెళ్లి ఆ గదిలోనే ఆయన కూర్చుండి ధ్యానించుకొనుచుండెను.

కోట్‌ఘుర్ అను గ్రామములో కాలికి దెబ్బతగిలి పడియుండవలసివచ్చి నందున ఆయన తలపెట్టుకొన్న టిబెట్టు ప్రయాణము ఆలస్యమైనదని బహు విచారించెను. కాని తిరిగి జూలై నాలుగవ తేదీని నాగరికత కలిగిన ప్రదేశములలోని తన స్నేహితులను విడిచి దేవునితో ఉన్నతమైన సహవాసము చేయుటకు మంచుతో కప్పబడిన హిమాలయపర్వతములమీదికిని, తాను పాటుపడుటకు నియమించుకొనిన టిబెట్టు ప్రాంతములకును ఆయన వెళ్లెను.

ఈ గ్రంథకర్త కోరినందున 1919-వ సంవత్సరములో సాధు సుందరసింగు టిబెట్టునుండి తిరిగివచ్చి, తన ప్రయాణమునుగూర్చి యిట్లు వ్రాసెను.

జూలై ఆరంభములో కోట్‌ఘుర్‌నుండి బయలుదేరి తానియాట్ అనే పేరుగల టిబెటీయుడైన క్రైస్తవుని వెంటబెట్టుకొని టిబెట్టుకు ప్రయాణము చేసితిమి. కోట్‌ఘుర్‌నుండి టిబెట్టు సుమారు 130 మైళ్లదూరములో నున్నది. హీరత్, రెంపూర్, బుషాహర్, గౌరా, సాచాన్, చౌరా, ట్రండా, పొంతా, పోచార్, కొడ్డాన్, కార్చా, కెంఫరెన్ అను గ్రామములలో సువార్త బోధించుచు, టిబెట్టులో మొదటి పట్టణమైన యంగ్పా చేరితిమి. ఇక్కడి నుండి నలుబదిమైళ్లదూరములో చుట్టును అడవిప్రదేశమేగాని ఒక చిన్న గ్రామమైనను ఉండుటకు తావైననులేదు. అక్కడక్కడ ఒక గొర్రెలమంద కాపరిమాత్రము కనుపించును. ఈ యరణ్యములో అయిదు రాత్రులు గడిప

తిమి; ఒకరాత్రి ఒక చెట్టుక్రిందను, మరియొకరాత్రి ఒక గుహలోనుంటిమి; ఇక్కడినుండి చాలాదూరమువరకు బహు చలిగాను ఎత్తుగానున్నందున చెట్లు గడ్డిపరకలు సహా ఎక్కడను మొలచుటలేదు. చూపుమేర దూరములో ఎండిన పర్వతములు మిట్టప్రదేశమే కనుపించును.

## పర్వతములమీద చలి

సముద్రమట్టమునకు 16,000 అడుగుల యెత్తున బైట చలిలోపరుండి నిద్రించినందున మా దేహములు తిమ్మిరిచేత స్పర్శజ్ఞానము తప్పియుండెను. ఒకరాత్రి అంతయూ కుంభవర్షము కురిసినందున యెక్కువైన ఆ చలిలో ఒక గొడుగు క్రింద కూర్చుండవలసివచ్చెను. ఇది బహు అపాయకరమైన చోటు అనేకమంది ఆ మంచులో చనిపోయిరి.

జూలై 15 తేదీని సుమారు 19,000 అడుగుల యెత్తుననున్న హంగ్సులా పాస్‌కు వచ్చితిమి. అక్కడ భయంకరమైన చలిచేత చచ్చిపడియున్న ముగ్గురు మనుష్యుల శవములు చూచితిమి. ఇంత యెత్తైన ప్రదేశములో ఊపిరించుటే కష్టముగానుండెను. మా తలలో ఊపిరితిత్తులలోను బహు బాధగానుండెను. మా గుండె కొట్టుకొనుట మాకు వినిపించెను. ఇక్కడ మంచుగడ్డ పర్వతములో అనేకమంది తమ ప్రాణములు పోగొట్టుకొనిరి. వారి శరీరములు నేటికిని దొరకలేదు. ఈ భయంకరమైనచోట మమ్మును సురక్షితముగా కాపాడిన దేవునికి స్తోత్రములు చెల్లించుచున్నాము.

జూలై 16-వ తేదీని మద్ అను గ్రామము చేరితిమి. ఆ యూరిపెద్ద మమ్మును దయతోచేర్చుకొని, హిందూస్తానీ తెలిసిన లామాను మాతో భోజనమునకు పిలిచెను. అప్పుడు మేము వాక్యము బోధించితిమి. తాను బహు జాగ్రత్తగా వినుటయేకాక, యితరులనుకూడ వినునట్లు చేసెను. మరునాడు తాలింగు, సంగ్నం వెళ్లితిమి. అక్కడినుండి ఇనాంబు, క్వెలింగు, కురింగు. పాలింగు మీదుగా సిడెంగు, సారా, కోజె, రంగ్రిగు వెళ్లితిమి. ప్రతిచోటను బోధించితిమి.

అక్కడినుండి కూగంరాకు వెళ్లితిమి. అక్కడ 400 మంది లామాలు ఒక పెద్ద దేవాలయము ప్రక్కనున్న కట్టడములో నివసించుచుండిరి. వారిలో పెద్దలామా లహసా పట్టణమునుండి పంపబడినవాడు. ఇతడు

లామాటాషీద్వారా నియమింపబడిన పెద్దలామా. ఇతనితో రెండు దినములుంటిమి. మాకు కొంత తొందరకలిగించినను మతమునుగూర్చి మాతో వాదము చేయుటకు బహు అభిలాష కలిగియుండెను.

## నదులవలననైన ఆపదలలో

టిబెట్టులో ఒక విధమైన అపాయముకాదు, అనేక విధములైన కష్టములున్నవి. అక్కడ రోడ్లు లేవు; అనేకమైన వాగులు, నదులున్నను వాటిని దాటుటకు వంతెనలు లేవు. వాటిలోని నీరు మంచుగడ్డవలె చల్లగా నుండును. నీళ్లు లోతులేనిచోట మేము ఈద గలిగితిమి. కాని కొన్నిచోట్ల నది బహు వడిగా పారుచున్నందునను, నదిలో బండలున్నందునను ఈదుట అసాధ్యమయ్యెను. ఒక నాడు మోరాంగునదిలో ఈదుచుండగా నీళ్లు బహు చల్లగా నున్నందున నా దేహము బిగిసికొనిపోయెను. తానియాట్ లో మూడు సార్లు నీళ్ల క్రిందికిపోయి, బహు కష్టముతో ఒడ్డు చేరితిని. ఆ నదిలో అనేకమంది మునిగి తిరిగి లేవలేకపోయిరి.

టిబెట్టులో ఆహారము దొరుకుట మరియొక కష్టము. అనేకచోట్ల సాంప లేక సాత్తు అనగా (వేపిన యవలపిండి), ఉప్పు వెన్నకలిపిన ఒక విధమైన తేనీళ్లు తప్ప తినుటకుగాని త్రాగుటకుగాని యేమియు దొరకదు. ఈ వేపిన యవలు మన దేశములో గుఱ్ఱములుగాని గాడిదెలుగాని తినలేనంత అసహ్యముగా నుండును. ఈ కష్టములన్నిటిలో నిది క్రీస్తు ప్రభువుయొక్క సిలువ, ఆత్మల రక్షణకొరకు అవశ్యమనిన తలంపు గొప్ప ఆదరణగానుండెను. నాకొరకు క్రీస్తు పరలోకమహిమను విడిచివచ్చి సిలువ భారమును మోసికొనెను. గనుక నేను ఇండియాదేశమును విడిచి ఆయనకొరకు ఆత్మలను సంపాదించుటకు టిబెట్టుకు వచ్చుట గొప్ప సంగతి కాదు; నేను రాకుంటే అది భయంకరమైన పాతకమగును. ఎందుకనిన అది దైవాజ్ఞ.

## బట్టలు ఉతుకుట యను పాపము

టిబెట్టులో ఇండ్లు బహు చిన్నవిగాను, బహు మురికిగా నుండును: అవి రాళ్లతోను మట్టితోను కట్టబడును. ఆ జనుల వాసన సహింప శక్యము కాకుండును. లారా అనే గ్రామములో ఒక మనుష్యుడు మురికిచేత నల్లగా నుండుట చూచితిని. వాడు కనీసము పదియేనేండ్ల క్రిందట స్నానముచేసి

తిమి; ఒకరాత్రి ఒక చెట్టుక్రిందను, మరియొకరాత్రి ఒక గుహాలోనుంటిమి; ఇక్కడినుండి చాలాదూరమువరకు బహు చలిగాను ఎత్తుగానున్నందున చెట్లు గడ్డిపరకలు సహా ఎక్కడను మొలచుటలేదు. చూపుమేర దూరములో ఎండిన పర్వతములు మిట్టప్రదేశమే కనుపించును.

## పర్వతములమీద చలి

సముద్రమట్టమునకు 16,000 అడుగుల యెత్తున బైట చలిలోపరుండి నిద్రించినందున మా దేహములు తిమ్మిరిచేత స్పర్శజ్ఞానము తప్పియుండెను. ఒకరాత్రి అంతయు కుంభవర్షము కురిసినందున యెక్కువైన ఆ చలిలో ఒక గొడుగు క్రింద కూర్చుండవలసివచ్చెను. ఇది బహు అపాయకరమైన చోటు అనేకమంది ఆ మంచులో చనిపోయిరి.

జూలై 15 తేదీని సుమారు 19,000 అడుగుల యెత్తుననున్న హాంగ్సులా పాస్‌కు వచ్చితిమి. అక్కడ భయంకరమైన చలిచేత చచ్చిపడియున్న ముగ్గురు మనుష్యుల శవములు చూచితిమి. ఇంత యెత్తైన ప్రదేశములో ఊపిరించుటే కష్టముగానుండెను. మా తలలో ఊపిరితిత్తులలోను బహు బాధగానుండెను. మా గుండె కొట్టుకొనుట మాకు వినిపించెను. ఇక్కడ మంచుగడ్డ పర్వతములో అనేకమంది తమ ప్రాణములు పోగొట్టుకొనిరి. వారి శరీరములు నేటికిని దొరకలేదు. ఈ భయంకరమైనచోట మమ్మును సురక్షితముగా కాపాడిన దేవునికి స్తోత్రములు చెల్లించుచున్నాము.

జూలై 16-వ తేదీని మద్ అను గ్రామము చేరితిమి. ఆ యూరిపెద్ద మమ్మును దయతో చేర్చుకొని, హిందూస్తానీ తెలిసిన లామాను మాతో భోజనమునకు పిలిచెను. అప్పుడు మేము వాక్యము బోధించితిమి. తాను బహు జాగ్రత్తగా వినుటయేకాక, యితరులనుకూడ వినునట్లు చేసెను. మరునాడు తాలింగు, సంగ్నం వెళ్లితిమి. అక్కడినుండి ఇనాంబు, క్వెలింగు, కురింగు. సాలింగు మీదుగా సిడెంగు, సారా, కోజె, రంగ్రిగు వెళ్లితిమి. ప్రతిచోటను బోధించితిమి.

అక్కడినుండి కూగంరాకు వెళ్లితిమి. అక్కడ 400 మంది లామాలు ఒక పెద్ద దేవాలయము ప్రక్కనున్న కట్టడములో నివసించుచుండిరి. వారిలో పెద్దలామా లహాసా పట్టణమునుండి పంపబడినవాడు. ఇతడు

లామాటాషీద్వారా నియమింపబడిన పెద్దలామా. ఇతనితో రెండు దినము లుంటిమి. మాకు కొంత తొందరకలిగించినను మతమునుగూర్చి మాతో వాదముచేయుటకు బహు అభిలాష కలిగియుండెను.

## నదులవలననైన ఆపదలలో

టిబెట్టులో ఒక విధమైన అపాయముకాదు, అనేక విధములైన కష్టము లున్నవి. అక్కడ రోడ్లు లేవు; అనేకమైన వాగులు, నదులున్నను వాటిని దాటుటకు వంతెనలు లేవు. వాటిలోని నీరు మంచుగడ్డవలె చల్లగా నుండును. నీళ్లు లోతులేనిచోట మేము ఈద గలిగితిమి. కాని కొన్నిచోట్ల నది బహు వడిగా పారుచున్నందునను, నదిలో బండలున్నందునను ఈదుట అసాధ్య మయ్యెను. ఒక నాడు మొరాంగునదిలో ఈదుచుండగా నీళ్లు బహు చల్లగా నున్నందున నా దేహము బిగిసికొనిపోయెను. తొనియాట్‌లో మూడుసార్లు నీళ్లక్రిందికిపోయి, బహు కష్టముతో ఒడ్డు చేరితిని. ఆ నదిలో అనేకమంది మునిగి తిరిగి లేవలేకపోయిరి.

టిబెట్టులో ఆహారము దొరుకుట మరియొక కష్టము. అనేకచోట్ల సొంప లేక సాత్తు అనగా (వేపిన యవలపిండి), ఉప్పు వెన్నకలిపిన ఒక విధమైన తేనీళ్లు తప్ప తినుటకుగాని త్రాగుటకుగాని యేమియు దొరకదు. ఈ వేపిన యవలు మన దేశములో గుఱ్ఱములుగాని గాడిదెలుగాని తినలేనంత అసహ్యముగా నుండును. ఈ కష్టములన్నిటిలో నిది క్రీస్తు ప్రభువుయొక్క సిలువ, ఆత్మల రక్షణకొరకు అవశ్యమనిన తలంపు గొప్ప ఆదరణగానుండెను. నాకొరకు క్రీస్తు పరలోకమహిమను విడిచివచ్చి సిలువ భారమును మోసి కొనెను. గనుక నేను ఇండియాదేశమును విడిచి ఆయనకొరకు ఆత్మలను సంపాదించుటకు టిబెట్టుకు వచ్చుట గొప్ప సంగతి కాదు; నేను రాకుంటే అది భయంకరమైన పాతకమగును. ఎందుకనిన అది దైవాజ్ఞ.

## బట్టలు ఉతుకుట యను పాపము

టిబెట్టులో ఇండ్లు బహు చిన్నవిగాను, బహు మురికిగా నుండును: అవి రాళ్లతోను మట్టితోను కట్టబడును. ఆ జనుల వాసన సహింప శక్యము కాకుండును. లారా అనే గ్రామములో ఒక మనుష్యుడు మురికిచేత నల్లగా నుండుట చూచితిని. వాడు కనీసము పదియేనేండ్లక్రిందట స్నానముచేసి

యుండును. ఆ జనుల బట్టలు తెల్లని ఉన్నితో చేయబడినను వాటి నెప్పుడు ఉతుకనందున నల్లని తోళ్లువలెనుండెను. కీవారను గ్రామములో ఒక యేటిలో మా బట్టలు ఉతుకుచుంటిమి. అప్పుడా గ్రామస్థులందరు మమ్మును చూడవచ్చిరి. మేమట్టి పనిచేయుట వారి కాశ్చర్యముగా నుండెను. వారిలో ముఖ్యుడైన లామా: 'పాపులైన మనుష్యులు తమ బట్టలు ఉతుకుకొనుట సరియే కాని మంచివారు ఉతుకుకొనుట బహు చెడ్డదనెను.'

ఈ ప్రయాణములో చాలాకష్టము కలిగినను, అది యితర సమయము లలోకంటె తక్కువయే. కొన్ని స్థలములలోని లామాలు మమ్ము దయతో చేర్చుకొని ఉప్పుకలిపిన తేనీళ్లును, వేపిన యవలపిండి యిచ్చిరి. ఒకనాడు నా వెంట్రుకలు పొడుగుగా యెదిగినందున నాకు కష్టముగానుండుట చూచి నలుగురు లామాలు కత్తెరలేనందున గొర్రెబొచ్చు కత్తిరించే పనిముట్టు తెచ్చి దానితో నా వెంట్రుకలు కత్తిరించిరి.

## దొంగలవలననైన ఆపదలలో

కీవారునుండి చీకాను, స్పైటి, హాన్సె, సాసారె, పాంగ్ర మొదలైన చోట్లకు వెళ్లితిమి. అక్కడ సువార్త ప్రకటించుటకు మంచి సమయము దొరికెను గాని ఉండుటకు స్థలము దొరకలేదు; దొంగలవలని భయ మధికముగ నుండెను. వారిలో నొకడు, మీరీదారిని తుపాకిగాని కత్తిగాని లేకుండ వెళ్లలేరు. అనేకమంది చంపబడిరని చెప్పెను. అందుకు నేను, నా యొద్ద ఒక కంబళి దేవుని ఖడ్గమైన బైబిలుమాత్రమే యున్నవి. జీవాధిపతి నాతో నున్నాడు; ఆయన నన్ను కాపాడునని ప్రత్యుత్తరమిచ్చితిని. దేవునికే స్తోత్రము, మేమా భయంకరమైన ప్రదేశమందు హంతకులకు బోధించుచు ఆయన పనిచేయుచు పోతిమి; మా కేవిధమైన తొందర కలుగలేదు. ఇచ్చోట దొంగలచేత కాళ్లు విరువబడినవారున్నారు; కాని దేవుడు తన మహాశక్తిచేత మమ్మును సురక్షితముగా నడిపించెను.

## టిబెట్టులో మతాచారములు

టిబెటీయులు బహు మురికివారును అజ్ఞానులైనను ఎంతో భక్తిగలవారు. కొన్ని జిల్లాలలో పెద్దకుమారుడు ఆస్తిని సంరక్షించుటకు ఇంట నుండును. తక్కిన కుమాళ్లు లామాలు, అనగా గురువులగుట మామూలు. వారి వేద గ్రంథములు ఖంగిర్యూర్, తంగిర్యూర్ అని 108 గ్రంథములున్నవి. వీటి

లోనుండి కొన్ని 'వచనములు కాగితముమీదగాని గుడ్డమీదగాని వ్రాసి, వాటిని తమ యింటి కప్పుమీద వ్రేలాడకట్టుదురు. మరియు వారు ఓమ్ మనె పద్మెహుమ్ అను మాటలు అనేక పర్యాయములు ఒక కాగితముమీద వ్రాసి అవి ఒక యిత్తడి చక్రములో పెట్టి త్రిప్పుచుందురు. కొందరు వాటిని నీటియంత్రములకు అంటించుదురు. మరికొందరు ఆ మాటలు రాతి మీద వ్రాసి దానిచుట్టు తిరుగుదురు. ఇట్లు చేయుటవల్ల తమ పాపములు క్షమించబడి మేలు పొందుదుమని వారు నమ్ముదురు.

సత్యదేవుని గూర్చి ఆ జనులెరుగరు; కాని వారును ఒక విధమైన త్రిత్వమును నమ్ముదురు. సంగికుంచెక్ లేక బుద్ధదేవుడు; లామాకుంచెక్ లేక గురుదేవుడు, ఘోకుంచెక్ లేక వేదము దేవుడు. బౌద్ధమతము టిబెట్టులోకి క్రీ. శ. 629-వ సం॥ లో పాంగ్‌తయిన్గ్ సుగన్పో రాజు కాలములో వచ్చెను; లామాల మతము క్రీ. శ. 749-వ సం॥ లో లహాసా పట్టణములో మొదటి మఠమును ఆరంభించిన పద్మసాంభేవ్ వలన స్థాపించ బడెను.

క్రీ. శ. 1640-వ సం॥ లో మంగోలియారాజు గుసారిఖాన్ టిబెట్టును జయించి, డ్రేపంగు మఠాధిపతియైన పెద్దలామాకు దాలాయి, లేక, ఓక్యాన్ అను బిరుదుతో టిబెట్టు స్వాధీనపరచెను. అప్పుడతడు మొదటి రాజైన గురువయ్యెను. అతడే దాలాయిలామా అనిపించుకొనును. అతని పేరు మగ్వాన్‌లోబాంగు. అతడే రాచకీయపరిపాలన మఠాధిపత్యము ఏకము చేయవలెనను ఉద్దేశముతో టిబెట్టుకు దేవతయగు చెన్‌రెజింగు అవలోకితీశ్వరుని అవతారము తానేనని ప్రకటించెను. టిబెటీయులు అంత గొప్ప దైవముయొక్క అవతారమైనవాడు తమను పాలించుచున్నాడని సంతోషించిరి. గనుక ఆ ఉపాయము పనికివచ్చెను; కాని ఒక విధముగా తనపై లామాయైన ట్రోషీ షుంపోకు కోపము పుట్టింపకుండుటకు ఆ లామా అమితభ యను మరియొక దైవముయొక్క అవతారమని ప్రకటించెను. ఈ విధముగ దలాయి లామా అవలోకితీశ్వరావతారమని, టాషీలామా అంతకంటె పై దైవముయొక్క అవతారమని తెలియబడెను. కాని యీ దైవము ఇహసంబంధమైన కార్యములలో జోక్యము పుచ్చుకొననివాడు గనుక ఆత్మీయముగా తన కుమారుడైన అవలోకితీశ్వరుని అంశయైన దలాయిలామాకు ఆ జోక్యము విడువబడినది.

## టిబెట్టులోని సన్యాసులు

వీరి జీవితము బహు విచిత్రమైనది. కొందరు మాసముల తరబడి, కొందరు సంవత్సరములతరబడి, మరికొందరు జీవితకాలమంత చీకటికొట్లో కూర్చుందురు. వారు సూర్యుని వెలుగు చూడకుండా తలుపులు మూసికొని చీకటిలో కూర్చుండి సమాధిలోనున్నట్టు ప్రార్థన చక్రము త్రిప్పుకొనుచుందురు. ఈ చిన్నగదులకు ఒక చిన్నరంధ్రముండును. దానిలోనుంచి కొంత ఆహారము ఈ సన్యాసులకు జనులు అందించుదురు. వీరితో సంభాషింపవలెనని ప్రయత్నించితినిగాని సాధ్యపడలేదు. వారెప్పుడైనను బయటికివచ్చినప్పుడు చదువుకొనుటకు దేవుని గ్రంథభాగములను మాత్రము ఆ సందులో నుండి పడవైచితిని.

వీరియొద్ద ఒక నీతి నేర్చుకొంటిని. వీరు రాబోవు బ్రతుకులో ఆనందముగాని నిరీక్షణగాని లేని నిర్వాణము సంపాదించుకొనుటకు తమ యాశలను, జీవమును, చంపుకొనవలెనని యింత శ్రమ ననుభవించితే, మనకు సమస్తమును దయచేయు క్రీస్తు ప్రభువుయొక్క ఉన్నతమైన సేవకొరకు, నిత్య జీవముయొక్క ఆనందముకొరకు సిలువను మనము ఎంతో సంతోషముతో నెత్తుకొనవలెనుగదా?

ఈ దేశములో మంచుచేతను ఎంతో చలిగానుండుటచేతను మేనెలలో విత్తనములు విత్తి సెప్టెంబరు నెలలో కోతకోయుదురు. కొన్ని స్థలములలో గోధుమలు, ఆవాలు, పండింతురు. అడవి ప్రదేశములలో చక్కని పువ్వులు పూయును; అడవి ఉల్లిపాయలు, ఉలవలు, కొన్నిచోట్ల కనిపించును. కాని అయ్యో! నానా విధములైన దుర్వాడుకలు ఘోరమైన దుష్టత్వము వ్యాపించియుండును. వాటినిగూర్చి యిక్కడ ఉదాహరించుటకూడా తగదు.

## అనేక ప్రయాణములలో

అనేకమైన యితర స్థలములకు వెళ్లి ప్రజలమధ్య పనిచేసి, మరియొక దారిని క్యామె, హోల్, మాలింగు, ఖురక్, సస్లింగ్, ఫీతి, బొల్దార్ మీదుగ తిరిగివచ్చితిమి. కైలాసమునకు రాపారుకు ఒంటరిగ వెళ్లవలెనని యుంటిని గాని, యీ సంవత్సరము టిబెట్టుకు నా ప్రయాణము ఆలస్యమయ్యెను. జూలై 30 నుండి ఆగస్టు 9 వరకు ఆ వైపు పర్వతములమీద మంచుగడ్డ కట్టుకొని

యుండును. అక్కడనున్న అనేకమైన నదులును ఏర్లును, గడ్డ కట్టుకొని యున్నందున వంతెనలమీదపోయినట్టు వాటిమీద పోవచ్చును. కాని మరి కొన్నిటిమీద వంతెనలుండవు; వాటిలో యీదుట బహు అపాయకరము. గనుక మరియొక మార్గము లేనందున తిరిగి పోవలసివచ్చెను. వచ్చే యేప్రిల్ నెలలో నేను ప్రతిచోటికి వెళ్లగలుగునట్లు దేవుడనుగ్రహించును గాక. నేను సెప్టెంబరు నెలవరకుండినయెడల అక్కడి మంచు అధికమై అక్టోబరు నెలలో నేను తిరిగి యిండియాకు వచ్చుట అసాధ్యమైపోవును.

## రాబోవు కోతకు ప్రథమ ఫలము

ఈ సారి నేను నలుబదియెనిమిది మజిలీలలో టిబెట్టు చేరితిని. దిన మునకు సుమారు పదిమైళ్లు నడిచితిని. నేను చూచిన ప్రతి స్థలమునుగూర్చి చెప్పవలెనని యున్నదిగాని యింతకంటె నధికముగ వ్రాయుట కిప్పుడు సమయము చాలదు. టిబెట్టులోనున్న క్రైస్తవులు నేను కనుగొనినంతవరకు దేవుని కృపవల్ల బాగుగనున్నారు. త్సెరింగను గ్రామములో హిందూస్తాని తెలిసిన ఒక చిన్నవాడున్నాడు. అతడు నాతోకూడా ఇండియాకు రావలె నని బహుగా కోరెను, గాని వాని తల్లి రానియ్యలేదు. మరియొక సంవత్సర ములో అతడు నాతో వచ్చి బాగుగా తరబీతుపొంది టిబెట్టులో తన జను లకు మంచి బోధకుడగునని నమ్ముచున్నాను. అప్పుడు మేము ఈ ప్రయాణ ములో విత్తిన దేవుని వాక్యమనే విత్తనము ఆయన కృపవల్ల మొలిచి ఆయన కాలమందు బహుగా ఫలించునని నమ్ముచున్నాను. ఆమేన్.

సాధు సుందరసింగు.

# 9. అధ్యాయము

## సుందరునియొక్క గుణలక్షణములు

### జ్ఞానయోగము

ఇహలోక సౌఖ్యసంపదలే ముఖ్యమని ఎంచుకొను ఈ కాలమందు వాటినన్నిటిని పరిత్యజించిన విరాగియైన సాధు సుందరసింగుయొక్క జీవితము మనకు ఎంతో విచిత్రముగను సుబోధను గలుపునదిగను ఉండకమానదు. ఈయన క్రీస్తు జీవితమునుగూర్చి నూతన నిబంధనలో చెప్పియున్నదంతయు జాగ్రత్తగా చదువుకొని, అన్ని విషయములలోను ఆయన దృష్టాంతమును అనుసరించుటవలన సాధారణ క్రైస్తవులకు లభించని ఉన్నతమైన ఆత్మీయస్థితి సుందరునికి కలిగెను.

కేవలము యాచకునివలె చేతిలో ద్రవ్యమేమియు లేకుండ హిందూ దేశముయొక్క నానా దిశలయందు తిరుగుచుండుటచేత సుందరునికి తన పరమతండ్రి అన్ని విషయములలో సహాయము చేయువాడని తెలిసికొనుటకు పదేపదే వీలుకలిగినది. ఇతరులు అనుదినము తమకు కలుగు మేలుల నిమిత్తము తరుచుగా దేవుని స్తుతించుదురు; కాని, సాధువు విశేషమైన అవసరములలో విశేషమైన సహాయము కలిగినందుకు దేవుని స్తుతించుచుండును. ఆయన ఆత్మీయమైన దుఃఖసాగరములో మునిగియున్న దినములు కలవు. అటువలెనే దేవునియందు సంతోషించి ఆనందబాష్పములు కార్చిన దినములును కలవు. అనేక రాత్రులు ప్రార్థనయందు గడిపి, పిమ్మట అనేక దినములు ప్రభువు సేవయందు పాటుపడును. ప్రార్థన పూర్వకముగా నూతననిబంధనను పఠించి, క్రీస్తు ప్రభువుతో అన్యోన్యసహవాసము చేయుచు, కాలము గడపును. నశించిన ఆత్మలను రక్షింపవలెనను అభిలాషచే తన సేవయందు విశ్రాంతిలేకుండ పాటుపడుచున్నను, తన రక్షకుని యెడల ఆయనకుండు విశేషమైన భక్తి ప్రేమలచే ఆయన హృదయము సమాధానముతో నిండినదై, ఆయన ముఖము ప్రకాశించుచుండును. ఆయనకు పంచేంద్రియములచే గ్రహించకలిగిన ఇహసంబంధమైన సంగతులకంటె ఆత్మీయమైన సంగతులే బహు ముఖ్యమైనవి. మనుష్యుల తోడుకంటె

దూతల సహాయమే ఎక్కువగ నెంచుకొని ఆయన జీవించుచున్నాడు. గొప్ప విపత్తులలోనుండి తన దాసులను తప్పించుటకు తన దూతలను పంపునని సుందరుని సిద్ధాంతము. అనేక పర్యాయములు తాను నిరీక్షించని రీతిగా దేవుడు ఈయనను ఆపదలలోనుండి విడిపించినందున, ప్రతి మనుష్యుని ఆపద సమయమందు కాపాడుటకు తన దూతలను పంపునని ఈయన నమ్ముచున్నాడు. పుట్టుక, చావు, మరణానంతరము రాబోవు స్థితి, ఈ మర్మములు సుందరునికి భయమునుగాని సందేహమునుగాని కలిగించుటలేదు. ఈ మర్మమైన సంగతులనుగూర్చి ఇతరుల మనస్సును ఈయన కలవరపఱచుటలేదు. కాని, వీటినిగూర్చి యీయన మనస్సులో తృప్తికరమైన తాత్పర్యము లుండుటచేత ఈయన ఎంతో సమాధానము కలిగియున్నాడు.

సుందరుని జీవితములో జరిగిన అద్భుతమైన సంగతులను ఈయన ఆయా ప్రదేశములకు వెళ్లకముందే అక్కడి జనులు వినియుండిరి. కొందరు వీటిని కల్పితములని సుందరునిగూర్చి తప్పు అభిప్రాయము కలిగియుండిరి; మరి కొందరు ఈయన అద్భుతములు చేయువాడని, దర్శనములు చూచిన వాడని తలంచిరి. కాని యీ రెండు తరగతులవారును సుందరుని చూచినప్పుడు, ఈయన మోషభక్తిలేని స్వస్థచిత్తుడని, ఈయన సిద్ధాంతములు అంగీకరింప తగినవని గ్రహించిరి.

తాను అద్భుతముగ ఆపదలలోనుండి విడిపింపబడిన సంగతులు సుందరుడు వివరించునప్పుడు అవి కల్పితములైనట్లు వినువారికి కనుపింపవు, కాని అవి అపొస్తలులు ఉపద్రవములలో విడిపింపబడినట్లు సుందరుడును దేవుని శక్తిచేత విశేషమైనరీతిగా విడిపింపబడినట్లు అపొస్తలుల కార్యముల గ్రంథములోని సంగతులవలె కనుపించును. వీటిని వివరించునపుడు సాధు సుందరసింగు దేవుడు ఇతరవిధముగ తనను ఉపద్రవములలోనుండి తప్పించుటకు వీలులేనప్పుడు తన హస్తమును చాపిసహాయము చేయుచుండెనని చెప్పును. లేనియెడల టిబెట్టు నేపాళము మొదలైన ప్రదేశములలో తనకు సంభవించిన ఉపద్రవములను తప్పించుకొని ఇంతకాలము ఆయన క్రీస్తు సువార్తను ప్రకటింపలేకపోవును.

నేపాళములో కాంఛ్జియను గ్రామములో బోధించుచుండగ, ఆ యూరి జనులు సుందరునిమీద కోపగించి, ఆయనను పట్టుకొని ఒక కంబళిలో చుట్టి ఊరి వెలపలికి త్రోసివేసిరి. దీనినిచూచి ఆ దారిని పోవుచున్న ఒక ప్రయాణికుడు కనికరించి కట్లువిప్పి ఆయనను విడిచిపెట్టెను. మరునాడు సుంద

రుడు తిరిగి గ్రామములో ప్రవేశించి ఎప్పటివలె బోధించుచుండెను. అప్పుడు గ్రామస్థులు ఎంతో కోపము తెచ్చుకొని, ఆయన చేతులను కాళ్లను ఒక చెట్టుకుకట్టి విడిచిపెట్టిరి. సాయంత్రమగువరకు ఆకలిబాధచే, చేతికందినను నోటికందలేదన్నట్లు, ఆ చెట్టుమీది పండ్లవైపుచూచెనుగాని అవి ఆయనకు దొరకలేదు. ఆ స్థితిలో ఆయాస మధికమై నిలుచుండియే ఆయన నిద్రించెను. ఉదయమున ఆయన నిద్రమేల్కొనినప్పుడు, తన కట్లన్నియు విప్పబడి క్రిందపండుకొని యుండెను. తన సమీపమందు కొన్ని పండ్లు పడి యుండెను. ఆయనలేచి కూర్చుండి క్రీస్తుకొరకు శ్రమల ననుభవింపగల భాగ్యము దొరికినందుకు దేవుని స్తుతించి ఆ పండ్లు తిని, ఎరుగనివారికి సువార్తను బోధించుటకు నూతన ధైర్యము కలిగినవాడై బయలుదేరి పోయెను.

మరియొక సమయమందు తేరీ అను గ్రామములోనుండగ, కొందరు మనుష్యులు సమీపమందున్న మరియొక గ్రామస్థులు సువార్త వినగోరుచున్నారని సుందరునితో చెప్పిరి. వారు చెప్పినదారిని అరణ్యములోగుండ బహుదూరము నడిచినను ఆ గ్రామము కనుపించలేదు. పొదలు చుట్టును క్రిక్కిరిసియున్నందున తాను అడవిలో మార్గము తప్పితినని గ్రహించెను. అప్పుడొక ఏటియొడ్డుకు చేరి దానిని దాటినయెడల మార్గము తెలియునని నిశ్చయించి దానిలో కాలుపెట్టగా ప్రవాహము బహు వడిగానున్నట్లు తెలిసికొనెను. దానిని దాటలేక చీకటిపడుచున్నందున ఏమియు తోచక మనస్సు క్రుంగి ఏటి ఒడ్డున కూర్చుండెను. అడవిలోనుండి భయంకరమైన ధ్వనులు వినబడుచుండెను. అంధకారము హెచ్చుగా త్వరలోనే అడవిమృగములు మేతకొరకు బయలుదేరెనని తనకు ప్రాణహాని కలుగవచ్చునని భయపడుచుండెను.

అప్పుడాయన దేవుని ఆసక్తితో ప్రార్థించి నదియొక్క ఆవలి దిక్కున చూడగా చీకటిలో ఒక మనుష్యుడు కనుపించెను. 'ఇదిగో నీ సహాయము కొరకు నేను వచ్చుచున్నాను. భయపడకుము' అని ఒక శబ్దము వినిపించెను. అప్పుడామనుష్యుడు నీళ్లలోదుమికి ఈదుకొనివచ్చి సాధువును తన వీపు మీద నెక్కించుకొని అద్దరికి ఈదుకొనిపోయెను. ఒడ్డు చేరగానే అక్కడ నిప్పుమంట కనుపించెను. సుందరుడు తడిసిన తనబట్టలను ఆరబెట్టుకొన సాగెను. ఇంతలో ఆ పురుషుడు అంతర్ధానమాయెను. ఈ విధముగ తనకు తెలియని అద్భుతమైనరీతిని తన పరమతండ్రి పంపిన సహాయము నిమిత్తము ఆయనను స్తుతించెను.

సుందరునికి ఈ విధముగ అనేక పర్యాయములు సంభవించెను. ఇంకను మరియొక సంగతిమాత్రమే ఇక్కడ చెప్పెదము. ఈయన కామ్యాను అను గ్రామములో బోధించుచుండెను. ఆ గ్రామస్థులు అతి ద్వేషముతో ఆయనకు ఏమియూ సహాయముచేయకుండ తరిమివేసిరి. ఆకలితోను, అలసటతోను ఆ రాత్రి అరణ్యములో నుండవలసివచ్చెను. ఒక చెట్టుక్రింద దిక్కుమాలినవాడుగ పరుండి బడలికచేత త్వరలోనే నిద్రపోయెను. అర్ధరాత్రివేళ తనను ఎవరోతాకి, 'లేచి భుజించుమ'ని చెప్పినట్టు తోచెను. ఆయన లేచి చూడగ, ఇద్దరు మనుష్యులు ఆహారమును నీళ్లును పట్టుకొని ముందర నిలువబడినట్టు కనుపించెను. గ్రామస్థులు కొందరు తనను కనికరించిరని తలంచి, వారు తెచ్చిన ఆహారము పుచ్చుకొనెను. తన ఆకలి తీరినతర్వాత వారితో సంభాషించవలెనని తిరిగి చూడగ అక్కడ ఎవరును కనుపించలేదు. వారెట్లు అదృశ్యులైరో ఆయన చెప్పలేకపోయెను. కాని తన యావసరములో దేవుడు దయతో సహాయముచేసెనని ఆయనను తిరిగి స్తుతించెను.

ఈలాగు అద్భుతమైన రీతిని దేవుడు తనను పరామర్శింప గలుగునో లేదోయని సుందరుడు తర్కించుటలేదు. తాను నిరీక్షించనిరీతిగ ఆపదలో నుండి ఒకసారికాదు అనేక పర్యాయములు కాపాడబడినట్లు సుందరునికి నిస్సందేహముగ దెలియును. ఇదెట్లు సంభవించెనని సుందరుని అడిగిన యెడల, 'దేవుడే తన హస్తమును చాచి నన్ను రక్షించెన'ని చెప్పును. మనుష్యులచేతను, దేవదూతలచేతను ప్రేమస్వరూపియైన పరమతండ్రి ఈయనను అనేక ఉపద్రవములనుండి తప్పించెననుటకు సందేహములేదు.

## సాధువుకు సిలువయెడలనున్న ప్రేమ

> నేను క్రీస్తుతోకూడ సిలువవేయబడియున్నాను.........నే నిప్పుడు శరీరమందు జీవించుచున్న జీవనము నన్ను ప్రేమించి నా కొరకు తన్ను తా నప్పగించుకొనిన దేవుని కుమారుని యందలి విశ్వాసమువలన జీవించుచున్నాను. (గలతీ. 2: 20).

> మన ప్రభువైన యేసుక్రీస్తు సిలువయందు తప్ప మరి దేనియందును అతిశయించుట నాకు దూరమవునుగాక దానివలన నాకు లోకమును, లోకమునకు నేనును సిలువ వేయబడియున్నాము. (గలతీ. 6: 14.)

సాధు సుందరసింగుయొక్క ప్రసంగముల ముఖ్యాంశము క్రీస్తు ప్రభువును గూర్చియే. తన ప్రసంగములను వినువారందరి ముందరను క్రీస్తు సిలువనే ఎత్తిమాపి వారిని దానితట్టే ఆకర్షింప ప్రయత్నించును. ఏమనిన,

తన యనుభవములో దానియొక్క శక్తిని గ్రహించినవాడు గనుక ఇతరులను సంపూర్ణముగ రక్షించుటకు దానికి శక్తికలదని చెప్పగలడు. ఆయన తఱచుగ తన స్వానుభవమునే ఎత్తి ఇట్లు చెప్పను. సిలువను మోయువారిని, సిలువ మోసికొనిపోయి రక్షకుని పరమ సన్నిధిని చేర్చునని నేను ధైర్యముగ చెప్పగలను.

సిలువనుగూర్చి తగినట్టుగ వివరించి చెప్పిన ఒక మిషనెరీతో అది వినుచుండిన ఒక మహమ్మదీయుడు: 'సిలువను గూర్చి చరిత్ర నాతో మీరు చెప్పినట్టు ఈ దేశస్థులందరికి చెప్పినయెడల వారు తప్పకుండ అంగీకరింతురు' అని చెప్పెను. అటువలెనే సాధువు హిందూదేశస్థుల ఆత్మ దాహమును గ్రహించి, యేసుప్రభువును, ఆయన సిలువయునుమాత్రమే దానిని సంతృప్తి పరచగలుగునని ఎంచుచున్నాడు. ఈ రక్షణమార్గమును నూతన నిబంధనలో నున్నట్టు ఆయన వివరించును. మరియు ఆయన జీవితములో కనుపించు స్వార్థత్యాగము ఆయన బోధను బలపఱచుచున్నది. ఈయన ముఖమందు కనుపించు ఆనందము ఈయన బోధలో రక్షకునిగూర్చి చెప్పెడి సంగతులు తన స్వానుభవములో గ్రహించిన సత్యములే నని వినువారికి స్పష్టపరచు చున్నది. సిలువను మోయుటనగా నీతి నిమిత్తము పలువిధములైన శ్రమల ననుభవించుటయే; గనుక సాధువు తన రక్షకునివలె శ్రమల ననుభవించుటే తన పనిగా చేసికొనియున్నాడు. సుందరుడు తన జీవితముయొక్క ఉద్దేశమును తెలుపుచు ఒక శ్లోకమును వ్రాసెను. దాని భావమేమనిన: నేను లోకమునకు వెలుగైయున్నానని చెప్పిన పరమపురుషునిగూర్చి ధ్యానించుట వలన కలిగిన ఆనంద ప్రవాహములో నాకు కలుగు శ్రమలన్నియు కొట్టుకొని పోవుచున్నవి.

జపానులో ఒక మిషనెరీ సుందరునిచూచి మీరు మునుపటివలె ఇప్పుడును హిందూదేశములో ప్రయాణము చేయునపుడు తినుటకు అన్నమును ఉండుటకు చోటును లేకుండ కష్టపడుచున్నారాయని అడిగెను. అందుకాయన లేదు, లేదు! ఇప్పుడిండియాలో అందరు నన్నెరుగుదురు. నేనెక్కడికి వెళ్లినను నా ప్రసంగములు వినుటకు వేలాది జనులు గొప్ప ఆలయములలో కూడుదురు. సిలువమోయు విధమది కాదు. దానికొరకు నేను టిబెట్టుకు పోవలెనని చెప్పగా ఆ మిషనెరీ ఎంతో ఆశ్చర్యపడెను.

తిరువనంతపురములో వేలాది జనులు కూడుకొని ఆయనను గౌరవపరచి పొగడుచుండగ, అక్కడ తనకంతయు బహు సౌఖ్యముగ నున్నద

నియు తన పరమ యజమానునికొరకు తగినంతశ్రమ ననుభవించుటలేదని సుంద రసింగు విచారపడెను. కాని అటుపిమ్మట పడవలమీదను, ఎడ్లబండ్లమీదను ఒక చోటినుండి మరియొక చోటికి ప్రయాణచేసి, విశ్రమించుటకు కాలము లేకుండ ఊరు చేరగానే దక్షిణదేశములో ఎండకాలమందు చెమటలు కారు చుండగ ప్రసంగింపవలసివచ్చినప్పుడు, ఆయన తాత్పర్యము మారియుండును. చిన్నప్పటినుండి వేసవికాలము హిమాలయ పర్వతములలో గడపుట అభ్యాస పడినవారికి ఎండకాలమందు దక్షిణ ఇండియాలో ఉండుట బహు కష్టముగా నుండును. దీనినిగూర్చి మాటలాడుచున్నప్పుడు ఆయన తన స్నేహితులతో 'అది దేవుని చిత్తము'ని మాత్రము చెప్పెను.

ఇలోమ్ అనుచోట చెరసాలలోని నరకవేదన సహించుచున్నప్పుడు తన నూతన నిబంధనలో పై పుటమీద ఈ మాటలు వ్రాసెను: '1914-వ సంవత్స రమున జూలై నెల 7-వ తేది క్రీస్తు సన్నిధి నా చెరసాలను మోక్షముగా మార్చి వేసినది; మోక్షములో ఈ దివ్యసన్నిధి ఎట్టి భాగ్యమును కలిగించునో!' పూర్వము పౌలు, సీలయు, తాము బంధింపబడిన చెరసాలలో క్రీస్తు ప్రభు వును కలిసికొని ఆనందించిన రీతిగానే, సుందరుడును తన పరమ యజమానుని చెరసాలలో కలిసికొని యానందించెను. క్రీస్తు సన్నిధిలేకుండ మోక్షములో నుండుటకంటె క్రీస్తుతోకూడ నరకములో నుండుటే మేలని సుందరు డెంచెను.

క్రీస్తు తాత్కాలిక సహాయుడుగ తనతోకూడ నెల్లప్పుడున్నాడని నమ్మిన సుందరునికి ఈ క్రింద చెప్పబడిన సంగతి ఆశ్చర్యము కలిగించలేదు. ఆయన టిబెట్టులో కారారణ్యమైన ప్రదేశములోనున్న ఒక గ్రామము చేరెను. ఆ యూరి వారు ఈయనను ద్వేషించి ఊరిలోనికి రానియ్యనందున, ఊరిబైటనున్న ఒక గుహలో ఆ రాత్రిగడపుటకు ప్రవేశించెను. ఆయన అక్కడికి వెళ్లిన కొంతసేపటికి, రాళ్లను కర్రలను తీసికొని కోపావేశముతో కొందరు మనుష్యులు వచ్చుచుండుట చూచి, తన అంతము సమీపించినదని యెంచి, దేవునికి తన యాత్మను అప్పగించుకొనెను. ఆయనను కొట్టి చంపు టకు ఆ గుహ సమీపమునకు వచ్చిన జనులు అకస్మాత్తుగ నిలువబడి, ఒకరితో నొకరు గుసగుసలాడుకొన మొదలుబెట్టిరి. పిమ్మట వారు సాధువు దగ్గరకు వచ్చి 'నీ చుట్టును ప్రకాశమానమైన వస్త్రములు ధరించుకొని నిలుచున్న మనుష్యులెవరు!' అని అడిగిరి. నా చుట్టును ఎవరును లేరని సుందరుడు చెప్పెను. కాని వారు గుహచుట్టును ధగధగ మెరయుచున్న పురుషసైన్యము

మేము చూచితిమని ఎంతో దిగులుతో చెప్పి, ఆయనను తమ ఇంటికి రమ్మని బతి మాలుకొనిరి. సుందరుడు వారితో వెళ్లి వారికి క్రీస్తుప్రభువునుగూర్చి బోధించెను. అప్పుడు ఆయన మాటలు భయభక్తులతో అంగీకరించిరి. అప్పుడు సాధువు దేవుడు తన దూతలనంపి, ఆపదనుంచి తనను కాపాడి, ఆ ప్రజలకు సువార్త బోధించుటకు మార్గము తెరచెనని గ్రహించెను.

'నాకు శక్తియున్న కాలమందు తన దివ్యమైన సేవ చేయుటకు బాల్యమందే ఆరోగ్యుడనైన నన్ను ఏర్పరచుకొనిన నా ప్రభువును స్తుతించుచున్నాను. నేను బాప్తిస్మము పొందకముందునుండి దేవుడు తన దివ్యచిత్తమును తన దాసునికి బైలుపరచి, నన్ను తిన్నని మార్గమందు నడిపించుమని ప్రార్థించితిని. నా మొర నాలకించి, నేనేమార్గము సత్యము జీవమునై యున్నానని సెలవిచ్చిన నా ప్రియ రక్షకుడు నన్ను పిలిచి, తన పరిశుద్ధ నామమును ప్రకటించుటకు ఒక సాధువుగ సంచరించుమని సెలవిచ్చెను. ఆకలి, దాహము, చలి, ఎండ, చెరసాల, దూషణ, హింసలు మొదలైన లెక్కలేని శ్రమలు నే ననుభవించినను, ఆయన కృపవల్ల నా హృదయము సంతోషముతో నిండియున్నందుకై ఆయన పరిశుద్ధ నామమును స్తుతించుచున్నాను. గడచిన పదేండ్లలో నాకు కలిగిన అనుభవమునుబట్టి, సిలువను మనఃపూర్వకముగ ఒకడు మోసికొనినయెడల, ఆ సిలువయే ఆత్మీయానందము కలిగించుచు వానిని మోయునని నిస్సందేహముగ చెప్పగలన'ని సుందరుడు కొన్నేండ్ల క్రిందట వ్రాసెను. నేటికిని ఆయన సిద్ధాంతమిదే. దేవుడు తనను ఇంకను కొంతకాలము లోకములోనుంచి తన దేహము, మనస్సు పరిపూర్ణమగునట్టి నడివయస్సునందలి బలముతో తన ప్రభువు సేవనుచేయు ధన్యత కలుగజేయునని సుందరుడు నమ్ముచున్నాడు.

## సువార్త ప్రకటించుటకు పిలువబడుట

సువార్త ప్రకటించుటకే, క్రీస్తు నన్ను పంపెను (1 కొరింథీ 1: 17).

క్రీస్తు సువార్తను, పూర్ణముగా ప్రకటించియున్నాను. ఆయననుగూర్చిన సమాచార మెవరికి తెలియచేయబడలేదో, వారు చూతురనియును విననివారు గ్రహింతురనియు, వ్రాయబడిన ప్రకారము క్రీస్తునామ మెరుగనిచోటను సువార్తను ప్రకటింపవలెనని మిక్కిలి యాశగలవాడనై యుండి ఆలాగు ప్రకటించితినని (రోమా 15: 19—21).

కొన్ని ఉపన్యాసములు వ్రాసి అచ్చువేసినప్పుడు ఎక్కువ ప్రభావము గలిగినవిగా కనిపించును కాని, ప్రసంగియొక్క హృదయములోనుండి బయలుదేరిన ప్రసంగ మొకటి, కాగితముమీద చదివినయెడల అది సారము లేనిదిగ కనిపించును. సాధు సుందరసింగు చేసిన ప్రసంగములు ఒక పుస్తకముగ ప్రచురింపబడవలసినదని అనేకులు కోరినందున, అరవములో అటువంటి పుస్తక మొకటి ఇప్పుడు ప్రచురింపబడినది, కాని ఆ ప్రసంగములు చదివినవారు సుందరునియొక్క వాక్చాతుర్యమును, అభినయమును, ఆయన ఆసక్తిని తెలుపు ముఖవికాసమును, గ్రహించునట్లు అవి చేయలేవని చెప్ప నవసరములేదు.

సాధు సుందరసింగు బహు చక్కని ప్రసంగి; అనవసరమైన అలంకారములు వాడక, తాను చెప్పెడి సంగతులు సూటిగాను, స్పష్టముగాను, తెలియునట్లు చేయగల సమర్థుడు. ఆయన అరమనస్సుతో ఏ మాటలును చెప్పడు. ద్వంద్వార్థము గలిగిన పదములను ఉపయోగించడు. ఆయన మాట్లాడుటకు, ఒక సభముందర నిలువబడినపుడు ప్రార్థన ధ్యానములద్వారా తాను దేవునియొద్దనుండి పొందిన వర్తమానమునే తెలుపును. ఆ వర్తమానమును, తన స్పష్టమైన కంఠస్వరముతో చెప్పినప్పుడు ఎంత పెద్దకూటములోనైనను, చివర కూర్చుండినవారికి సహా స్పష్టముగా వినబడును. అది వినువారి మనస్సును పరవశపరచును. ఎంతో వినయముతోను, గాంభీర్యముతోను సుందరుడు తన ఉర్దు నూతన నిబంధనపట్టుకొని ప్రసంగించుటకు నిలువబడినపుడు అత్యావేశముతోను, ఎంతో ఊతముగాను మాట్లాడును. ఈయన నోట నుండి బయలుదేరు ప్రతిమాటయును రత్నములవలె ఎంతో అర్థముగలిగినవైనందువల్ల వినువారి మనస్సులు చెదురుటకు చోటుండదు.

ఉపమానములతోను, తన స్వానుభవములో చూచిన సత్యములతోను, సుందరుడు తాను చెప్పగోరెడుదానిని దృష్టాంతపర్చును. మతమనునది వాదమువలనకాక, అనుభవమువలననే తెలిసికోవలెనని, అన్యులతో మాట్లాడునపుడు, చెప్పుచుండును. ఏ మతవాదులైనను ఈయన ఉపన్యాసమును, వినువారు సుందరుడు చెప్పెడు సంగతులు సత్యమని ఒప్పుకొనక మానరు. నిజమైన క్రైస్తవుల విశ్వాసమును స్థిరపర్చును. అశ్రద్ధగనుండు క్రైస్తవులకు వారి భయంకరమైన స్థితినిచూపి వారిని మేల్కొలుపును, క్రైస్తవులు కానివారు, క్రీస్తునుగూర్చి విచారించుట తమబాధ్యత అవునా కాదా యని ఆయన ప్రసంగములవలన ప్రశ్నించుకొనునట్లు చేయును.

ఇంతకు ఫలితముగా అనేకులు రక్షకుని పాదములయొద్దకు తేబడిరి. ఇహ సంబంధమైన కార్యములలో మగ్నులైనవారికి నిత్యత్వముతో సంబంధించిన ఆత్మీయకార్యములే ముఖ్యమైనవని కనపర్చుటే సుందరుడుచేయు ప్రసంగముల నిజమైన ఉద్దేశము. తమ స్వానుభవమందు క్రీస్తు ప్రభువును, తమ స్నేహితుడైనట్టు కనుగొనినవారును, తమ జీవితమందు క్రీస్తుయొక్క శక్తిని ఎరుగనివారును, క్రైస్తవసభలో అనేకమంది యున్నారు. అటువంటివారికి సుందరుడుచేసిన ప్రసంగములు ఆత్మీయమైన కార్యములలో నూతనజీవము కలిగించినవి. కాని క్రీస్తును నూతనముగా ప్రేమించి విశ్వసింప నారంభించినవారు కొందరు కార్యచింతలలో చిక్కుకొని మొదటి ప్రేమను విడిచిపెట్టిరి. వీరికి కలిగిన దివ్యదర్శనముయొక్క కాంతియు మందగించిపోయెను. కాని సాధు సుందరసింగు తన ప్రభువుతో ఎడతెగని సహవాసము చేసినందున దేవుని ముఖకాంతి ఆయనయందు ప్రసరించుచుండెను. ఆయన కాషాయవస్త్రములు ధరించి ప్రజలముందర నిలువబడి ప్రసంగించినప్పుడు, రక్షకుని శక్తిని, ప్రేమను మరచినవారిని, తిరిగి వాటిని వెంటనే వెదకునట్లు చేయుటకు ఎంతో ప్రోత్సాహమును కలిగించి, బలవంతపర్చును. సచ్చిదానందమూర్తియైన దేవునినుండి తన జీవమును పొందిన సుందరుడు తనను చూచువారికిని, తన మాటలు వినువారికిని ఆ యానందమును కొంతమట్టుకు కలిగించుచున్నాడు. ఆయనవలె వీరును దేవుని హత్తుకొనియుండి, ఆయన పరమానందములో సుఖించునట్లు ప్రయత్నించుటకు ప్రేరేపింపబడుచున్నారు. సుందరసింగును కన్నులారచూచియు, ఆయన బోధను వినియు, తుచ్ఛమైన లోకాశలను జయింపలేని క్రైస్తవులస్థితి అంతకంతకు చెడిపోవునుగదా? ఆయన క్రైస్తవులకు చేసినబోధ ఎంతో బలమైనదని, వారిని ఆత్మీయపు సంగతులలో ఉజ్జీవము కలిగించుటకు తగినదియునైయుండెను.

క్రైస్తవులు కానివారికి ఆయనబోధించినప్పుడు, వారి మతమును ఎన్నడును దూషించడు; వాటినిగూర్చి నిర్దయగా మాట్లాడడు. కాని తాను ఎంతో శ్రద్ధతో దీర్ఘకాలము వెదకినను, సమాధానము, సంతోషము ఆ మతములలో కనుగొనలేకపోయెననియు, క్రీస్తునాథుడొక్కడే తన ఆత్మీయదాహమును తీర్చగలిగెననియు ధైర్యముగా చెప్పును. తత్వజ్ఞానము చేతగాని, తర్కముచేతగాని ప్రజలను వశపరచుకొన ప్రయత్నింప, పాపమునుండి రక్షింపగల దేవుని శక్తినిగూర్చి తన అనుభవ సాక్ష్యము చెప్పుటవల్ల క్రీస్తు పాదారవిందములయొద్దకి వారిని నడిపించును.

దేవుని అమూల్యమైన ప్రేమనుగూర్చియు, ఆ ప్రేమను క్రీస్తు తన జీవితమునందు, మరణమునందు బయలుపర్చుటను గూర్చియు, దాని నంగీకరించువారిని తప్పకుండ రక్షించుటకు ఆ ప్రేమకుగల శక్తినిగూర్చియు, మరి విశేషముగా క్రీస్తు, ఆయన సిలువనుగూర్చియు సుందరుడు ప్రసంగించుచుండును. ఆయన అధికమైన పరిచయముచే ఎరిగిన తన రక్షకునిగూర్చి మాట్లాడుచుండును. తాను పదునారేండ్ల చిన్నవాడుగ నున్నప్పుడు ఆ రక్షకుడు తనకు దర్శనమిచ్చినది మొదలుకొని ఆయనయొక్క శక్తిని తాను ప్రతిదినమున తన అనుభవములో గ్రహించుచున్నాననియు, ఆయన రాత్రింబగళ్లు తనతో నున్నాడనియు, ఆయన స్నేహము ననుభవించుటకై తాను లోకసంబంధమైన వాటినన్నిటిని పరిత్యజించితిననియు తన అనుభవసాక్ష్యము సుందరుడు చెప్పుచుండును. ఆయన ప్రసంగములు వినువారు ఆయన క్రీస్తునుగూర్చి ప్రసంగించుటమాత్రమే కాక, క్రీస్తువలె జీవింప ప్రయత్నించుచున్నవాడని వెంటనే గ్రహించుదురు.

సాధు సుందరసింగుయొక్క ముఖవికాసమే ఆయన ప్రసంగములకు అధికమైనశక్తిని కలిగించుచున్నది. ఒకసారి సుందరుడు ప్రసంగించి ముగించినతోడనే కూర్చుండెను. ఆయన చివరిమాటలను భాషాంతరము చేయుచుండిన ద్విభాషిని ప్రజలు లక్ష్యపెట్టలేదు. వారి కన్నులు కూర్చుండిన సుందరుని ముఖమును వెతుకుచుండెను. గనుక సాధువు ప్రసంగించి వెంటనే కూర్చుండక, ద్విభాషి తర్జుమాచేసి ముగించువరకు నిలుచుకొని యుండును. అప్పుడు ప్రజలు చివరవరకు శ్రద్ధగా విందురు.

'శాంతగుణముగలవాడుగ ప్రసిద్ధిచెంద గోరినవాడు చేయవలసిన మొదటి పని ఏమనిన: అట్టిగుణము ప్రత్యక్షముగ గలిగిన ఒక గురువును వెంబడించుటే. తన సద్గురువును కనుగొని, ఆయనమాట విని ఆయనను హత్తుకొని యుండుటచేత, ఇతడును ఆయన సుగుణ సంపత్తిలో పాలుపొందునను మాదిరి చూపుట అనగా: సుగుణవంతుడైన ఒక గురువు తన శిష్యునికి చేయునట్టి ఈ గొప్ప ఉపకారమే,' అని క్రీస్తు జీవితచరిత్రను వ్రాసిన సీలీ అను పండితుడు చెప్పుచున్నాడు.

సుందరుడు వెళ్లిన స్థలములలో కొందరు, ఈయనను తనకు మాదిరిగ తమముందర పోవునట్టి స్నేహితునివలె భావించుచున్నారు. ఈయన సమీపమందు కొన్ని నిమిషములు నిలువబడి ఈయన మాటలు వినవలెనని కోరుటచేతను ఈయనను మహాత్ముడనియు. స్వామియనియు గౌరవనామములచే

పిలుచుటచేతను జనులు ఈయనను ప్రేమించుచున్నారని తెలియుచున్నది. దీనినిగురించి తలంచెడు భక్తిగల క్రైస్తవులు, క్రీస్తును నిజముగ వెంబడించిన సుందరుడు ప్రజలమనస్సులను ఈలాగు వశపరచుకొనగలిగితే, క్రీస్తు ఇంత కంటె ఎక్కువబలముగా మనుష్యుల మనస్సులను తన వశపరుచుకొనగలడని ఎంచుదురు. ఈ విధముగ సుందరుడు తన గుణశీలతచే మనుష్యుల మనస్సులను సమస్త ఆత్మీయ జీవమునకు ఆధారమైన యేసునాధునితట్టు ఆకర్షించుచున్నాడు.

దక్షిణ ఇండియాలో అనేకమంది యౌవనులు ఈయనకు శిష్యులు కావలెనని కోరిరి. కాని సుందరుడు వారు దేవుడు తమను ఉంచినచోటనే ఉండి తమ చుట్టునున్న వారిమధ్య ఆయనను సేవింపవలెనని వారికి బుద్ధి చెప్పెను.

క్రైస్తవ సంఘములకు దూరముగ నుండుటచే వారిబోధను వినలేని అన్యులకు బోధించుటే దేవుడు తనకు నియమించిన ముఖ్యమైన పని యని గ్రహించిన సుందరుడు క్రైస్తవసభలను కొన్ని సమయములందు మాత్రమే దర్శింపగలడు. ఆయన సభలను దర్శించినప్పుడు సభలలో నూతన ఉత్సాహమును, పైనున్నవాటిని వెదకవలెననెడు ఆశయు, ఆత్మీయమైన ఆవేశమును కలుగుచున్నవి. వీటినిగాని, తన పరిచర్యవలన కలిగిన యితరఫలితమునుగాని సుందరుడు గమనించుటలేదు. ఆవేశమును పుట్టించిన ఆయన మాటలును, కళంకములేని ఆయన చల్లని ముఖమును ఆయన వెళ్లిన తరువాత జనులకు జ్ఞాపకముండును. ఆయనయొక్క స్వార్థత్యాగపు జీవితము ఇహలోకసౌఖ్యములను స్వార్థపరులై వెదకువారిని గద్దించి బుద్ధిచెప్పుచున్నది. ఆయన క్రీస్తుమతము ననుసరించి, బోధించెడు విధము, 'క్రీస్తుమతము పాశ్చాత్యులకే తగునుగాని యీ దేశస్థులకు తగదను' తప్పు తాత్పర్యమును తీసివేయుచున్నది.

# 10. అధ్యాయము

## లోకమంతకు సువార్తికుడు—1

మీరు భూదిగంతములవరకు నాకు సాక్షులై యుందురు. (అపొ. కార్య. 1: 8.)

### తండ్రి కుమారుడు

సాధు సుందరసింగు టిబెట్టునుండి తిరిగివచ్చి పంజాబుదేశములో సువార్త ప్రకటించుచు లూడియానా అక్టోబరు 10-వ తేదీని చేరెను. అక్కడ తన స్నేహితుడైన డాక్టరు హ్వారీ దొరగారిని కలిసికొనెను. అక్కడనుండి తన తండ్రిని దర్శించుటకు రామపురికి పోయెను.

తండ్రియైన సర్దార్ సింగు ప్రసిద్ధిగాంచిన తన కొమరుని అధిక గౌరవముతోను ప్రేమతోను చేర్చుకొనెను. వారిద్దరును ఎంతో సంతోషముతో కొన్ని దినములు గడిపిరి. ఆ దినములలో ముసలివాడైన తన తండ్రి క్రీస్తుప్రభువుకు తన హృదయము నిచ్చితినని చెప్పగా విని పరమానందము పొందెను. సాధు సుందరసింగు తనకు వెంటనే బాప్తిస్మమియ్యవలెనని ఆయన సహజముగా కోరెను. కాని సుందరుడట్లు చేయుట కిష్టపడలేదు. తాను ప్రసంగించుటకేగాని బాప్తిస్మమిచ్చుటకు పిలువబడలేదని సాధువుగా తిరిగిన యీ పదునాలుగేండ్లనుండి ఆయన భావించెను. ఇండియాలో అనేకచోట్ల బాప్తిస్మమియ్యమని అనేకులు బ్రతిమాలినను ఆయన బాప్తిస్మమియ్యలేదు.

సర్దార్ షేర్ సింగు తన కుమారుని రాబట్టుకొనవలెనని అనేక ప్రయత్నములు చేసెను. ఉర్దులో వ్రాసిన యీ యుత్తరములో (III-వ పుట చూడుము) సుందరును వివాహము చేసికొనుమని అడుగుచున్నాడు. 'నీ యుద్దేశమేమని నేనడుగుటలేదు. నీవు వెంటనే వివాహము చేసికొనవలసినదని నేను నీకాజ్ఞాపించుచున్నాను. వివాహముచేసికొని నీ గురువైన క్రీస్తును సేవింపకూడదా! క్రీస్తుమతము తలిదండ్రులకు విధేయుడవుగా నుండవద్దని బోధించునా?' సుందరుడు తన యింటిపేరు నిలిపినయెడల ఆయనకెంతో ద్రవ్యము విడిచి పోదునని చెప్పుచున్నాడు. మరియు ఈలాగు పేదవాడుగ సాధువువేషము ధరించుకొని తిరుగుచుండుట సరికాదని గద్దించుచున్నాడు.

సుందరుడింతో మర్యాదగా తండ్రికి ప్రత్యుత్తరమిచ్చి తాను నిజమైన సాధువుగా జీవించవలెనని దేవుడు తనను పిలిచియున్నాడు గనుక వివాహమాడుట అసాధ్యమని, తాను క్రైస్తవుడైనప్పుడు ఇహమందలి ధనము నంతను విడిచితినని తెలిపెను. మరియు, 'తమరు బుద్ధిమంతులు అనుభవశాలులు గనుక తమ ద్రవ్యమునుగూర్చి తమకు ఉచితమని తోచినట్లు చేయవచ్చును. నామట్టుకైతే నేనొకసారి నాగటిమీద చెయ్యివేసిన తరువాత వెనుకకు తిరిగి చూడను'ని వ్రాసెను.

అనేక సంవత్సరములు హింసనుపొంది తండ్రిని యెడబాసి, విడువకుండ ప్రార్థించినపిదప తండ్రియు తానును క్రీస్తునందు ఏకమయ్యెడు గొప్పభాగ్యము ఆయనకు లభించెను. అంతటాయన దక్షిణముగాను పశ్చిమముగాను తండ్రి యింటిని విడిచి ఆనందముతో బైలుదేరెను.

## పశ్చిమముగ పోవుట

1919-వ సంవత్సరాంతమందు సాధు సుందరసింగు ఇంగ్లాండుకు పోవలెనని తలంచుచున్నట్టు వదంతి పుట్టెను. కాని 1920-వ సంవత్సరారంభమందు ఆయన బైలుదేరుచున్నాడని వినుటతోనే ఆయన స్నేహితులు గర్భదరిద్రుడైన ఆయన యింతటి ప్రయాణమెట్లు చేయునో యని భయపడుచుండిరి. అప్పుడాయన తండ్రి సర్దార్ షేర్‌సింగు 'పాశ్చాత్యులకు క్రీస్తుదర్శనమువలన తనకు కలిగిన యానందమునుగూర్చి తెలుపవలెనని తన కొమరునికుండిన యాశను దీర్చుటకై ఓడప్రయాణమునకు కావలసిన ద్రవ్యము నిచ్చినట్టు తెలియవచ్చెను.

ప్రయాణమునకు కావలసిన యేర్పాటులు బహు తొందరగ జేయవలసి వచ్చెను. అందుచేత ఆయన స్నేహితులలో ననేకులకు ఆయన బైలుదేరువరకు ఆయన యేర్పాటు తెలియకపోయెను. ఈ ప్రయాణమునకు ఏమియు విశేషమై ఆయత్తముచేయుట సుందరునికి అవశ్యమని తోచలేదు. దైవాజ్ఞననుసరించి తాను పోవుచుండగ, పొమ్మని చెప్పిన దేవుడేమార్గమును చూపునని ఆయన తలంచెను. ఆయన స్నేహితులు ఆయన రాకకొరకు ఎదురు చూడుడని ఇంగ్లాండులోని కొంతమంది గొప్పవారికి వ్రాయకముందే సుందరుడు ఓడెక్కెను.

ఇంగ్లాండుకు పోవుట కనేకులకు ఓడలలో స్థలముదొరుకుట కష్టముగానుండిన అక్కాలమందు సుందరునికి ప్రత్యేకముగా ఒకగది దొరుకుట

దైవాధీనమే. అందుచేత ఆ దీర్ఘప్రయాణములో నాయన ధ్యానము ప్రార్థన చేసికొనుటకు గొప్ప సావకాశము దొరికెను.

ఓడెక్కుటకు పూర్వపు రాత్రియందు ఆయనకు వీడ్కోలువిందుకూటము బొంబాయిలో జరిపిరి. ఆ సమయమందుండి ఆయనను జూచిన స్నేహితు డొకడు ఇట్లు వ్రాసెను.

సాధారణమైన లౌకిక్యస్వభావముగలవారు పరమాత్మను దర్శించినవారి మాటలు గ్రహింపలేరు. కాని ఆ రాత్రి సుందరుని మధురవాక్కులు వినినవారు ఆయన క్రీస్తునాధుని ముఖాముఖిగ దర్శించినందున ఆయన క్రీస్తు కొరకే జీవించుచున్నాడన్న సత్యమును గ్రహించిరి. కొద్దిప్రాయములో నుండిన యీ సిక్కుబాలుడు సత్యమును కనుగొనవలెనని యాశించినపుడు ఆ ప్రభువు తన దివ్యదర్శనము నను గ్రహించెనన్న సంగతివినినవారి మనస్సు ఆనందభరితమయ్యెను. అపొస్తలుడైన పౌలు ఆ పరమదర్శనమును కలిగిన పిమ్మటనే ఆ ప్రభువునుగూర్చి ప్రకటించి సాక్ష్యమియ్య గలిగెను. అటు వలెనే, నేను యేసునాధునిగూర్చి వినుటమాత్రమేకాక, నే నాయనను ముఖాముఖిగా చూచితినని అవిశ్వాసముతో నిండియున్న యీ కాలమందు సుంద రుడు ధైర్యముగ జెప్పుచున్నాడు.

సుందరసింగు అధికాసక్తితో పరమాత్మను ప్రార్థింపగా ఆ రాత్రిలో కృష్ణమూర్తికి బదులుగ క్రీస్తుప్రభువు తనకు దర్శనమిచ్చినది సుందరుని కింతో ఆశ్చర్యముగ నుండెను. సుందరుడా దర్శనమును వివరించినప్పుడు విన్నవారి కంతకంటె ఆశ్చర్యముగ నుండెను.

1920-వ సం॥ జనవరి నెల 16-వ తేదీని సాధు సుందరసింగు ఓడ ఎక్కెను. ఆదివారములయందు ఓడలో నున్నవారికి దైవారాధన జరుపుమని ఆయనను కోరిరి. ఆ ప్రకారమే ఆయన ప్రతివారము దైవారాధన జరిపెను. ఫెబ్రు వరినెల 10-వ తేదీని ఓడ లివర్‌పూల్ రేవుకు చేరెను. అక్కడ కొందరు స్నేహి తులు ఆయనను ఎదుర్కొని పట్టణములోనికి తీసుకొనిపోయిరి. రెండు దినములైన పిమ్మట మాన్‌చెస్టర్‌లో నున్న భక్తుడైన రెండల్ హారిస్సు అను పండితుని యింటికి వెళ్లి అక్కడ బసచేసెను.

## పశ్చిమ దేశమునకు పోవుటకు హేతువులు

ఈ దేశస్థుల నేకులు విచిత్రములు చూచుటకుగాని, విద్య, ఉద్యో గము సంపాదించుటకుగాని ఇంగ్లాండుకు పోవుదురు. లోకములో ప్రజ

లలో సగముమంది ఇండియాలో వెలసిన మతములలో ఏదో ఒకదానిని అవలంభించి యున్నారు. తూర్పు దేశస్థులకును పడమటి దేశస్థులకును సామాన్యమైన యేసుక్రీస్తు అను పరమ పురుషోత్తముని మర్మమైన కొన్ని దివ్యలక్షణములను ఇండియనులు బైలుపరతురని పాశ్చాత్యులు బహుకాలము నుండి నిరీక్షించుచున్నారు. పశ్చిమదేశమునకు పోయి క్రీస్తునాథునియొక్క ఆడంబరములేని భక్తిని బయలుపర్చుటకు ప్రయత్నించిన సత్పురుషులు ఇంతవరకు ఎవరును కనిపించలేదు. సుందరుడు ఇంగ్లాండుకుపోవుట వృధా కాలయాపనమని ఈ దేశములోను ఇంగ్లాండుదేశములోను కొందరు తలంచిరి. ఆయన ఇటువంటి గొప్ప సంగతులనుగూర్చి రక్తమాంసములతో అనగా మనుష్యమాత్రులతో సంప్రతింపకపోవుట ఆయనకును, దేవుని సంకల్పమునకును బహు శ్రేయస్కరముగా నుండెను. ఆయన చాలాకాలము క్రిందటనే దేవుడు తనను తప్పకుండా తిన్ననిమార్గమందే నడిపించునను సత్యమును గ్రహించినవాడు గాన ఇంగ్లాండులో కొందరు పత్రికాధిపతులు ఆయన ఇంగ్లాండుకు వెళ్లిన హేతువేమని అడుగగా నిట్లు ప్రత్యుత్తరమిచ్చెను. 'నేను ఒక రాత్రివేళ ప్రార్థించుచుండగా దేవుడు నన్ను ఇంగ్లాండుకు వెళ్లి క్రీస్తుప్రభువునందు నాకు కలిగిన అభిమానమునుగూర్చి ప్రకటింపుమని చెప్పెను. ఇక్కడ సూర్యుడు అధిక కాంతితో ప్రకాశింపడు, అటువలెనే నీతిసూర్యుడుకూడ తరుచుగా కమ్ముబడియుండినను నాకు ఇక్కడ బహు సంతోషముగ నున్నది.

మరియొక హేతువు, ఇంగ్లాండుకు వెళ్లి తిరిగివచ్చిన అనేకమంది ఇండియనులు, ఇంగ్లీషువారు మతాభిమానమును బొత్తుగా విడిచిపెట్టిరని చెప్పగా విని దీనిలోని సత్యమును తెలిసికొనుటకు సుందరుడు కోరెను. ఇంగ్లాండులో డబ్బాశయును లౌక్యపు ఉల్లాసములు ఎక్కువగానున్నను వారి కుటుంబములలో బసచేసి, వారి యింటి ఏర్పాటులను గమనించినప్పుడు వారు నిజముగా మతాభిమానము గలవారని ఆయన కనిపెట్టెను. ఈ సత్యమును గ్రహించి దాని నితరులకు తెలుపుటయందును ఆయన సంతోషించెను.

ఇంగ్లాండుకు వెళ్లినందున సుందరునికి కలిగిన మార్పు ఏమిటని విచారించుట మంచిదైనను ఇంగ్లీషువారికి ఈయనను చూచి ఈయన మాటలు, విని నందున కలిగిన ఫలితమేమని ఇక్కడ కొంత విచారింతము. అందుకొరకు ఈయన ఆ దేశమునకు వెళ్లిన మొదటి కొద్ది వారములలో జరిగిన సంగతులు ఇక్కడ ఉదాహరించెదము.

## క్వేకరులు, సుందరసింగు

స్నేహితుల సంఘమను పేరుపొందిన క్వేకర్ సంఘస్థులు ఆతురతతో పిలువగా సుందరసింగు రెండల్ హారిస్ను ఇల్లు విడిచి బర్మింగ్ హాములోనున్న హాయిలండు అను ఆయన ఇంటికి వెళ్లి బసచేసెను. ఇంగ్లీషు భాషలో ఉపన్యసించుట ఆరంభములో ఆయనకు కష్టముగనుండెను. అయినను తరుచుగా తానెరుగకుండనే ప్రసంగాంశమునకు తగినట్లు, బహు వాక్చాతుర్యముతో చెప్పగలిగెను. ఆయన ఇంగ్లీషుభాషలో బహు త్వరితముగ మాట్లాడగలడు. ఎల్లప్పుడును ఆ భాషలోనే మాట్లాడు వాడుక కలవాడైనట్లు తడబడకుండా మాట్లాడును. ప్రార్థననుగూర్చి ఆయన చేసిన ప్రసంగము, దానిలోని సత్యమునుగూర్చి మనస్సును ఒప్పించి ప్రేరేపింప శక్తిగలదై యుండెనని హాయిలండు చెప్పెను. పాప ప్రాయశ్చిత్తములనుగూర్చి తనకుండిన సందేహములను సుందరసింగు నివృత్తిచేసెనని ఒక విద్యార్థి ఒప్పుకొనెను. క్రీస్తుమతస్థులలోని, తెగలనుగూర్చి ఆయన ఎంతమాత్రము లక్ష్యపెట్టలేదనియు, ఆయన ఒక జనాంగమునకు ఒక తెగకు సంబంధపడక అట్టి భేదములను మించిన మహాపురుషుడని హాయిలండు పండితుడు చెప్పిన మాట జ్ఞాపకముంచుకొనదగును. సుందరుడు సమస్త దేశస్థులకును సామాన్యుడైనట్టే సకల మతవాద కక్షలకు మించినవాడుగ నున్నాడు. క్రైస్తవసభను భేదించు తెగలనుగూర్చి ఈయనకు సంబంధములేదు. తన ఆత్మ స్నేహితుడును యజమానుడునైన క్రీస్తు ప్రభువువలె మతవాద కక్షలను తప్పించుకొని తిరుగువాడు. అందరికి దాసానుదాసుడుగా ప్రేమయును వినూమమును ప్రజ్వలింపజేసి, యేసు అను ఒక్క మధురనామమునే ప్రచురించు సుందరసింగును చూచెడు ఆంగ్లేయ క్రైస్తవులకు ఈ తలంపు పుట్టదా? క్రీస్తునందున్న భక్తి తమ హృదయములో ప్రజ్వలింపజేయుటలో సభలోని భేదములన్నియు భస్మమైపోవును. విభేదములవలన శక్తి ఉడిగిన శిష్యబృందము మృతిబొంది యీ విధముగా ఒకటిగా నైక్యపడు దినమున నేగదా పరిశుద్ధ సభ పరసంబంధమైన ఆత్మీయ లావణ్యము ధరించినదై పాపభారముచేత పాడైన లోకమును కల్వరియను పుణ్యస్థలమునకు ఎత్తుటకు చేయూత నిచ్చి పిలువగలదు?

## కాలీ పాదర్సు మధ్య

ఇంగ్లాండుకు బయలుదేరకముందే సుందరసింగు పునహాలోనున్న కాలీ పాదర్సుతో స్నేహము చేసియుండెను. వీరు సుందరునియెడల గౌరవ

ముగలవారైనందున ఆక్స్ఫర్డులో తమ అధ్యక్షునికి ఆయన రాకనుగూర్చి వ్రాసియుండిరి. అందుచేత ఆక్స్ఫర్డులోను, లండనులోను, సుందరుడు ఈ కాలీఫాదర్సుయొక్క అతిథిగానుండెను. ఆక్స్ఫర్డులో ఈ క్రిందిమందిరములలో సుందరుడు ప్రసంగించెడు, స్నానికుడైన యోహాను ఆలయములోను, మాన్సుఫీల్డు కళాశాలలోను, సోమరువిల్ అను స్త్రీల పాఠశాలలోను, బేలియల్ కళాశాలలోను. ఈ చివరి కళాశాల మందిరములో విద్యార్థులు సుందరుని ఇంపైన వాక్కులను శ్రద్ధతో వినుటకు బహుమంది కూడుకొనిరి.

లండన్ మహాపట్టణములో సుందరుడు మొదట ప్రసంగించినచోటు మిషనెరీల పిల్లలకని స్థాపింపబడిన పాఠశాలతో సంబంధించిన ఆలయమే. అంతకుముందు కాలీఫాదర్సు అనేక కూటములనుగూర్చి ఏర్పాటుచేసి ప్రకటనలు అచ్చువేయించి పంపియుండిరి. సాధు సుందరసింగు ఆక్స్ఫర్డులో చేసిన ప్రసంగములలో ఆయనకు క్రీస్తు ప్రభువు ఎడలనున్న ప్రేమను ఆయన నూతన విధముగ క్రీస్తుప్రభువును బైలుపర్చియున్నాడు. వినినవారు బహు ప్రేరేపణను పొందిరని వార్తాపత్రికలలో చెప్పబడినది.

ఈ ఏర్పాటులు తొందరగా చేయవలసియుండినందున, లండన్ మహాపట్టణమందు సుందర్‌సింగునుగూర్చిన వర్తమానము అందరికి తెలియుట కష్టతరమాయెను. పరిశుద్ధ మత్తయి, పరిశుద్ధ బ్రైడ్ వెస్టుమినిస్టరు మొదలైన ఆలయములలో కొన్ని దినములవరకు అనేకమంది ప్రజలు గొప్పకూటములుకూడి సుందర్‌సింగును చూచి ఆయన విలువగల వర్తమానమును వినిరి. వార్తాపత్రికలలోను ఆయన ప్రసంగములను పొగడుచు వ్రాసిన అనేక పత్రికలలోను ఆయన పటము అచ్చువేసిరి. సుందరుడు దేవుని హస్తములలో పరిపూర్ణమైన ఒక సాధనము. తూర్పుదేశమునుండి పశ్చిమదేశస్థుల మతాభిమానమును బలపరచుటకు ఒక ప్రసంగి యింతకుముందు వచ్చియుండలేదు. ఆయన ప్రసంగములు వినుటకు వచ్చినవారు నిట్టూర్పువిడిచి గాని ఏడ్చిగాని తమ మనస్సులోనున్న భక్తిని బైలుపరచలేదుగాని కూటము ముగించినవెంటనే అందరును మోకాళ్లూని మౌనముగా ప్రార్థించుకొని గంభీరమైన చింతలతో వెలుపలికి పోయిరి. గొప్ప కూటములలో ఈ విధమైన వినయము కనబడుట బహు అరుదు అని పరిశుద్ధ బ్రైడ్ ఆలయములో సుందరుడు జరిపిన కూటములోనుండినవారొకరు వ్రాసిరి.

లండనులోని వార్తాపత్రికలలో విశేషమైనదైన వెస్టుమినిస్టరు గెజెట్టులో మార్చినెల 10-వ తేదిని ఒక వింత పురుషుడు లండన్ పట్టణమును దర్శింప

వచ్చెనను శీర్షిక క్రింద నిట్లు ప్రచురింపబడెను. ఆంగ్లేయ క్రైస్తవులకు తన ఆత్మీయానుభవమును తెలుపుటకు ఇప్పుడు వచ్చియున్న సాధు సుందరసింగు ముఖము చిత్రకారులు యేసుప్రభువు ముఖవర్చస్సును ఊహించి వ్రాసిన చిత్రపటము పోలియున్నదని భయభక్తులతో చెప్పుచున్నాము. తూర్పుదేశస్థులయందు సౌందర్యమైన ముఖారవిందము కలిగినవాడై చిన్న పిల్లలను ముద్దాడుటకు క్రిందికి వంగినప్పుడు ఆయన కనపడుచు దయచేత వారు పరవశులగుచున్నారు. నేటి ఉదయమున యీ మహానుభావుని చూచు భాగ్యము నాకు కలిగెను. ఆయనలో కనిపించిన నూతన గాంభీర్యము మరెవనిలోను నేను చూచియుండలేదు. ఆయన ధరించిన కాషాయపు అంగి సువర్ణఛాయ గలిగిన ఆయన నిడుపైన దేహమున బహు సొగసుగ వ్రేలాడుచుండెను. ఆయన పాదములకు పావుకోళ్లు తొడుగుకొనియుండెను. నా స్వదేశములో జాతిభేదములున్నవి. ఒకడు క్రైస్తవుడైన పిమ్మట, ఈ సభలోగాని, ఆ సభలోగాని, చేరవలెనని చెప్పెడి మాట విను హిందువులు, ఈ మతము ఒక కులభేదములు గలిగినదేనని ఊహింతురు. నేను అన్ని సభలలో ప్రవేశించి నా పరిచర్య జేతును. అట్టి యాటంకములు నాకు లేవని నాతో చెప్పెను. అంతియేగాక ఆయా తెగలయొక్క భేదములనుగూర్చిన వాగ్వాదములలో ప్రవేశింపక సుందరుడు తన దైవసేవను అన్ని తెగలలో నిరాటంకముగా జరుపుచున్నాడు. ఈ విధముగ నీ పశ్చిమదేశపు సభవారు తూర్పుదేశపు వారినోట నిజమయిన సార్వత్రిక సభయొక్క స్వభావమును గ్రహించుచున్నారు.

## బిషపుల మధ్య

మార్చినెల 9-వ తేదిని సుందరసింగు కాంటర్బరీ ప్రధానాధ్యక్షునితో దీర్ఘకాలము సంభాషించి, మరునాడు ఆంగ్లేయ, పరిశుద్ధ సభలోని యేడు వందలమంది గురువులును ప్రధానాధ్యక్షుడును ఆరుగురు బిషపులునుగల కూటములో ఉపన్యసించెను. సభలోని భేదములను లక్ష్యపెట్టక, క్రీస్తే సమస్తములో సమస్తమని యెంచుకొను ఒక భక్తునికి స్వాగతమిచ్చుటకు ఇంగ్లాండు సభలోని పలుతెగలవారు కూడుకొనుట బహు ఆశ్చర్యమైన సంగతి.

ఒక ఆంగ్లేయ పత్రికలో అపూర్వమైన యీ కూటమునుగూర్చి తెలుపబడినది:—'అక్కడ కూడినవారు ఏదో యొక విశేషమైన ఆశీర్వాదముకొరకు ఎదురుచూచుచున్నట్టు కనుపించెను. ఒక నూతన లోకవాసి

వలె సుందరుడు నియమిత కాలమునకు కొంచెము ముందుగ ప్రసంగమందిర ములో ప్రవేశించెను. ఆయనయొక్క వైరాగ్యమువల్లను అసాధారణమైన ఆసక్తివల్లను ఆయన ప్రసంగము వినువారి మనస్సులో బాగుగ నాటుకొనెను. మానవులకు మాత్రమే క్రీస్తు ప్రభువుయొక్క రక్షణ సువార్తను తెలుపగల విశేషమైన అధికృతగలరు. దేవదూతలైతేనో సత్యమును బయలుపరచి రహస్యమైన మర్మములను వివరింపగలరు. కాని వారు పాపమునుండి విమో చింపబడినవారివలె సాక్ష్యమియ్యలేరు. గనుక కొర్నేలికి రాబోవు సంగతు లను తెలుపుటకు ఒక దూత ప్రత్యక్షమాయెను. కాని రక్షణ మార్గమును చూపుటకు పాపాత్ముడయిన పేతురు పంపబడెను. ఈ విధముగ బలమైన సాక్ష్యమును సాధువు అక్కడ యిచ్చెను. దానిని వినినప్పుడు సుందరుడు క్రీస్తుప్రభువునందుగల ప్రేమచే పరవశుడై ఆ ప్రేమను ఇతరులకు బయలు పరుపదగిన గొప్ప శక్తిగలవాడైనట్టు కనుపించెను. లోకసంబంధమైన ఆడం బరము బొత్తుగ విసర్జించిన సాధువు ప్రక్కను లోకసంబంధమైన అలంకార ములు గలిగిన కొంకి కర్రలుపట్టిన ఇంగ్లాండు సభాధ్యక్షులు కూర్చుండుట విపరీతముగ కాన్పించెను.

## ఇతర పరిచర్యలు

సుందరసింగు అటుపిమ్మట అనేకచోట్ల ప్రసంగించెను. వాటిలో కొన్ని యేవనిన: క్రేమ్బ్రిడ్జి కళాశాలలోని విద్యార్థులకు, యూనివర్సిటీ క్రైస్తవ సంఘము వారికి, లండను పట్టణములోని మిషను వారి సంవత్సరాంతపు కూటములోను, ప్రసంగించి, పిమ్మట ఫ్రాన్సులోని రాజధానియగు పారిస్నగరమునందు గొప్ప మిషనెరీ కూటములోను ఉపన్యసించెను.

ఏప్రిల్ నెల 1 తేదీని ప్రఖ్యాతిజెందిన జూవెట్ పండితుని ప్రసంగ పీఠమును సాధువెక్కి నిలుచబడి, 'నీవు పరలోకరాజ్యమునకు దూరముగ లేవని క్రీస్తు ప్రభువు చెప్పిన వాక్యమును వివరించెను. ఈ ప్రసంగమునకు ముందు డాక్టరు జూవెట్ మన సాధువునుగూర్చి యిట్లు ప్రస్తాపించెను. క్రైస్తవ సేవయందు ఇంత ప్రత్యక్షముగా ఫలితమునొందిన హిందూదేశస్థుడైన క్రైస్తవ భక్తుడు నాతోకూడ యీ ప్రసంగ పీఠమునందుండుట ఎంతో అపూర్వమైన ఘనతగ నెంచుకొనుచున్నానని చెప్పెను. సుందరసింగు ప్రసంగమును వినిన గొప్ప సమూహములో నొకరు చెప్పినదేమనిన:—సుందరసింగు వరముపొందిన ప్రసంగివలె స్వాభావికమైన అభినయములో మాట్లాడెను. మాటలకొరకు

ఒకప్పుడైనను తడబడలేదు. సుందరుడు గంభీరముగ సువార్త సత్యములను ప్రకటించినప్పుడు, నిశ్చింతగా నుండినవారు సహా భక్తిగలవారైరి.

మరునాడు మంచి శుక్రవారము. ఈ గొప్ప దినమునందు ప్రాసంగ కేసరి అనదగు స్పర్జన్ అను ఆయన ప్రసంగించిన ప్రసంగశాలయందు సాధువు నిలువబడి క్రైస్తవ యత్న సంఘమువారికి సుబోధచేసెను. ఈ కూట మునుగూర్చిన పత్రికలలో సాధువునుగూర్చి బహు అతిశయముగ వ్రాసిరి.

మతాభిమానము కలిగిన ఆంగ్లేయుల నెల్లరను ఈయన తన వశపరుచు కొనుటకు కారణమెద్ది! ఒక గొప్ప ఉద్దేశముకొరకు స్వార్థత్యాగము చేసి కొనుటయే ఈయన శక్తికి రహస్యమైయున్నది. ఇహలోక సంపత్తిని ఎక్కు వగ నెంచుకొనెడి మన దేశస్థులు ఈ విధముగా ఆత్మీయమైన కార్యములను మనస్కరించెడి ఒక మహా పురుషునితో సహవాసముచేసెడి భాగ్యము కలు గుట గొప్పసంగతియే.

అటుపిమ్మట సాధువు ఐర్లాండుకును స్కాట్లాండుకును వెళ్లి అనేక కూట ములలో సువార్త ప్రకటించెను. గ్లాస్గో మహా పట్టణములో ముఖ్యులైన కొందరు ఓపల వర్తకులు ఈయనకు విందుచేసిరి.

స్కాట్లాండు దేశములో సాధువుచేసిన పనినిగూర్చి డాక్టరు మెక్లీను ఇట్లు వ్రాసెను:—

'లోకచరిత్రలో ఒకప్పుడు జరిగిన కార్యములు మరొకప్పుడు తిరిగీ జరుగుచుండును. అలాగే క్రీస్తుమత చరిత్రలో మరణము పునరుత్థానము అను నవి ఒక చక్రము తిరిగినట్లుగా అంతము లేకుండ పదేపదే జరుగుచుండును. బహుకాలము క్రిందట క్రీస్తుమతములో బుద్ధికుశలత తెలుపు కార్యములు జరుగకుండ పోయినందున అది నశించెను. కుప్రియను, టర్టలియను, అగ స్టీను, అనువారి దేవాలయములు నేలమట్టము చేయబడెను. అద్యక్షుల ఆల యములు గొల్లర్లు ఉండుటకు బారకాసులుగా మార్చబడెను. కాని క్రీస్తు మతమును నాశనముచేయు శక్యముకాదు. తూర్పుదేశమునుండి అది తిరిగి వచ్చును. బలిపీఠములమీద ఆరిపోవుచున్న అగ్నిని తిరిగి ప్రజ్వలింపచేయు టకు క్రొత్త అపొస్తులులో సాధు సుందరసింగు ఒకవేళ మొదటివాడన దగును.'

ఒకడు లోకమును జయించకోరినయెడల వాడు దానిని వట్టిదిగా ఎంచు కొనవలెను. ఇక్కడ మనకు లోకములో తనకు ఏమియు అక్కరలేని

మనుష్యుడొకడు కనిపించుచున్నాడు. ఆయన పాదముల యొద్దకు ప్రజలు సమూహములుగా కూడుచున్నారు మన మీ సంగతిని మరచిపోతిమి...... లోకమును త్యజించువారుమాత్రమే దానిని జయింప గలుగుదురన్న పాఠమును క్రీస్తుసభ తిరిగి నేర్చుకొనవలసియున్నది. ఒకవేళ ఈ ముఖ్యమైన సత్యమును మన హృదయములమీదను మనస్సాక్షులమీదను నాటింపచేయుటకే దేవుడు సాధు సుందరసింగును మనయొద్దకు పంపియుండెను.

మే మాసమంతయు ఎంతో పనితో నిండియుండెను. లండను పట్టణములో ఆ మాసములో జరుగుచుండు గొప్ప సొసైటీల సంవత్సరాంతపు కూటములన్నిటిలో ఆయన మాట్లాడవలెనని మనవి చేసుకొనిరి. మిషనెరీల కూటములకు అంత ఎక్కువగా ప్రజలు ఎప్పుడును గుంపుకూడి రాలేదు. ఆల్బర్ట్ మండపమందు 10 వేలమంది కూడుకొనిరి. అనేకులు వెలపల నిలువవలసివచ్చెను. లండన్ మిషన్ సొసైటీవారు రాణిగారి మండపములో కూడుకొనినప్పుడు వందలకొలది జనులకు లోపలికి ప్రవేశము దొరకలేదు. అప్పుడు అగ్రాసనాధిపతిగానుండిన డాక్టరు గార్వి సాధువుచేసిన ప్రసంగమును, 'ఆయన ఉపమానములేకుండ వారితో మాట్లాడలేద'ను లేఖనవాక్యముతో వర్ణించెను. తూర్పుదేశములో జరుగు సంగతులు దృష్టాంతములుగాను ఉపమానములుగాను, చెప్పబడగా వినుట పశ్చిమ దేశములకు మంత్రప్రభావముగనున్నది. ఆయన ప్రసంగమును వినిన ఒక చిన్నబిడ్డ, సుందరసింగు యేసువలె ఉపమానములతో మాట్లాడుచున్నాడని చెప్పెను.

సీమలో బైబిలు సొసైటీవారి కూటములో మాట్లాడుట సుందరసింగుకు ఎంతో వినోదముగనుండెను. ఆయన క్రైస్తవజీవితకాలమంతయు ఈ గొప్ప సొసైటీవారికి ఋణపడియుండినట్లు గ్రహించి మనుష్యులను ప్రభువుయొద్దకు నడిపించుటకు బైబిలుకుగల శక్తినిగూర్చి యెంతో ఆనందముతో సాక్ష్యమిచ్చెను. బైబిలు సొసైటీవారు ఆయనను గౌరవార్థము జీవితకాలమంత తమ మెంబరుగా అంగీకరించినప్పుడు ఆయనకెంతో సంతోషము కలిగెను.

## అమెరికా దేశములో

డాక్టరు జూవెట్‌ను ఇతరులును సాధునుగూర్చి అమెరికా దేశస్థులకు తెలిపిరి. ఆ దేశమునకు వెళ్లునని తెలియబడగానే భక్తులైనవారు కొందరు ఆయన అక్కడికి వెళ్లినందున కలుగబోవు ఫలితమునుగూర్చి భయ

పడసాగిరి. ఐక్యపరగణాలు (యునైటెడ్ స్టేట్సు) లోని ప్రజలు ఆయనను వినోదముగ చూతురేగాని గొప్ప ఆత్మీయమైన మేలు వారు పొందరని నిష్కపటముగ నమ్మి, న్యూయార్కు పట్టణములో అనేకమంది భక్తులు కూడుకొని దేవుడు ఈ విషయములో ఏ అవాంతరము కలుగకుండ కాపాడవలెనని ప్రార్థించుచుండిరి.

సాధు సుందరసింగు అమెరికాకు చేరకముందు తగిన ఏర్పాట్లు చేయుటకు కాలము చాలకపోయెను. పాండ్ లిసియమ్ బ్యూరోవారు యునైటెడ్ స్టేట్సు అంతటిలోను జరుగవలసిన కూటములనుగూర్చి ఏర్పాటులు చేసి అందువలన రవీంద్రనాత్ టగోర్ వచ్చినప్పుడు దొరికిన లాభముకంటె ఎక్కువ లాభము దొరుకునని అంచనా వేసిరి. ఈ యేర్పాటులు ప్రచురము చేసిరిగాని సుందరసింగు ఇది లాభ వ్యాపారమని గ్రహించినప్పుడు దానితో సంబంధము పెట్టుకొనుటకు ఇష్టపడకపోయెను. అంతట నేషనల్ బైబిలు యిన్‌స్టిట్యూట్ వారు రెండు మాసములవరకు సాధువు ప్రసంగించుటకు తగిన ఏర్పాటులు చేసిరి. పిమ్మట ఆయన ఆస్ట్రేలియాకు వెళ్లవలసియుండెను.

మేనెల 30-వ తేదీని సాధువు న్యూయార్కులో యూనియన్ వేదాంత పాఠశాలలో ప్రసంగించెను. అటుపిమ్మట అనేక గొప్ప పట్టణములలోని దేవాలయములలో ప్రసంగించెను. జూన్ నెల 25-వ తేది సిల్వర్ బే అనుచోటను విద్యార్థుల కూటములలో 800 మంది విద్యార్థులకును వారి నాయకులకును 4 దినములు ఉపన్యసించెను. జూలై మాసారంభములో ఆయన షికాగో పట్టణమునకు వెళ్లి అక్కడనుండి ఐయోవా, కన్‌సాస్ మొదలైన ఇతర పట్టణములగుండ వెళ్లి, చివరకు సాన్‌ఫ్రాన్సిస్కో పరగణా చేరెను. అక్కడితో అమెరికాదేశములో ఆయన చేయవలసిన పని ముగించెను. అప్పుడు కొందరు స్నేహితులు టిబెట్టు దేశమునకు సువార్తను తీసుకొనిపోవుటవలన క్రీస్తుకొరకు హతసాక్షులుగా తమ ప్రాణము పెట్టదలచిన యౌవనులైనవారిని సుందరసింగు ఎరిగియున్నయెడల అట్టివారి పోషణార్థము కొంతసొమ్ము ఇచ్చుటకు కొందరు స్నేహితులకు ప్రేరేపణ కలిగెను.

లేక్ జార్జి అను చోట యీ క్రిందిసంగతి జరిగెను. ఒక కూటములో ముందు వరుసలో మూడేండ్లన్నర వయస్సుగల ఒక చిన్న పిల్ల కూర్చుండియుండెను. ఆయన ప్రసంగించినంతసేపు ఈ చిన్నబిడ్డ తన కండ్లు త్రిప్పకుండా సాధువు ముఖమువైపునే చూచుచుండెను. ఆయన ప్రసం

గించి కూర్చుండగానే యీ చిన్నబిడ్డ తన సొగసైన శిశు స్వరముతో ఆయన యేసా అని చెప్పగానే ఆ గొప్ప సభలోనివారందరు విపరీతమైన భ్రమజెందిరి.

అమెరికాలోనున్నప్పుడు సాధువు డాక్టరు ఫాస్‌డిక్, డాక్టరు రాబర్టు స్పీయర్ మొదలగు ముఖ్యులైన మతనాయకు లనేకులను కలిసికొనెను. ఒక చోటను ఆయనతో పూర్వము కలిసి సాధువుగా తిరిగిన స్టోక్సు దొర తల్లిగారు తారసిల్లి ఆయనను తన ఇంట చేర్చుకొనెను.

ఇంగ్లాండు దేశములోవలెనే వార్తాపత్రికలు ఆయన జీవిత చరిత్రను, ఆయన, ఆ దేశములో ఆయాచోట్ల అమెరికా దేశమందలి సంపత్తు సుఖ భోగములు, లౌక్యచింత, వీటినిగూర్చి జరిగిన చర్చలను ప్రచురించెను. ఒక పత్రికాధిపతి యిట్లు వ్రాసెను:—

ఈ పొడుగాటి బలవంతుడైన యౌవనుడు ఇండియా దేశమునుండి క్రీస్తు మతమునుగూర్చి తిరిగి లోకమునకు చెప్పుటకు వచ్చియున్నాడు. ఆయన వయస్సు కనుబడకుండ వృద్ధుడుగాను యౌవనుడుగాను జ్ఞానానంద శక్తులతో నిండినవాడుగా కనుపించుచున్నాడు. ఆయన ముఖవికాసము పర మానందముతో నిండియున్నది. పటములలో క్రీస్తు ప్రభువుకుండిన ఆకారము ఆయనకు కలదని చెప్పుదురు. ఆయన ఆలాగే కనిపించుచున్నాడుగాని ఆ పటములయందు క్రీస్తునాథునిలో కనిపించు సజీవత్వము, ఆనందములకంటె యీయనలో ఎక్కువ కనిపించును. ఒకవేళ ఆ పటములు తప్పాగ నుండ వచ్చును. సాధువుకూడ ఆలాగే తలంచుచున్నాడు.

ఆయన క్రీస్తు ప్రభువులోనుండిన అనంతమైన శక్తికిని అనంతమైన ఆనందమునకును సాక్ష్యమిచ్చుటకును, తాను హిందుమతమునుండి క్రీస్తు పక్ష ముగ తిరుగుటవలన కనుగొనిన మనశ్శాంతినిగూర్చి చెప్పుటకును వచ్చియు న్నాడు. ఇండియనులకు ఇట్టి మనశ్శాంతిని సమాధానము లున్నయెడల మరేది లేకున్నను సహించగలరు. అనేక తరములుగా మిషనెరీలు ఈ దేశ మునుండి ఇండియాకు క్రీస్తు ప్రభువుయొక్క శక్తినిగూర్చి చెప్పుటకు వెళ్లి యుండగా, తాను ఆ శక్తినిగూర్చియే అమెరికా దేశస్థులకు చెప్పుటకు వచ్చుట ఆయనకు విపరీతముగ కనిపించుటలేదు. 'క్రైస్తవులు తమ అనుభవ మును తమ ఆనందమును చెప్పి తీరవలయును. అదే తన కర్తవ్యమని ఆయన గ్రహించుచున్నాడు. క్రైస్తవులలో తెగలుండుట అనవసరమును విపరీతము నైన సంగతిగ ఆయన ఎంచుచున్నాడు. దేవుడొక్కడే యుండగా, యిన్ని

మతము లెందుకు? శాంతి సమాధానములు క్రీస్తు నెరుగుటవలన కలుగును. భిన్నాభిప్రాయములు ఎందుకు కలిగించవలెను? కాని ఇది లోకము గదా? తెగలన్ని ఏకమైనప్పుడు లోకముగనుండదు. అప్పుడు పరలోకమేయగునని ఆయన పరిత్యాగబుద్ధితో ఒకప్పుడు చెప్పెనుగాని తన ఆనందము ఎప్పుడును విడువలేదు.'

హార్డుఫర్డు వేదాంత విద్యాశాల ప్రధాని సాధువుతో కొన్నివారములు ప్రయాణముచేసిన పిమట యిటు వ్రా

ఆయన మేము చూచిన మనుష్యులందరిలో క్రీస్తుప్రభువుకు సమీపముగ జీవించుచున్నాడని ఆయనతో సంభాషించిన అమెరికా దేశమందలి పత్రికాధిపతుల తాత్పర్యము సరియేనని ఒప్పుకొనుచున్నాను. ముఖ్యమైన వార్తాపత్రికలన్నిటిలో ఆయననుగూర్చి విస్తారముగ ప్రశంసించబడెను. ఆయన పటములు ప్రతిచోటును ప్రదర్శింపబడెను. అనేక పట్టణములలో ప్రముఖులైన గురువులు కాని ధనాధికులను ఆయన వశపరుచుకొనగలిగెను. ఆయన పరిశుద్ధాత్మవలన నేర్పబడినవాడు, మనుష్యుల స్వభావమును ఆయా స్థితిగతులను దివ్యదృష్టిని తెలుసుకొనగల వరముగలవాడు, ప్రకృతికి బాహ్యమైన దైవిక వర్తమానమును ఆయన తెచ్చుచున్నాడు, అది యే ప్రస్తుతకాలమునకు అవసరమైయున్నది. ఆయన భుజించుటకుకూడ కాలములేకుండా ఆయన మాటలు వినుటకు ప్రజలు గుంపుకూడివచ్చిరి. ఒక పాఠశాల ప్రధానోపాధ్యాయురాలు నొద్దనుండి ఇప్పుడే యొక యుత్తరము వచ్చినది. సాధువుయొక్క ప్రసంగమును వినిన ప్రతి బాలుని ముఖముమీదను ఒక ప్రకాశముండెనని ఆమె వ్రాసెను. అమెరికా దేశస్థులు లౌక్యసంగతులలో ప్రస్తుతము మగ్నులై పోవుచున్నట్టు పోయినయెడల ఇకను ఏబదేండ్లలో ఆత్మీయముగ నడిపింపగల నాయకులేయుండరని ఆయన ప్రవచించిన ప్రవచనము సత్యమే. ఈలాగు ఆయన అమెరికా దేశస్థులకు స్వానుభవము చేత వారు అభ్యసింపదగిన వర్తమానమునే తెచ్చెను.

బ్రూస్టర్ బిషపు, హార్టుఫర్ గురువులకు వ్రాయుచు సాధువు ఆ దేశమును దర్శించుటకు ఉండిన హేతువులలో నొకటి ఇట్లు చెప్పెను:—

ప్రస్తుతము లోకమందలి క్రైస్తవ కోటిలో సాధువు బహు విశేషమైన విచిత్ర పురుషుడు. ఇదివరకు అనేకమంది స్వాములును ఇతర మతబోధకులును ఐరోపా, అమెరికా దేశములలో థియాసఫీ మొదలైన హిందుమత

శాస్త్రములను వ్యాపింపజేయుటకు చేసిన ప్రయత్నములను భంగపరచవలె నని సాధువు బహుగా కోరుచున్నాడు.

ఆస్ట్రేలియాకు పోవు దారిలో హానొలులు ద్వీపముమీదుగ సాధువు పోవునని అక్కడి ప్రజలకు తెలుపుటకు సాన్ ఫ్రాన్సిస్కోనుండి తంతితీని వార్త పంపిరి. ఆయన ఓడ ఆ రేవులో కొన్ని గంటలసేపు ఆగినప్పుడు ఆయన తీరమునకు వెళ్లి ప్రసంగించెను.

జూలై నెల 30-వ తేదీని సాధువు అమెరికాను విడిచి ఆస్ట్రేలియాకు బైలుదేరెను.

## ఆస్ట్రేలియాలో

హానొలులుయొద్ద స్టీమరు ఒక దినము ఆగినప్పుడు అక్కడనున్న చీనా, ఫిలిప్పి, జపాను, ఇంగ్లీషు, అమెరికా జనులు నాలుగువందలమంది సాధువు ప్రసంగమును వినుటకు కూడివచ్చిరి. ఆగష్టు 10-వ తేదీని సిడ్నీలో దిగి, ఒక వారమువరకు అక్కడి పెద్ద ఆలయములలోను, ప్రార్థన యిండ్లలోను, కళాశాల మందిరములలోను, కూటములు జరిపెను. ఒక కూటమును గూర్చి సిడ్నిలోని ఒక వార్తాపత్రిక ఇట్లు వ్యాఖ్యానము వ్రాసెను. ఆగష్టు 10-వ తేది మంగళవారము ఉదయమును ఎవరును మరవలేదు. నాటి దినమందు 700 మంది గురువులును, ఇతరులును పరిశుద్ధ ఆంద్రెయ అధ్యక్ష ఆలయములో కూడుకొనగా సాధువు వారిమధ్యకు వచ్చెను. ఆయనను చూడగా పూర్వము యేసుప్రభువు పరిశుద్ధ పట్టణపు వీధులలోనడుచు చున్నప్పుడు ఇట్లుండెనేమోనని మా మనస్సులకు తట్టెను. ఏమనిన, సాధువు యొక్క దర్శనమునుబట్టి క్రీస్తు ప్రభువు మా మధ్య ఉండినట్టు మాకు తోచెను. ఆయన మాట్లాడిన యిరువది నిమిషములలో మరియే చప్పుడు లేకుండెను. ఆయన యిప్పుడు తన స్వదేశమునకు తిరిగి వెళ్లిపోయెను, కాని ఆయన వెళ్లక మునుపు క్రీస్తు రక్షకుని గురించి మాకు నూతన దర్శనము కలిగించెను.

ఆయన అడిలేడ్ పట్టణములో తన 31-వ జన్మదినము గడిపెను. మెల్‌బోర్న్ పట్టణములో లేంగ్లే అధ్యక్షులవారు మరియొక తెగవారి ఆలయములో జరిపిన కూటములో అగ్రాసనాధిపతిగా నుండెను. ఆ పట్టణములో ఒక ఆంగ్లేయ బిషపు మరియొక తెగవారు ఆరాధించుచోట అగ్రాసనాధిపతిగాగాని మరియొక విధముగాగాని పాలుపొందుట అదే మొదటి

సారియని సానువుతో చెప్పిరి. ఆస్ట్రేలియాలోని అన్ని పట్టణములలోను ఆయన దర్శించినచోట్ల వెవ్వేరు తెగలవారు తమ భేదములను మరచి ఆయనకు హృదయపూర్వకమైన స్వాగతమిచ్చిరి.

పర్త్ అను పట్టణములో సాధువును ఓడలోనుండి బలవంతముగ దింపి తరువాత పోవుచున్న ఓడలో పంపించుటకు ఏర్పాటుచేసిరి. అధ్యక్షుల ఆలయములోను, విక్టోరియా మందిరములోను పర్త్ ప్రధానాధ్యక్షుల వారు అగ్రాసనాధిపతిగానుండిన కూటములు బహు గొప్ప కూటములు. వచ్చిన గొప్ప సమూహములకు చాలినంత పెద్ద కట్టడము లేకపోయినందున పైగా వచ్చిన వారికొరకు కూటములు జరిపి యీ విధముగ వెనువెంటనే రెండు పర్యాయములు ఆయన ప్రసంగింపవలసివచ్చెను.

ఫ్రీమేంటల్ పట్టణమునుండి ఇండియా దేశమునకు బయులుదేరుచుండగా సాధువు ఇట్లు వ్రాసెను. "ఆస్ట్రేలియాలో నేనెక్కడికి పోయినను నాకు హృదయపూర్వకమైన స్వాగతమిచ్చిరి. అన్ని తెగలలోని క్రైస్తవులును నాయెడల ఎంతో దయగలిగి ఐక్యకూటములు ఏర్పరచిరి వాటినిగూర్చి ఇంకను సవిస్తరముగ నేను వ్రాయవలసినదేగాని నేను ఎక్కువ పనిమీదనున్నాను. ప్రతి ఓడలోను నేను ఆరాధనలు జరుపవలెనని కోరుచున్నారు. ఓడలోని కప్తాను మొదలైన ఉద్యోగస్థులందరు నన్నెంతో దయగా చూచుచున్నారు."

సెప్టెంబరునెల 25 వ తేదిని సాధువు బొంబాయిలో దిగెను. ఆయన ఓడ కొలంబు రేవు చేరినప్పుడు ఒక కూటములో ఆయన మాట్లాడెను. ఇంకను కొంతకాలము ఉండి ఎక్కువ పనిచేయుమని వారు ఆతురముగ కోరినను ఆయన ఆలాగు చేయలేకపోయెను.

## ఇండియా, విశ్రాంతి

పెద్ద కూటములలో ఆయన మాట్లాడవలసివచ్చినను గొప్ప సమూహములు సాధువుకు ఇష్టములేదు. గనుక జనప్రీతి ఆయనకు ఒక శోధనగనుండెను కొంతమట్టుకు ఇందుచేతను, కొంతమట్టుకు ఆయనకు విశ్రాంతి కావలసియుండినందునను, సింహళములోని స్నేహితులు కోరినట్లు ఆయన చేయలేక పోయెను.

ఆయన అక్కడ ఉండినయెడల తిరిగి 1918-వ సం॥లో వలెనే దక్షిణ ఇండియాలోకూడ సంచారము చేయవలసి వచ్చియుండును. అందు

చేత ఆయన తిన్నగా బొంబాయికి ప్రయాణముచేసి, వెంటనే సబాటు అను చోటికి ప్రార్థన ధ్యానములు కొంతకాలము జరుపుకొనుటకు వెళ్లి పోయెను.

చలికాలములో తన సువార్త దండయాత్రమీద బయలుదేరకముందు ఆయన విశ్రమించు కాలములో రెండు వందలకంటె నెక్కువ ఉత్తరములు వ్రాసెను. ఆ సంవత్సరములో మిగిలిన కాలము ఐక్యపరగణాలలోను, చోటా నాగపూరులోను, బంగాళ పంజాబులలోను గొప్ప కూటములు జరిపి పట్టణములలోను గ్రామములలోను సువార్త బోధించెను.

## ప్రభుపాదసన్నిధి

సాధువుయొక్క అనేకమంది స్నేహితులకు 'మేరా కామ్ మునాదీ కర్నాహాయ్' అనగా బోధించుటయే నా పని యని ఆయన తరుచుగ చెప్పెడి మాట తెలియును. ఆయన మరియొకపని చేయునట్లు అనగా వారు అను కొనిన ఒక ముఖ్యమైన పనిచేయునట్లు ఆయన మనస్సు త్రిప్పవలెనని ప్రయత్నించినవారికి యీ ప్రత్యుత్తరము తరుచుగ ఇచ్చెను. అయినను 1921-వ సంలో ఆయన టిబెట్టుకు వెళ్లబోవుచుండగా ఆయన స్నేహితులు ఆయన నాగరికతగల ప్రదేశములను విడిచి అనాగరికతగల టిబెట్టువంటి అరణ్య ప్రదేశమునకు వెళ్లకముందు లిఖితపూర్వకమైన ఒక వర్తమానము విడిచిపోవుట అవసరమని తొందరపెట్టిరి. అప్పుడు ఆయన ఆ సంవత్సరా రంభమందు అందుకొరకై సబాటు అను చోటుకు ఏకాంతముగ పోయెను. అక్కడికి వెళ్లకముందు తన తండ్రిని దర్శింపబోయెను. అప్పుడు టిబెట్టులో జరుగుచున్న పనికి సహాయార్థముగ కొంత ద్రవ్యము తండ్రి ఇచ్చెను.

సాధువు తన పరిచర్య ఆరంభమందు తన సంచారములనుగూర్చి, అనుభవ ములనుగూర్చి చిన్న పుస్తకములను వ్రాసియుండెను. ఒకవేళ ఎవరును ఎరుగని ఒక సాధువు వ్రాసిన వర్తమానమునకు ఎక్కువ గణ్యత ఉండ నేరదని అనుకొని, ఆయన క్రైస్తవ పరిచర్యలో ఈ విధమైన పనిచేయుటకు ఇష్టము లేనివాడై యుండవచ్చును. ఆయన అందుచేత లిఖితపూర్వకమైన వర్త మానము విలువలేనిదిగ నెంచుచున్నట్లు అనుకొనతగదు, కాని ఆరంభములో ఆయన స్వయముగ ఇతరులను కలిసికొని వారిని ప్రభువుతట్టు త్రిప్పుట ఎక్కువ నిశ్చయముగ జరుగు పనియని నమ్మియుండును.

1918-వ సం॥లో ఆయన దక్షిణ యిండియాలో నున్నప్పుడు కొన్ని ప్రసంగములు చెప్పి వ్రాయించుమనట్లు బలవంతపెట్టిరి. ఆ ప్రసంగములు మలయాళములోను, అరవములోను ప్రచురింపబడెను.

ఆ భాషలు మాట్లాడు ప్రదేశములలో అవి యెక్కువగ చదువబడు చున్నవి, కాని పశ్చిమ దేశములలో ఆయన పరిచర్యవలన కలిగిన అనుభవముచేత ఇండియాలోను, ఇతర దేశములలోనుకూడ బహు విలువచేయబడు ఆత్మీయమైన సంగతులనుగూర్చి ఆయన నేర్పగలడని అనేకులు నమ్మిరి. గనుక ఎక్కువ ప్రార్థన ధ్యానములతో ఈ పని పూనుకొనెను. 1921-వ సం॥పు ఆరంభ మాసములలో 'మక్తబ్ యి మసీః,' అనగా 'క్రీస్తు పాఠశాల' అను పుస్తకము వ్రాయుటలో గడిపెను. దైవసందర్శనము, పాపము, రక్షణ 'ప్రార్థన' 'సేవ' 'సిలువ శ్రమయొక్క మర్మము' మొదలైన ఎంతో ముఖ్యమైన విషయములనుగూర్చి ఒక్కొక్క అధ్యాయముతో గ్రంథము వ్రాసెను. అది ఆయన ప్రసంగములవలెనే ఉపమాన దృష్టాంతములతో వ్రాయబడెను.

ఆయన టిబెట్టుకు వెళ్లిపోయినందున ఆ పుస్తకము అచ్చువేయుటలో ఆయన సవరించుటకు వీలుపడలేదు, గనుక అది 1921-వ సం॥ చివరవరకు ప్రచురింపబడలేదు, అప్పుడది ఉర్దులోను, హిందిలోను ప్రచురింపబడెను. అది ఇంగ్లీషులోనికి తర్జుమ చేయబడినప్పుడు దానికి 'ప్రభుపాద సన్నిధి' యని పేరు పెట్టబడినది. అది ప్రతిచోటను ఇంగ్లీషు ఎరిగినవారందరు చదువుకొనుచున్నారు. అది తెలుగులోనికిగూడ తర్జుమ చేయబడియున్నది.

ఈ పుస్తకము ముగించిన పిమ్మట సాధు సుందరసింగు ఉత్తర హిందూస్థానములో సువార్త బోధించుచు సంచారముచేసెను. మే మాసములో క్రైస్తవుల గొప్ప ఉత్సవము జరిగిన కాండష్ మేళాలో ప్రసంగించెను. టిబెట్టు దేశమునకు బైలుదేరకముందు సాధువు చేసిన గొప్ప పని యిదియే.

# టిబెట్టు 1921

టిబెట్టులో సాగుచేసిన పనినిగూర్చి అక్కడనుంచి తిరిగిరాగనే ఆయన ఈ క్రింది సంగతులు ఈ గ్రంథకర్తకు వ్రాసిన ఉత్తరములో తెలిపెను.

మేము కోట్ఘర్ నుండి సిమ్లా, సబాటు పట్టణములమీదుగ మే మాసారంభమందు టిబెట్టుదేశము వెళ్లుటకు బైలుదేరితిమి. టిబెట్టు కోట్ఘర్ కు సుమారు 150 మైళ్లదూరములోనున్నది. కులు అను జిల్లాలో సువార్త బోధించుటకు మంచి సమయము దొరకెను. మార్గములోని గ్రామములలోనుండు ప్రజలకును ప్రయాణికులకును సువార్త భాగములు పంచిపెట్టితిమి.

## వేడినీటి ఊటలు

కులు జిల్లాలో కొన్ని వేడినీటి ఊటలున్నవి వాటిలో కొన్ని స్నానము చేయుటకు బహు బాగుగానుండును. కొన్నింటిలో నీళ్లు పొంగుచు బహు వేడిగనున్నందున స్నానముచేయుటకు తగవు. ప్రయాణికులు తరుచుగ గుడ్డలో తమ బియ్యముకట్టి ఆ నీటిలో పెట్టినప్పుడు, పదిహేను నిమిషములలో అది ఉడుకును. ఒకప్పుడు ఒక చిన్నవాడు పొంగుచున్న ఆ ఊటలో పడిపోయి కొన్ని నిమిషములలో చనిపోగా పైకితీసిరి.

## ఒక అపాయకరమైన లోయ

సిమ్లాకు సుమారు 160 మైళ్లు దూరములో 14,000 అడుగుల యెత్తున రోటంగ్ పాస్ ఉన్నది. అది బహు అపాయకరమైనదైనందున ప్రయాణికులు మే నెల 15-వ తేదికి ముందు ఎన్నడును దానిని దాటరు. మంచువల్ల సంవత్సరములో యేడు నెలలు ఆ రోడ్డు మూయబడియుండును. దినములో పండ్రెండు గంటల తరువాత ప్రచండమైన వాయువు అక్కడ వీచును. అప్పుడు ప్రయాణికులు ప్రపాతము మీదినుండి బహు లోతుననున్న క్రింది లోయలోకి పడద్రోయబడుదురు. వందలకొలది ప్రజలును పశువులును అక్కడ తమ ప్రాణములు పోగొట్టుకొనెను. ఈ చోటికి కొన్ని

మైళ్ల దూరములో పంజాబులోని అయిదు గొప్ప నదులలో నొకటైన బియాస్‌నది పుట్టుచున్నది. వేదములు రచించిన హిందూ ఋషీ ఈ చోటికి సమీపమందలి గుహలో అనేక సంవత్సరములు తపస్సు చేసినట్లు చెప్పుదురు.

మే నెల 30-వ తేదిని ఈ పాస్‌గుండ పోవుటలో అనేక కష్టముల పాలైతిమి. మంచుపడి బహు చలిగానుండెను. మేము దానిని దాటినప్పుడు మంచు పడుచుండెను. గాలి బహు చలిగానున్నందున మాపై చర్మము రేగి బాధకరముగానుండెను. కాని ప్రాణాపాయములేకుండ మేము దాటిపోగలిగినందుకు దేవునికి స్తోత్రము. మంచుగడ్డలు క్రిందికి దొర్లినప్పుడు బహు అపాయకరముగనుండును. ఒకప్పుడు ఒక గ్రామమంతయు అట్టి గడ్డక్రింద పాతిపెట్టబడెను. ఒక మనిషైనను తప్పించుకొనలేదు. ఈ పాస్ దాటినపిమ్మట కక్‌సార్ చేరితిమి. సిస్సు, గంధత్ మొదలైన గ్రామములలో సువార్త బోధించి, కైలాంగు చేరితిమి. ఇది టిబెట్టుదగ్గర మొరేవియను మిషనువారి మూడు స్టేషనులలో నొకటి. ఇక్కడ నలువది మంది లడాఖి టిబెట్టు క్రైస్తవులున్నారు. ఇది సిమ్లాకు సుమారు 200 మైళ్ల దూరములో నున్నది. యుద్ధమైనపిమ్మట ఇక్కడికి ఐరోపా మిషనెరీలు ఎవరును వెళ్లియుండలేదు. ముప్పది మందితో ఒక చక్కని కూటము జరిపితిమి.

## నర బలి

అక్కడ ఒక చెట్టున్నది. దానిని యిప్పుడు నరికివేసిరి. దానిక్రింద ప్రజలు నరబలులు అర్పించెడివారు. దానిని మానివేయుటకు ఈ కథ చెప్పుదురు. ఎనిమిదేండ్ల వయస్సువాడైన ఒకే కుమారుడు కలిగిన ఒక విధవరాలుండెను. వానిని అర్పించవలసినవంతు వచ్చినప్పుడు అక్కడి లామా లేక బుద్ధ గురువు ఆమె యేడ్చుచుండుట విని, 'అమ్మా యేడ్వవద్దు, నేను వెళ్లి నీ కొమరునికి బదులు బలియగుదున'ని చెప్పెను. నియమిత కాలము వచ్చినప్పుడు ఆ లామా వెళ్లి చెట్టుక్రింద కూర్చుండి, ప్రజలతో 'నన్ను ముట్టుకొనవలదు, దేవుండ్లు సత్యమైతే వారే వచ్చి నన్ను ముక్కలుగ కోయనిండని' చెప్పెను. ప్రజలు కనిపెట్టిరిగాని యేమియు సంభవింపకపోయినప్పుడు ఆ లామాను ప్రజలును దేవుండ్లమీది విశ్వాసము పోయినందున నరబలులు మానివేసిరి.

## తరుచుగ ప్రయాసములలోను

నేనును నాతో వచ్చిన మరి యిద్దరును టిబెట్టులో మరియొక దారిని ప్రవేశించితిమి. వారిలో నొకడు క్రైస్తవుడు. టిబెట్టు పడమట వైపున సువార్త బోధించుటకును వందలకొలది సువార్త పత్రికలు పంచిపెట్టుటకును మంచి సమయము దొరకెను. చుప్రాంగ్, గ్యానామా, రుక్షుల్ మొదలైన యిప్పది యేడు పట్టణములు గ్రామములు దర్శించితిమి. కొందరు లామాలు మాకు విరోధముగనున్నను, గ్రామములలోని ప్రజలు సంతోషముగ మా బోధ వినిరి. కొన్ని మఠములు, గుహలుకూడ దర్శించితిమి. అక్కడనున్న సన్యాసులు మేమిచ్చిన వేదవాక్యభాగములు చదువుదుమని వాగ్దత్తము చేసిరి. కాని మేము వారితో పదిహేను నిమిషములకంటె నెక్కువ కాలముండుటకు ఒప్పుకొనలేదు.

## తరుచుగ అపాయములలోను

టిబెట్టులో ప్రయాణము చేయుటకు బహు కష్టమును అపాయకరమునై యున్నది. అక్కడ రోడ్లు ఎంతమాత్రమును లేవు. ఆ ప్రదేశమందు ప్రజలు బహుకొద్ది. 60 లేక 70 మైళ్లు నడచినను ఒక గ్రామమైనను కనిపించదు. ఈ యరణ్యములలో నివసించువారు ఒక విధమైన యెఱుకలవారు. వారు డేరాలలోను, గుహలలోను, నిద్రించుదురు. ప్రజలను దోచుకొని జీవనము చేతురు. అక్కడ తోడేండ్లును, అడవి యాక్ అను మృగములునున్నవి. అనేకమంది ఈ యరణ్యప్రదేశములు దాటి పోవుటలో తమ ప్రాణములు పోగొట్టుకొనిరి. ఒకనాడు నాతో వచ్చుచున్న వారికి ముందు నేను నడచుచుండగా యాక్ అను మృగము నా మీదికి పరుగెత్తుకొని వచ్చుట చూచితిని. నా దురదృష్టముచేత నేనెక్కుటకు సమీపములో ఏచెట్టును లేక పోయెను. కాని ఒక పెద్ద గుట్ట దగ్గరనుండగా నేను పరుగెత్తి దానిపైకెక్కి కూర్చుంటిని. ఆ యుగ్రమైన మృగము ఆ బండచుట్టు పరుగెత్తెనుగాని నేను సురక్షితముగనుంటిని. ఈ యాశ్రయముకొరకు దేవుని స్తుతించుచు, ప్రార్థించుకొనుచుంటిని. యేసు ప్రభువను ఉగాద్రినిగూర్చి తలంచుకొనినప్పుడు నా హృదయములో అద్భుతమైన సమాధానము కలిగెను.

దూరమునుండి నా స్నేహితులు ఆ యాక్ అను మృగమును చూచి కేకలువేయ మొదలుపెట్టిరి. ఆ శబ్దము విని గ్రామములోని యెరుకలవాండ్లు

తమ డేరాలలోనుండి గుహలలోనుండి వెలుపలికి వచ్చి రాళ్లు రువ్వి దానిని పారదోలిరి. ఆ రాత్రి ఆ యెరుకలవాండ్లతో గడపవ నిశ్చయించితిమిగాని అక్కడ మరియొక అపాయముండెను. ఎందుకనిన అడవి మనుష్యులు అడవి మృగములకంటె యెక్కువ హానికరమైనవారు. ఈ దొంగలు బలవంతముగ మా దగ్గరనున్న ప్రతి వస్తువు తీసికొనిరి, కాని మా ప్రాణము తీసికొననందుకు దేవుని స్తుతించితిమి. అప్పుడు నేను వారితో 'మీరు మా యొద్ద నుండి ప్రతివస్తువు తీసికొంటిరి కాని మా యొద్ద మీకిచ్చుటకు ఇంకను మరియొక వస్తువున్నదని' చెప్పి వారికి బోధింప మొదలు పెట్టితిని. వారు మా మాటలు వినినప్పుడు వారి హృదయములలో పరిశుద్ధాత్మ పనిచేయ మొదలుబెట్టగ, వారు మా వస్తువులు దొంగిలించినందుకు తమ్మును క్షమింపుమని చెప్పి, మా వస్తువులన్నియు మా కిచ్చివేసిరి.

అప్పుడు మరియొక కష్టము సంభవించెను. ఆ యెరుకలవాండ్లు మా కొరకు తేనీళ్లు సిద్ధముచేసి, దానిలో పాలు చక్కెరకు బదులు ఉప్పు వెన్న కలిపిరి. ఆ నీళ్లు ఒక పాత్రలో పోయబోవుచుండగా ఆ పాత్రను నన్ను మొదట కడుగనియ్యుమని అడిగితిని. అప్పుడు వారిలో పెద్దవాడు, 'ఓహో, అది కూడదు, మీరు మా అతిథి గనుక మేము మిమ్మును మర్యాదచేయవలెను గాని ఆ పాత్రను మిమ్మును కడుగనియ్యకూడదు. నేనే శుభ్రముచేతునని చెప్పి, కనీసము ఆరంగుళములు పొడవైన తన నాలుకను చాచి నాకసాగెను. వాని నాలుక ఆ పాత్ర అనుగంట గలిగినంత పొడవుగనుండెను. అలాగు నాకి దానిలో తేనీళ్లు పోసెను, అప్పుడు నేనా తేనీళ్లతో దానిని కడిగి ఆ నీళ్లు పారబోసితిని. అది చూచి వాడు బహు ఆశ్చర్యపడినప్పుడు టిబెట్టు దేశస్థుడైన నా సహచరుడు, భుజింపక పూర్వము తమ చేతులు పాత్రలు కడుగుకొనుట ఇండియనుల వాడుకని వానికి వివరించెను. అందుకు వాడు, అది బహు పిచ్చి వాడుక, ఆలాగైతే ప్రతిదినము మన కడుపుకూడా కడుగవలసినదేనని చెప్పెను.

అప్పుడు మేము సాంపా, లేక, వేపిన యవలపిండి తేనీళ్లు త్రాగి, ప్రార్థనచేసి, పరుండి మేము బహు అలసియున్నందున వెంటనే నిద్రపోతిమి, మరునాడు రక్షకునిగూర్చి వారితో మరికొంత చెప్పి, ప్రార్థించి, ముప్పది మైళ్ల దూరములోనున్న మరియొక గ్రామమునకు బయలుదేరితిమి.

# ఒక దుర్వార్త

ఆ సమయమందు అక్కడ కొన్ని గ్రామములలో పనిచేయుచుండగ కొన్నేండ్ల క్రిందట నేను బాప్తిస్మమిచ్చిన టి. వాంగ్డి అనువాడు చనిపోయి నట్టు కొందరు వర్తకులు నాతో చెప్పిరి. వాడు చనిపోయిన పిదప అక్కడి క్రైస్తవులు చెదిరిపోయిరన్న దుర్వార్త వింటినిగాని దేవుని చిత్తము నెరవేరును గాక అంధకారముతో మూయబడియున్న ఆ దేశమును తన పాదముల యొద్దకు నడిపింపగల నిజమైన క్రైస్తవుల ననేకులను ఆయనే తన కాలమందు లేపగలడని నేను నమ్ముచున్నాను. దేవుని మహిమకొరకును అనేకుల రక్షణ కొరకును జరుపబడిన పనిని ఆయనాశీర్వదించి ఫలభరితముగ జేయవలెనని ప్రార్థించుచున్నాను. ఆమెన్.

సాధు సుందరసింగు

## లోకమంతకు సువార్త—2

టిబెట్టునుండి తిరిగివచ్చి 1921 సంవత్సరము చలికాలము సాధువు పంజాబులోను, ఐక్యపరగణాలలోను సువార్త బోధించుచు సంచారము చేయుటలో గడిపెను. పశ్చిమదేశమునకు తిరిగి పోవుటకై ధ్యానముతో సిద్ధపడుటకొరకు సబాటు అనే చోటికి తరుచుగ పోవుచుండెను. అక్కడ దేవుని సేవకొరకు సిద్ధపడుచున్న యిద్దరు యౌవనులైన సాధువులను దర్శించి వారికి సహాయము చేయుచుండెను.

1920 యో సంవత్సరములో సాధు సుందరసింగు ఇంగ్లాండు, అమెరికా, ఆస్ట్రేలియా దేశములు తొందరగా దర్శించినందున 1922 సంవత్సరములో ఆయన పశ్చిమ దేశములను తిరిగి దర్శింపవలసివచ్చెను. అన్నిచోట్ల నుండి అన్ని స్థితిగతులలోని ప్రజలు ఆయన తమ్మునువచ్చి దర్శించుమని పిలిచినందుననే ఆయన యీ ప్రయాణము పూనుకొనలేదుగాని, డాక్టరు జాన్ హాంటరు అను ఆయన యీ క్రింది మాటలలో సాధువు మతసంబంధమైన సంస్కరణము జరుగుచున్న ఇటువంటి ముఖ్యమైన దినములలో తన దేశమును విడిచి వెళ్లుటకుండు కారణమును స్పష్టముగా దెలుపుచున్నాడు.

మతసంబంధమైన ఉజ్జీవమే మన ముఖ్యావసరము, కాని అది ఏదో అపాయమునుండి తప్పించుకొని భద్రమైన పదవిని పొందవలెననిగాని, మత

సంబంధమైన తర్కములలో పాలుపొందవలెనని గాని ఆసక్తి కనుపరచుట యందు కాదు, గాని దైవదర్శనముచేత లోలోపల నిద్రమత్తుగనున్న మనస్సు మేల్కొలుపు నొందుటయే మనకు ప్రస్తుతకాలములో కావలసియున్నది.

పశ్చిమ దేశమందు సాధువుకు కలిగిన యనుభవము మరియొక గ్రంథ కర్తయొక్క యీ క్రింది మాటలలో చెప్పబడును.

'ఐరోపా దేశము ఇంతలో నశించిపోవునని నేను నమ్ముటలేదు. కాని ఐరోపాదేశ ప్రజలలో ప్రచండమైన ఆత్మోజ్జీవముకలిగి మనస్సు సంపూర్ణ ముగ మారికపోయినయెడల ఆ దేశమునకు గొప్ప విపత్తులు సంభవించునని నేను తలంచుచున్నాను.'

అందుచేత టిబెట్టు దేశమును దర్శింపక పూర్వమే తనను దేవుడు సురక్షితముగ తిరిగి రక్షించినయెడల పశ్చిమ దేశమును మరల దర్శింప నిశ్చయించెను.

సర్దార్ షేర్‌సింగ్ తన కొమరుని కోరికనుగూర్చి తెలిసికొనగానే ఆయన ఐరోపా దేశమును దర్శించుటకు కావలసిన ద్రవ్యము నిచ్చుటకు తిరిగి పూనుకొనెను. (కాని స్విట్జర్లాండులోని స్నేహితులు ఈ ద్రవ్యమును పిదప చెల్లించిరి.) 1922 సంవత్సరారంభములో తన ప్రయాణ సన్నాహము చేసికొనుటకు సాధు సుందరసింగు బొంబాయిచేరెను. ఐరోపాకు మాత్రము కాక ఐగుప్తు, పాలస్తీనాలకు పోవుటకుకూడ ఉత్తరవు దొరకగా ఆయ నెంతో సంతోషించెను. మరియు సర్ విల్యమ్ విల్‌కాక్సు ప్రభువు ఆయ నను ఆ ప్రదేశములకు తన యతిథిగా రమ్మని ఆహ్వానమిచ్చినప్పుడు ఆయ నకు పరమానందము కలిగెను. ఆయన ఓడెక్కక పూర్వము అరణ్యములో మహాత్మగాంధితో రెండు దినములు గడుపుటకు రమ్మని పిలువగా అట్లు చేయు టకు కాలము దొరికెను. (ఈ దర్శనము రాచకార్యములతో సంబంధించినది కాదు). జనవరినెల 29 తేది కలిదోనియా అను పేరుగల ఓడెక్కి, పోర్టు సేడ్‌లో దిగి వెంటనే పాలిస్థానమునకు పోయెను.

## పరిశుద్ధ దేశములో

సాధువు క్రైస్తవుడైన పదహారు సంవత్సరములనుండి ఆయన మన స్సులో నుండిన కోరిక నేటికి యీడేరెను. మనుష్యకుమారుని అడుగు జాడలు తాను త్రొక్కుచుండగ ఆయనకు కలిగిన పరమానందానుభవములు

ఎవరు వర్ణింపగలరు? ఆయన ఒక చోటునుండి మరియొక చోటికి పోవుచుండగ తన ప్రభువు జరిగించినట్లు వ్రాయబడిన కార్యములన్నియు ఆయన మనస్సులోనికి వచ్చెను. ఇన్ని శతాబ్దములుగా పరరాజుల క్రూరపరిపాలన వలన మారిన ఆ ప్రదేశము తన 'ప్రభువు వసించిన ప్రదేశము' అను గొప్ప సత్యమునకెట్టి మార్పును కలిగింపలేదు. అక్కడనే ప్రభువు తన గొప్ప పరిచర్యను జరిగించి, శ్రమ ననుభవించి, చనిపోయి, మృత్యువుమీద జయోత్సవము నొందెనని ఆయనకెంతో ఆనందము కలిగెను. అక్కడ ప్రతిచోటను ఆయనకు అద్భుతమైన ఆత్మీయానుభవము కలిగినందున ప్రార్థన స్తోత్రములతో ఆయన హృదయము నిండి పొర్లుచుండెను.

ఒలీవ కొండమీదను, గెత్సెమనె తోటలోను అనేక ఘడియలు ప్రార్థనయందు గడిపినప్పుడు, సాధువు తన్ను విశేషమైనరీతిగ ప్రభువు సేవకు తిరిగి ప్రతిష్ఠించుకొన కలిగెను. క్రీస్తు ప్రభువు తన ప్రక్కను నిలువబడి, తన శిష్యులతో చెప్పినట్లు, 'మీకు సమాధానమగుగాక; తండ్రి నన్ను పంపిన ప్రకారము నేనును మిమ్మును పంపుచున్నాన'ని తనతో చెప్పినట్లు ఆయనకు తోచెను. అంతట తన మోకాళ్లమీదనుండి లేచినప్పుడు లోకమంతకు తనను సాక్షిగా పంపినట్లు ఆయన గ్రహించెను.

ఆ యద్భుతమైన దినములలో ఆయన యెరూషలేము దాటి, బేతనియ, ఎరిఖో, మృతసముద్రము, యొర్దానునది (దీనిలో ఆయన స్నానము చేసెను) బేత్లెహేము, హెబ్రోను, రామా, బెతేలు, నజరేతు తిబిరియ, మగ్దాల, కపెర్నహూము, గలిలైయ సముద్రము మొదలైన పరిశుద్ధ స్థలములు దర్శించినంతసేపు క్రీస్తుప్రభువు తనతోనుండినట్లు స్పష్టముగ గ్రహించెను. 'నేనెక్కడికి పోయినను ఆయన నాతోకూడ నుండెను. ఆయన నా కుడిప్రక్కను నడుచుచున్నాడ'ని సాధు చెప్పెను. తన ప్రభువుతో అద్భుతమైన సహవాసముచేసిన ఎన్నటికి మరువజాలని యా దినములలో ఆయన కండ్లనుండి కృతజ్ఞతా బాష్పములు తరుచుగా కారెనననిన యాశ్చర్యముకాదు. అంతట అక్కడనుండి బయలుదేరునప్పుడు ఎన్నటికి మరువజాలని ఆత్మీయాశీర్వాదములను పొందినట్లును, తనకు ముందు కలుగబోవు శ్రమలను తాను చేయవలసిన సేవయు తనకు తెలుపబడినందున అందుకొరకు తనను విశేషమైనరీతిగ ప్రతిష్ఠించుకొనినట్లును, ఆయన గ్రహించెను.

యెరూషలేము అధ్యక్షుని ఆలయములోను ఇతరచోట్లను ఆయన ప్రసంగించెను. కైరోపట్టణములో అమెరికనుల ఆలయములోను పాత

కైరో పట్టణములో కాప్టిక్ క్రైస్తవులకును ప్రసంగించెను. ఆయన పిరమిడ్సును సమాధులను దర్శించెను. యేసుప్రభువు ఐగుప్తుకు తీసికొని పోబడి నప్పుడు నివసించినట్లు చెప్పబడిన యిల్లుండినచోట కట్టబడిన ఆలయములోకి ఆయన తీసికొనిపోబడెను.

మరుసటి ఆదివారమున ఆయన మార్సెల్సులో ప్రసంగించి, అక్కడి నుండి రోముకు ప్రయాసముతో జరిపిన పరిచర్య నారంభించెను.

## స్విడ్జర్లాండులో

సాధు ఫిబ్రవరినెల 27-వ తేదిని లాసేన్ పట్టణముచేరి, మరుసటి దినము బియెన్ పట్టణములో గొప్ప కూటము జరిపెను. కాని ఆ మరుసటి దినము టావెన్సు పట్టణములో మైదానముమీద జరిగిన కూటమునకు మూడువేలమంది కంటె ఎక్కువ ప్రజలు చుట్టునున్న గ్రామములనుండి వచ్చిరి. బాగుగ వినగలుటకు అనేకమంది చెట్లమీదికెక్కిరి. ప్రసంగమైన పిమ్మట వారిలో కొందరు, 'ఆ రక్షకుని గూర్చినదైనను ఇది క్రొత్త మతమ'ని చెప్పకొనిరి. మరునాడు దట్టమైన మంచు కురియ నారంభించినను, దానివలన ప్రజలు మంచుతో కప్పబడిన పర్వతములమీది ఒక గ్రామములో యేసునాధుని గూర్చిన పాత కథను నూతన విధముగ వినుటకు గొప్ప గుంపుగా కూడివచ్చుటకు ఆటంకము కలుగలేదు.

జినీవా పట్టణములో ఆయా జనాంగముల ప్రతినిధులు లోకములో సమాధానముకొరకు కూడుకొనిన గొప్ప శాలలో రెండు పర్యాయములు బోధించెను. అది గొప్ప కట్టడమైనను వేలకొలది వచ్చినందున అనేకులు తిరిగిపోవలసివచ్చెను. రెండు వందలమందికంటె నెక్కువమంది బోధకుల కొరకు జరిగిన ఒక విశేషమైన కూటములో ఆయన మాట్లాడెను. జినీవా నుండి న్యూషెట్టల్ పట్టణమునకు వెళ్లి ఆయన వర్తమానమును వినుటకు వచ్చిన పదివేలమందికి బోధించగా, అక్కడ అనేకమంది మారుమనస్సు పొందిరి. ఇతర పట్టణములను దర్శించి జర్మన్ స్విడ్జర్లాండులో ప్రవేశించి, బాజల్, బర్న్, తున్, జ్యూరిక్, సెంటుగల్లి మొదలైన పట్టణములలో ప్రసంగించి మార్చినెల 29-వ తేది నాటికి ఆ దేశములో తాను జరుపవలసిన పనిని ముగించెను.

## జర్మనీలో

స్విజ్జర్లాండునుండి జర్మనీకి వెళ్లినప్పుడు సాధువిట్లు వ్రాసెను:—మత దిద్దుబాటుకు ఊరెయిల అనదగిన విట్టెన్ బర్గుకు నిన్నటి దినము వెళ్లితిని. అక్కడ మార్టిన్ లూథరు నివసించిన యింటిని, ఆయన ప్రసంగించిన ఆలయమును చూచితిని, ఆ యాలయపు తలుపుమీద మత దిద్దుబాటునుగూర్చి తొంబదియైదు అంశములు వ్రాసియుంచెను. ఆయన ప్రేత ఆలయములోనే పాతిపెట్టబడెను. నేటి సాయంత్రమునే నా గుడిలో ప్రసంగింతును. ఆ పురాతన పట్టణములో వేదాంత విద్యార్థులతోను ఉపాధ్యాయులతోను మాట్లాడెను.

హాల్ అను పట్టణములో జర్మనీలోని గొప్ప మిషనెరీ సొసైటీల ప్రతినిధుల కాన్ఫరెన్సులో కలిసికొని వారితో మాట్లాడెను. లీప్సిక్ పట్టణములో సర్వకళాశాల ఉపాధ్యాయులకును విద్యార్థులకును ఉపన్యసించెను. హాంబర్గు, బర్లిన్, కీల్ మొదలైన పట్టణములలో ప్రసంగించుచున్నందున అత్యవసరమైన యుత్తరములు వ్రాయుటకైనను కాలము లేకపోయెను. కాని యా కూటములు బహు గొప్పవై, ఎక్కువ ఆశీర్వాదము కలిగినదనిమాత్రము వ్రాసి పంపెను.

## స్వీడన్‌లో

ఏప్రిల్ నెల 13-వ తేదిని ఆయన టెర్రిన్ జ్ పట్టణమునకువెళ్లి అక్కడినుండి ఆ దేశములోని పట్టణములలోను గ్రామములలోను ప్రయాసతో కూడిన పరిచర్యను జరిపెను. మార్గములో కోపెన్‌హేగన్ పట్టణములో కొంచెము కాలముగడిపి, అక్కడి అధ్యక్షులవారితో భోజనము చేసెను. హెల్సిన్ బర్గు, లండ్ మొదలైన చోట్ల గొప్ప కూటములు జరిపి, సాధువు అప్సాలా అను ముఖ్యపట్టణము చేరెను. అక్కడ ఆర్చి బిషపుగారింట బసచేసెను. ఆయనయే గొప్ప దేవాలయములోను సర్వకళాశాల మొదలైన చోట్ల ఆయన ప్రసంగములను తర్జుమాచేసెను. సాధువు అప్సాలాకు రాకముందు అక్కడి ఆర్చి బిషపు 'లూథరు సుందరసింగు' అను పేరున ఒక పుస్తకము వ్రాసెను ఆ పేరు చూడగా అక్కడి ప్రజలు తాము ఎంతో గౌరవముతో చూచెడు లూథరు పేరు సుందరసింగుతో నొకటిగ చేర్చుటనుగూర్చి ఆశ్చర్యపడసాగిరి.

ఈ యార్చి బిషపు క్రైస్తవ మర్మములు ఒక హిందువుని మనస్సులో పనిచేయు రీతినిగూర్చి వ్రాసిన సంగతులు ఈ పుస్తకము చివరను కనుపించును.

స్టాక్‌హోమ్ పట్టణములో స్వీడన్ దేశపు రాజుగారి సోదరుడైన ఆస్కారు యువరాజు ఇంట బసచేసెను. ఆయన భక్తిపరుడని, ప్రతి మంచి కార్యములో ఆసక్తిపరుడని ప్రసిద్ధిగాంచి యుండెను. ఈ సంగతి చెప్పుచు, సాధువు, కాని నేనెల్లప్పుడు సమాధాన ప్రభువుతోను వసించుచున్నాను. ఆస్కారు ప్రభువు ఎంతో ఆత్మీయానుభవముగలవాడు, ఆయనతోను ఆయన కుటుంబముతో బసచేయుట నాకు నిజముగానే ఆనందకరముగ నుండెనని చెప్పెను.

స్టాక్‌హోమను శృంగారమైన పట్టణము విడిచి సాధువు అనేక చిన్న గ్రామములు దర్శించెను. ‘ఈ దేశములోని కొన్ని సొగసైన గ్రామములలో ప్రసంగించుచున్నాను, ప్రజలు కూటములకు డెబ్బది మైళ్ల దూరమునుండి వచ్చుచున్నారు’ని వ్రాసెను. అక్కడినుండి స్నేహితులు వ్రాసిన యుత్తరములలో ‘ఆయన ప్రసంగములను వినుటకు వచ్చెడు ప్రజలను తెచ్చుటకు విశేషముగ పొగబండ్లను నడిపింపవలసివచ్చెను’ని వ్రాసెను. ‘ఇంతటి కూటములను మేమెన్నడు చూడలేదు’ని మరియొకరు వ్రాసిరి. స్టాక్‌హోములోను ఇతర చిన్న పట్టణములలోను అక్కడనున్న పెద్ద కట్టడములలో వచ్చిన గుంపులకు స్థలములు చాలకపోయెను, అందుచేత ప్రజలు తరుచుగ కూటమునకు ముందుగావచ్చి, కూటములు జరుగువరకు వర్షములో ఓపికతో నిలువవలసివచ్చెను. ఈలాగే స్విట్జర్లాండులోను, ఎక్కువగా జినీవాలోను, తరుచుగ సంభవించెను. అప్పుడు కూడిన గుంపులలో ఎనుబదినాలుగేండ్ల వయస్సుగల ఒక వృద్ధురాలు సాధువును తప్పకచూచి, ఆయన ప్రసంగమును వినవలెనని యుండెను. మొదటిదినమున ఆమె రెండు గంటలసేపు నిలువబడినందున సొమ్మసిల్లి పడిపోగా తీసికొని పోబడెను. రెండవనాడు కూడ అట్లే జరిగెను, కాని మూడవనాడు ఆమెకోరికె సమకూడెను. అప్పుడామె సాధువుకు పెద్ద ఉత్తరము వ్రాసి ఆయన మాటలు వినినందున తనకు కలిగిన ఆనందమునుగూర్చి ఆశీర్వాదమునుగూర్చి తెలిపెను. ఆయన ఈ సంగతి చెప్పుచు, ‘ఆమె నన్ను చూచెనుగాని నేనామె నెన్నడు చూడలేద’నెను.

స్విట్జర్లాండులోను స్వీడన్‌లోను తమ జీవితమును ప్రభువుకు వశపరచని యనేకులు సాధువు పరిచర్యక్రింద క్రీస్తుప్రభువుకు తమ్మును తాము

సమర్పించుకొనిరి. ఈలాగు నిశ్చింతగనున్న వారిలో ఆత్మోజ్జీవము కలుగుటయేకాక అన్ని జనాంగముల యొక్కరలను ప్రభువు సువార్త తీర్చుటకు శక్తి గలదైయున్నదన్న విశ్వాసము అనేకుల హృదయములలో నూతనముగ జనించెను. అందుకు ఫలితముగ మిషనెరీ పనికొరకు చందాలు ఆపు చేసిన వారు తిరిగి ద్రవ్యమునిచ్చిరి. మరికొందరు క్రీస్తు నెరుగని యితర దేశములలోని యాత్రికులకు సువార్తను తీసికొనిపోవలెనను దేవుని పిలుపును వినిరి.

ఒక రష్యాదేశస్థురాలు, మేము వినే భాగ్యము కలిగిన సాధువుయొక్క బలమైన వర్తమానములు రష్యను భాషలోకి తర్జుమాచేయబడి అనేకులకు ఆశీర్వాదముగనుండెను. మేమాయనకొరకు ప్రతిదినము ప్రార్థించుచున్నాము, మా మోకాళ్లమీద ప్రతిచోటికి ఆయనను వెంబడింతుమని వ్రాసెను.

## నార్వే, డెన్మార్కు, హాలండులో

స్వీడెన్ నుండి సాధువు నార్వేకువెళ్లి తన కాలమైపోవుచున్నందున పది దినములు మాత్రమే ఆ దేశమునకియ్య గలిగెను. రాజధానికి అరువది మైళ్ల దూరమునమన్న హార్డల్ అను పట్టణమునకువెళ్లి అక్కడ పెద్దకూటము జరిపెను. క్రిస్టియానాలో అనేక కూటములు జరిపెను, దానిలో నొకటి సర్వకళాశాల విద్యార్థులకొరకై యుండెను. ఆ పట్టణములో జరిగిన పెద్ద కూటములలో నొకదానియందు 3000 మంది ఆయన ప్రసంగమును ఊపిరి బిగియపట్టుకొని వినిరి. ఇతర స్థలములను దర్శించి మే నెల 24-వ తేదిని డెన్మార్కు విడిచి వెళ్లెను.

అంతకుముందే పరదేశములో ఎక్కువుగ ప్రయాణముచేయుచు ఎడతెగకుండ పరభాషలో మాట్లాడుచున్నందున ఆయన మనస్సులోను శరీరములోను గొప్ప అయాసము ననుభవించుచుండెను. 1918-వ సంవత్సరమందు దక్షిణ యిండియాలోవలెనే ఆయన అలసిపోయెననిగాని, ఆయనకు విశ్రాంతి కావలెననిగాని, పరదేశస్థుల భాషలు ఎంత వ్యత్యాసముగనున్నవో అంత వ్యత్యాసముగనున్న పరిస్థితులుగల పరదేశములో విరామములేకుండ పాటుపడుటవలన ఆయన ఆత్మీయముగా డస్సిపోవుననిగాని, విచారించినవారు లేకపోయిరి. ఆయన శరీర విశ్రాంతికేగాక, ఆయన జీవమునకు ఊపిరిని, ఆయన శక్తికి ఆధారమునైన ప్రార్థనధ్యానములకు కావలసిన కాలము కొరకును ఆసన్నుడైయుండెను. ఇది యెంతో అవసరమైనందున ఇంగ్లాండుకు

రమ్మను పిలుపులన్నియు నిరాకరించి, కెస్విక్కును దర్శింతునని చేసిన వాగ్దత్త మును మాత్రము నెరవేర్చగలిగెను. ఫిన్లాండు, రష్యా, ఇటలీ, గ్రీస్, పోర్చుగల్, సర్వియా, రొమేనియా, పడమటి యిండీసు, అమెరికా, న్యూజీలాండులకు రమ్మని పిలిచినప్పటికి ఆయన వెళ్లలేకపోయెను. కెస్విక్ కన్వెన్షను నుండి తిన్నగా యిండియాకు తిరిగి వెళ్లునట్లు ఏర్పాటులు చేయబడెను.

డెన్మార్కుకు వెళ్లినప్పుడు సాధువు కోపెన్‌హేగన్‌లో గడిపెను. అనేక కూటములలో మాట్లాడుటయేగాక రష్యా చక్రవర్తి తల్లిగారిని దర్శిం. చుటకు పిలువబడెను మే నెల 27-వ తేదిని యీ విశేషమైన సమావేశము కలిగెను. సంభాషణరైన పిదప సాధువును తన్ను ఆశీర్వదింపుమని రాణిగారు కోరిరి. కాని ఆయనెంతో వినయముతో దైవగ్రంథమును ఒకప్పుడు చింపిన చేతులతో నెవరిని ఆశీర్వదింప పాత్రుడనుకానని, మేకులతో గ్రుచ్చబడిన ఆయన చేతులే ఆమెనుగాని మరి యెవరినిగాని యాశీర్వదింప గలవని ప్రత్యుత్తరమిచ్చెను.

అక్కడినుండి అనేక యితర పట్టణములను దర్శించెను. స్లాగెల్సె అను చోట గొప్ప సమూహము కూడినందున ఒక గొప్ప తోటలో కూటము జరుపవలసివచ్చెను, పండలకొలది జనులు కూటము ఆరంభింపక పూర్వము అనేక గంటలసేపు నిలువబడియుండిరి. అనేకులు చెట్లమీదను చుట్టునున్న యిండ్ల కప్పులమీదను కూర్చుండిరి. సాధువు తన యనుభవ సాక్ష్యమునిచ్చి, మనుష్యులను రక్షించుటకు క్రీస్తునాధునికిగల శక్తినిగూర్చి చెప్పుచుండగా, వినువారికంట వారికి తెలియకుండనే నీరు కారెను.

డేనిష్ కెస్విక్ అనదగిన హైబోర్గులోకూడ నట్లే సంభవించెను. అన్నిటికంటె నెక్కువుగ తన ప్రభువును ప్రేమించిన యీ సాధువుయొక్క సాక్ష్యమును వినిన యీ గొప్ప సమూహములో నిశ్శబ్దముగా నిట్టూర్పులు విడుచు గంభీరమైన శబ్దము వినిపించెను.

జూన్ నెల 2-వ తేదిని హార్నింగులో మైదానముమీద జరిగిన గొప్పకూటము నాలుగేండ్ల క్రిందట తిరువాన్కూరులో జరిగిన సిరియన్ భక్తికూటమును మన సాధువు మనస్సులోనికి తెచ్చెను. చుట్టుప్రక్కలనుండి కూడివచ్చిన 15000 మంది నిశ్శబ్దముగా దేవుని వర్తమానమును వినిరి. పరిశుద్ధాత్మచే సిద్ధపరచబడిన యనేక హృదయములు దానిని అంగీకరించెను. డెన్మార్కులో చివరి కూటము టిస్ట్లే అను పట్టణములో జరిగెను. అక్కడ 9000 మంది

కంటె నెక్కువమంది కూడిరి. ఇక్కడను అనేకమైన యితర స్థలములలోను అనేకమంది తాము పొందిన ఆత్మీయాశీర్వాదమును గూర్చి సాక్ష్యమిచ్చిరి.

జూను నెల 5-వ తేదిని సాధువు హాలండు విడిచి హాంబర్గుకుండ పోయెను. అప్పుడు రెండవసారి ఆసక్తిగల క్రైస్తవురాలైన ఆస్ట్రియా రాచకుటుంబమునకు చెందిన ఫ్రాబోర్ దొరసానిగారు ఆయనకు ఆతిథ్యమిచ్చెను. హాలండులో గొప్ప ప్రభువు ఆయనకు ఆతిథ్యమిచ్చుటయేగాక ఆయన పనికి తగిన ఏర్పాటులు చేసెను. డిబిల్ట్ అను సొగసైన పురాతన పట్టణములోను ఆమ్స్టర్డామ్ మొదలైన మరి ఆరు పట్టణములలోను కూటములు జరిగెను. ఉట్రెక్ట్ అను పట్టణములో నాలుగు సర్వకళాశాలలలోని విద్యార్థులు ఆయన ప్రసంగము వినుటకు కూడి వచ్చిరి.

ఈ ప్రభువు ఒక విశేషమైన కూటమును ఏర్పాటుచేసి కొద్దిమంది యైనను హాలండు దేశములోని గొప్పవారు అనగా రాచకార్య నిపుణులు, గొప్ప పండితులు, వర్తకులు, మత ముఖ్యులు మొదలైన నూరుగురిని పోగు చేసెను.

ఈ విధముగా మన సాధు అనుభవములో బహు ప్రయాసతోను కష్టముతోను జరిగించిన సేవ ముగిసెను.

## అనేక పర్యాయములు ప్రయాణములలోను

పట్టణములలో ఆపదలలోను......ప్రయాసతోను కష్టములతోను (2 కొరింథీ 11: 26, 27.) నా ద్వారా సువార్త పూర్ణముగా ప్రకటింపబడు నిమిత్తమును అన్యజనులందరును దాని వినునిమిత్తమును ప్రభువు నా ప్రక్కను నిలిచి నన్ను బలపరిచెను (2 తిమో. 4: 17.)

సాధువు ఇంగ్లాండులో దిగినప్పుడు ఆయన పాత స్నేహితులు ఆయన బహుగా అలసి శరీరములోను మనస్సులోను బహు బలహీనముగానున్నట్లు కనిపెట్టిరి. సాధ్యమైతే ఆయన మట్టుకు వెంటనే యిండియాకు బయలు దేరినయెడల బాగుండునుకాని కెస్విక్ భక్తికూటములో మాట్లాడుదునని చేసిన వాగ్దత్తమును నెరవేర్చుట తన విధియని తలంచెను. అందుకొరకు కని పెట్టుచుండిన కాలము ఆయనకు బహు కష్టముగా నుండెను. అనేకమంది స్నేహితులు తమతో నుండుమని పిలిచినప్పుడు ఆయన ఒప్పుకొనలేదు. తన నెప్పుడు చూడని ఒక దొరసాని అలాగు తనను పిలిచినప్పుడు ఆయన హృద

యము కరిగెను. ఆమె తానే దీర్ఘకాలము రోగియైయుండి వెలపలికి రాలేక పోయినను, ఆయన బహు అలసి గొంతుకనొప్పితో బాధపడుచున్నట్టు విని, ఆయన నెమ్మదిగ విశ్రాంతి పొందుటకు తగిన స్థలమును సిద్ధపరచుటయేగాక, 350 మైళ్లు దూరము ప్రయాణముచేసి, ఆయనకు కావలసిన వైద్యుని వెతుక పోయెను. ఇంత దీర్ఘ ప్రయాణపు ఖర్చును బాధకరమైన ఆయాసమును, ఆయనకొరకు ఏదైన చేయగలిగితే చాలునని ఆమె సహించెను.

వారము తరువాత వారము గడువగా ఈలాగు విరామము లేకుండ ఆరు నెలలు పశ్చిమ దేశములో పనిచేయుట పలువిధముల గొప్ప భారమైనట్టు స్పష్టమాయెను. ఈ పని చేయుటయు, ఇంతకాలము ఈలాగు జీవించుటయు ఎంత ప్రయాసమో ఆయన ఎవరికొరకు ఈ పరిచర్య చేసెనో వారు గ్రహించ లేకపోయిరి. సాధువుతో సమీపముగా సంచరించినవారి యీలాగు ఆత్మీయమైన కార్యములలో అధికముగా నెప్పుడు పాటుపడువారు తాము వసించు స్థానములవలన ఎట్టి ఆత్మీయ సహాయముపొందుదురో గ్రహించ గలరు. గతించిన పదునారేండ్లనుండి కాల స్థలపరిమితులకు బద్ధుడుకాకుండ సాధువు స్వేచ్ఛగానుండుట అలవాటు పడియుండెను. రాత్రింబగళ్లు బయలు లోనుండి, ఎవరికంట పడకుండ తన ప్రభువుతో నేకాంతముగ నుండుట ఆయనకెంతో ప్రియము, అట్టి స్థానమందు ఆయన వసించి ఆయనలో విశేష ముగా కనుపించు శక్తి సమాధానములను సంగ్రహించుకొనును.

పశ్చిమ దేశములోని తొందర గడబిడలలో ఆయన ఈలాగు నెమ్మదిగ గడుపుటకు కొద్దికాలమైనను దొరుకలేదు. సూర్యుని ప్రకాశత లేని ఒక దేశమునుండి మరియొక దేశమునకు త్వరగా ఈడ్చుకొని పోబడినప్పుడు భక్తి కూటములు జరుపుటే గొప్ప వ్యవహారముగా సాధువుకు కనపించెను. మరియు నియమిత కాలమందు కూటములు జరుపవలసిన ఏర్పాటులు ఆయ నకు అడవిలో విచ్చలవిడిగ నెగురుచుండు పక్షిని ఇనుప పంజరములో ప్రాణ సంకటముగ బంధించినట్లుండెను. ఆయనలోనుండి అంతకాలము 'ప్రభావము' బైలువెడలుచున్నట్టు ఆయన గ్రహించినను, ఈ యారు నెలలలో ఒక్క దినమైనను ప్రత్యేకముగ దేవునితో గడుపలేకపోయెను. ఆయన దీనినిగూర్చి యెన్నడును మాట్లాడలేదుగాని నెలలు గడువగా తనకు కలుగుచున్న నష్టమును తెలిసికొని, తన హిమాలయ పర్వతముల ప్రదేశమునకు తిరిగి వెళ్లి స్వేచ్ఛగా నుండవలెనను ఆశ అణుప శక్యము

కాకుండెను. తన ఆత్మీయ పరిచర్యకు కావలసిన శక్తిని తిరిగి సంపాదించు కొనుటకు అట్టి ప్రదేశమునకు మరల వెళ్లితీరవలెనని గ్రహించెను. బ్రతుకు రీతిలోను, ఏవి ప్రాముఖ్యములని యెంచబడుచున్నవో ఆ విషయములోను తూర్పుదేశస్థులకును, పాశ్చాత్యులకునుండు వ్యత్యాసము సాధువు ఆదివర కెన్నడును గ్రహించియుండలేదు. ఈ విషయమై ఆయన మనస్సునకు కలిగిన బాధ యెక్కువైనకొలది పశ్చిమదేశమునకు తన యిష్టపూర్వకముగ మరెన్నటికి వెళ్లనని నిశ్చయించుకొనెను. అది దేవుని పిలుపని నమ్మి ఆయనక్కడికి వెళ్లి యుండెను. అందరును ఆ పిలుపు ఆయనకు కలిగినదని ధాటిగా సాక్ష్య మిచ్చియుండిరి. కాని దీని యంతటి మధ్య ఆయనకు కలిగిన సిలువ శ్రమ లతో తన పరిచర్య ఆరంభములో కలిగిన హింసలు పోల్చినప్పుడు ఇవి బహు స్వల్పమైనవిగా కనుపించెను.

ఆయనెక్కడికి పోయినను తనను అందరు కనిపెట్టుచు, తననుగూర్చి మాట్లాడుచున్నట్టు తెలిసికొనినప్పుడు ఆయనకెంతో బాధకరముగనుండెను. (కూటములలో మాట్లాడవలసినప్పుడు తప్ప) ఇతరచోట్ల ఐరోపియనులవలె వస్త్రములు ధరించుకొనినయెడల తనవైపు అందరు చూచుట తప్పించుకొన వచ్చునని ఆయనకు సలహాయిచ్చిరి. ఆయన పరిచర్య ఆరంభములో కష్ట ములు కలిగించిన సాధు వేషము ఇప్పుడును ఆయనకు కష్టము కలిగించెను. చలికాలమైనందున ఆయన కాషాయ వస్త్రముపైని ఒక పొడుగాటి అంగీ వేసి కొనుమని స్నేహితులు తొందరపెట్టిరి. అందుచేత ఆయనను విచిత్ర పురు షుడుగా కనిపెట్టుట తగ్గిపోయెను.

వైటను ద్వీపములో ఆయన ఒకరింటనున్నప్పుడు కొంత మనోనెమ్మదిని పొందగలిగెను, కాని అక్కడైనను దేహ పరిశ్రమముకొరకు వెలుపలికి వెళ్లలేకపోయెను. అక్కడినుండి దక్షిణ వేల్సుకు బోధించుటకు వెళ్లి, జూలై మాస మధ్యమందు కెస్విక్ భక్తికూటములకు వెళ్లిపోయెను.

## ఇంగ్లాండులో

సాధువు జూలైనెల 19—22-వ తేదీలలో జరిగిన కెస్విక్ భక్తికూటములలో ప్రసంగించుటకును, దక్షిణ వేల్సులో పోర్త్ అను పట్టణము దర్శింతునని చాలాకాలముక్రింద చేసిన వాగ్దత్తమును నెరవేర్చుటకును మాత్రమే తన ఏకాంత స్థానమునుండి వెలుపలికి వచ్చెను. ఒక ఆదివారమునాడు వేల్సు ప్రజలకు మూడు మంచి కూటములు జరిపి తన వాగ్దత్తమును నెరవేర్చు

కొనెను. వారిమధ్య తాను చేసిన కొద్ది పరిచర్యనుగూర్చి సాధువు సంతోషించెను.

కెస్విక్‌లో ఆయన నేకసార్లు మాట్లాడెను. ఆయన మొదటి దర్శనమునుగూర్చి వార్తాపత్రికలలో యిట్లు వర్ణించిరి:—

బుధవారము మధ్యాహ్నము డేరాలో జరిగిన కూటమే బహు విశేషమైనది. ఈ భక్తికూటముల సంబంధములో జరిగిన కూటములన్నిటిలో నిదియే బహు గొప్పదిని విశేషమైనదనవచ్చును. సాధు సుందరసింగు ప్రసంగింపబోవుచున్నాడని తెలియగానే గొప్ప గుంపులుగా ప్రజలు కూటమునకు వచ్చిరి. కూటము 3 గంటలకు ఆరంభించునని తెలుపబడెను, కాని 1 గంటకే ప్రజలు రానారంభించి 2—15 నిమిషములకు ఒక కుర్చియైనను ఖాళీగా లేకపోయెను. ప్రజలు ఇంకను గుంపులు గుంపులుగా వచ్చుచుండిరి. 3 గంటలకు 3000 ప్రజలు డేరా వెలుపలను లోపలను కూడుకొనిరి.

సాధువు కాషాయ వస్త్రము ధరించి మాట్లాడుటకు నిలువబడినప్పుడు బహు వింతైన పురుషుడుగ కనుపించెను. అరగంట సేపు ఆయన క్రైస్తవుడైనప్పటినుండి తనకు కలిగిన యనుభవమునుగూర్చి చెప్పినప్పుడు ఆ గొప్ప సమూహములో ప్రతివారి మనసు కరిగెను. అటువంటి గొప్ప కూటము పూర్వమెప్పుడైనను జరిగెనేమో తెలియదు.

సాధువు రోమా 1: 16. సువార్తనుగూర్చి 'నేను సిగ్గుపడువాడ'ను కాను ఏలయనగా నమ్ము ప్రతివానికి రక్షణ కలుగజేయుటకు అది దేవుని శక్తియై యున్నది అను వచనముమీద ప్రసంగించెను.

అక్కడికి రాలేని వారికొరకు, అక్కడికి వెళ్లు భాగ్యముగలిగినవారి కొరకు ఆ ప్రసంగము ఈ క్రింద ప్రచురించుచున్నాము.

ఒక గురువుల కూటములో ఆత్మలను సంపాదించుటనుగూర్చి మాట్లాడుచు సాధువు ఈ విశేషమైన మాట చెప్పెను:—

మన ప్రభువు కొందరిని శిష్యులనుగా పిలిచినప్పుడు వారు జాలరులైయుండిరి, ఆయన వారిని మనుష్యులనుపట్టు జాలరులనుగజేసెను, కాని ప్రభువు సిలువ వేయబడిన పిదప వారు తమ పాతవృత్తికి తిరిగిపోయిరి. క్రీస్తు వారిని తిరిగి కనుగొనినప్పుడు వారు మనుష్యులను పట్టు జాలరులైయుండుటకు బదులు తిరిగి చేపలను పట్టు జాలరులైపోయిరి. అలాగే నేటికిని కొందరు దేవునిసేవకులు మనుష్యులను పట్టు జాలరులైయుండుటకు బదులు ఉత్త చేపలను పట్టు జాలరులుగనున్నారనెను.

ఆయన పరిచర్యవలన గొప్ప ఆశీర్వాదము కలిగెను. అనేకులు దేవుని సేవకొరకు తమ్మును ప్రతిష్ఠించుకొనిరి. వందలకొలది ఆత్మీయమైన ప్రేరేపణ పొందిరి.

కెస్విక్‌నుండి ఒక రాత్రి డర్హామ్‌లో వెల్డన్ బిషపుతో గడపుటకు పోయెను. అప్పుడు రాజైన మొదటి జేమ్సు వసించిన గదిలో ఆయన నిద్రించెను. అక్కడనుండి ఆయన ఇది సాధువుండుటకు తగిన సామాన్యమైన చోటుకాదు; కాని ప్రభువు నన్నెక్కడికి పంపినను అక్కడికి పోవలెను, ఒకప్పుడు రాజనగరుకు, తరుచుగ గుడిసెలలోనికి, అరు బైటికి వెళ్లవలెనని వ్రాసెను.

అక్కడినుండి వెళ్లి కొన్ని దినములు లండన్ పట్టణములో గడపి, జూలై నెల 28-వ తేది, శుక్రవారమునాడు బొంబాయికి వెళ్లుచున్న 'ప్లాసీ' అను పేరుగల ఓడ ఎక్కెను.

## ప్రసంగము

కెస్విక్ భక్తికూటములో 1922-వ సంవత్సరములో చేయబడినది.

సువార్తనుగూర్చి నేను సిగ్గుపడువాడను కాను. ఏలయనగా నమ్ము ప్రతివానికి అది దేవుని శక్తియై యున్నది. (రోమా 1: 16).

అపొస్తలుడైన పౌలు సజీవుడైన క్రీస్తుప్రభువుయొక్క శక్తిని తన బ్రతుకులో అనుభవించెను గనుక క్రీస్తు సువార్తను ప్రకటించుటకు ఆయన సిగ్గుపడలేదు. ఈ లోకస్థులు పాపముచేయుటకు సిగ్గుపడునప్పుడు, రక్షణనుగూర్చి వారెందుకు సిగ్గుపడవలెను? లోకము తలక్రిందుగ నున్నది. మనుష్యులు దేవుని చిత్తప్రకారము చేయుటకు సిగ్గుపడుదురుగాని ఆయన చిత్తమునకు విరుద్ధముగ జరిగించుటకు సిగ్గుపడరు. మనుష్యులు సువార్తను ఖండించి, దాని నెదిరించుటకు సిగ్గుపడరుగాని సువార్తను బోధించుటకు సిగ్గుపడుదురు. వారు క్రీస్తునుగూర్చి యెరుగుదురుగాని రక్షణకలిగించు ఆయనశక్తి నెరుగరు. ఆ చివర గొప్పదినమందు అట్టివారితో ఆయన, 'మీరు నన్ను ఎరుగనందున నన్నుగూర్చి, నా సువార్తనుగూర్చి సిగ్గుపడితిరి గనుక నేనును మిమ్ము నెరుగన'ని చెప్పును. ఆయన నెరిగినవారికి, వారు యూదులైనను, హెల్లేనీయులైనను, లేక హిందువులైనను, తురకలైనను, బౌద్ధులైనను, ఆయన దేవునిశక్తియై యున్నాడు.

## సత్యమును నిష్కపటముగ వెదకువాడు

అనేకుల అనుభవము దీనిని రుజువు పరచియున్నది. మూడేండ్ల క్రిందట హరిద్వార్ సమీపములో నేనొక హిందూ సాధువు చీలల పలక మీద పరుండియుండగ చూచితిని. నేనతనితో మాట్లాడగ నతడు సత్యమును నిష్కపటముగ వెతుకుచున్నవాడైనట్లు కనుగొంటిని. నేనతనితో, నీ వెందుకు ఈ చీలలతో నిన్ను హింసించుకొనుచున్నావని అడిగితిని. అందుకతడు, 'నా హృదయములో పాపపు చీలలపోట్లు అనుభవించుచున్నాను, ఈ లోపలిబాధను నివృత్తిచేసికొన జూచుచున్నాను; కాని నా శరీరమందలి బాధకంటె నా హృదయములోనిబాధ యెక్కువగ నున్న'దని చెప్పెను. అప్పుడు నేనతనితో, తన చేతులలోను పాదములలోను మేకుపోట్లను మనకొరకు పొందెను గనుక మనలోని పాపపుబాధను తీసివేయగలిగిన ఆ ప్రభువునుగూర్చి చెప్పితిని క్రీస్తు శక్తినిగూర్చి నా స్వంత అనుభవమును చెప్పి, ఒక సువార్త ప్రతిని అతనికిచ్చితిని. కొంతకాలమైన పిమ్మట నేనతనిని తిరిగి కలిసికొనినప్పుడు, అతడు కొందరిమధ్య కూర్చుండి, తన హృదయవేదనను తీసివేసి, తనకు రక్షణ సమాధానముల నిచ్చిన ఆ క్రీస్తు శక్తినిగూర్చి సాక్ష్యమిచ్చుచుండెను.

నేనొకప్పుడు నేపాళములోని ఇలోమ్ అనుచోట బోధించుచుండగ ఒక గొప్పకులస్థుడైన హిందువు బహుగా కోపము తెచ్చుకొని, నన్నడ్డగించెను. నేను మార్కు సువార్త ప్రతిని అతని చేతికియ్యగా, అతడు దానిని చించివేసి, వెళ్లి నన్నుగూర్చి పోలీసువారికి తెలిపెను. పోలీసు ఆఫీసరు వచ్చి నన్ను పట్టుకొని, ఆరుమాసములు ఖైదు విధించెను. చెరసాల అధిపతి నన్ను తక్కిన ఖైదీలతో బంధించగా, నేను వారికి క్రీస్తునుగూర్చి బోధింప మొదలుపెట్టితిని. ఖైదీలు శ్రద్ధగా వినుచుండుట చెరసాల అధిపతి చూచి, బోధించుట మానివేయుమని ఆజ్ఞాపించెను. అందుకు నేను నా యజమానుని ఆజ్ఞకు విధేయుడనై, నేనెట్టి శ్రమల ననుభవింపవలసియుండినను సువార్త బోధింపవలెనని చెప్పితిని. అప్పుడతడు ఖైదీలను చూచి, మీరు ఆయనమాటలు వినకూడదని చెప్పెను. కాని వారు, తాము మారుమనస్సు పొంది మంచివారు కావలెనని చెరసాలలో వేయబడిరి, గనుక ఈ మనుష్యుడు నిజముగా గవర్నమెంటువారికి సహాయమే చేయుచున్నాడు. 'ఆయనబోధ వినుట గవర్నమెంటుకు విరోధమైన నేరమెట్లగున'ని ఆ

చెరసాల యధిపతితో వాదింపసాగిరి. అప్పుడు తనకేమియు తోచక, గవర్నరునొద్దకు వెళ్లి యీ సంగతి తెలుపగా, నన్ను వేరుగ నొక గదిలో బంధించుమనట్లు ఆజ్ఞాపించెను. చెరసాలలో అందరికి ఒక పెద్ద గదిమాత్రమే యున్నందున చెరసాల అధిపతికి చెందిన పశువులు మురికిచేసిన పశువుల కొట్లో నన్ను పడవేసిరి. దానికి కిటికీలు లేవు, ఒక తలుపుమాత్రమే యుండెను. ఒక గుంజకు నా చేతులు పాదములు కట్టి, నా పైబట్టలు తీసివేసిరి.

## శ్రమలో ఆనందము

నా బాధను ఎక్కువచేయుటకు, ఎవరో అడవిలో కొన్ని జలగలు పోగుచేసి నామీద పడవేయగా, ఆ యసహ్యమైన పురుగులు నా శరీరముమ పట్టుకొని రక్తమును పీల్చసాగెను. కాని నేను నా హృదయమునెత్తి దేవుని ప్రార్థించగా నా యాత్మలో పరమశాంతి సమాధానములు కలిగినందున, నా కెక్కువగ పాడుట తెలియకున్నను, ఆయనకు స్తుతిగానము చేయసాగితిని. అప్పుడు నామీద నేరముమోపినవాడు ఇతరులతో తలుపునొద్ద నిలువబడి, నా పాట విని ఆశ్చర్యపడి, చెరసాల అధిపతితో, 'ఈ మనుష్యుని గూర్చి నీకేమి తోచుచున్నది? అతడు బాధపడుచున్నను ఇంత సంతోషముగా నున్నాడ'నెను. అందుకు చెరసాల అధిపతి, 'అతడు పిచ్చివాడై యుండవలెన'నెను. అప్పుడతడు, 'పిచ్చివాడగుటచేత నిట్టి యానందము కలిగితే, నేనును పిచ్చివాడను కాగోరుచున్నాను. మరియు నేనేకాదు, లోకమంతయు పిచ్చికలిగియుండ గోరుచున్నాను. ఎందుకనిన, యిటువంటి పిచ్చిలోకమును పరదైసుగా మార్చున'ని ప్రత్యుత్తరమిచ్చెను.

అంతట చెరసాల అధిపతి తిరిగి గవర్నరునొద్దకు పోయి, 'మన ఉద్దేశము నెరవేరలేను, ఈ శిక్షవలన ఆ మనుష్యునికి దుఃఖము కలిగి, బోధించుట మానివేయునని అనుకొంటిమి, కాని మనమతని సంతోషమును యెక్కువ చేస్తిము'ని చెప్పెను. అప్పుడు గవర్నరు, 'అతడు ఉత్త పిచ్చివాడు అతనిని పోనిమ్ము'ని ఆజ్ఞ నిచ్చెను. గనుక వారు నన్ను విడిచిపెట్టిరి. నా శరీరములో రక్తము పోయినందున నాకు బలహీనముగ నున్నప్పటికి ఆ పట్టణమంతయు సువార్త బోధించితిని. నామీద మొదట నేరముమోపిన ఆ గొప్ప కులస్థుడు నా మాటలు విని తాను చింపివేసిన సువార్త ప్రతికి బదులు మరియొకటి యిమ్మని అడిగెను. నీకింత శ్రమను కలిగించుచున్న సువార్తను బోధించుటకు నీవు సిగ్గుపడుటలేదా అని నాతో ననగా, 'నేను నీవలె

దురభిమానముగల హిందువునై యున్నప్పుడు సువార్తను చింపివేయుటకు సిగ్గుపడలేదు, ఇప్పుడు నేను దాని శక్తిని నా జీవితములో చూచినపిమ్మట యెందుకు సిగ్గుపడవలెనని యడిగితిని.

## నన్ను ఒప్పుకొని, నా సిలువ నెత్తుకొనుము

కాని నా బ్రతుకులో క్రీస్తు శక్తిని యెల్లప్పుడు ఎరుగను గనుక అనుభవమువలన నేను నేర్చుకొనవలసియుండెను. నేను మొదట నా హృదయమును క్రీస్తుప్రభువుకిచ్చినప్పుడు, నా పాపములు క్షమింపబడినవని తెలిసికొని, పరమానంద సమాధానములు పొందితిని. ఐనను వెంటనే నే నాయనను బాప్తిస్మముద్వారా ఒప్పుకొనవలెనని జ్ఞాపకము చేసికొంటిని. అది తలంచుకొనినప్పుడు, నేనట్లు చేసినయెడల తప్పకుండ హింసనుపొంది, యింటిలోనుండి, స్నేహితులనుండి తరిమివేయబడి నేననుభవించుచున్న సౌఖ్యములను ఆస్తిని అంతయు పోగొట్టుకొనవలసియుండునని కనిపెట్టితిని. గనుక నేను ఎక్కువగ నా మనస్సులో యోచించి, ఒక దూరమైన స్థలమునకు వెళ్లి బాప్తిస్మముపొంది, తిరిగి యింటికివచ్చి ప్రార్థన, దైవవాక్యపఠన చేసినయెడల నేను దైవాజ్ఞకు విధేయుడ నగుదునని నిశ్చయించుకొంటిని. ఈలాగు యింటి సౌఖ్యమును, నా స్నేహితులను, సొత్తును అనుభవించుచుండవచ్చునను కొంటిని.

కాని యీ తలంపులన్నియు నా మనస్సులో నున్నప్పుడు నా సమాధానమంతయు పోయినందున క్రీస్తునుగూర్చిన తలంపులవల్ల కలుగు ఆనందమేమాత్రమును నాకు లేకపోయెను. అప్పుడు నేను ఎంత అనుభవింపవలసియుండినను నా సిలువ నెత్తుకొని తీరవలసినదని స్పష్టముగ కనిపెట్టితిని. అంతట నేను బహిరంగముగ బాప్తిస్మముపొంది క్రీస్తుకొరకు నా యింటిని, ఆస్తిని, తల్లిదండ్రులను, స్నేహితులను సమస్తమును పోగొట్టుకొంటిని. కాని నా యాత్మలో శాంతి ఆనందములు కలిగినందున తక్కినవన్నియు పెట్టివిగా నెంచితిని. సిలువను మోయుటలో క్రీస్తుప్రభువు వాగ్దత్తముచేసిన యా సమాధానము కనుగొంటిని; అది అప్పటినుండి నన్నెన్నడును విడువలేదు. నా బలహీనతలో క్రీస్తునుగూర్చి మాట్లాడుటకు సిగ్గుపడితిని; కాని నేను సిలువను ఎత్తుకొనినప్పుడు అది నాకు శక్తిని ధైర్యమును కలిగించెను. ఇప్పుడు నేను సిగ్గుపడుటకు బదులు క్రీస్తునుగూర్చి బోధించుట నాకు గొప్ప ఘనతగ నెంచుకొనుచున్నాను.

ఒకప్పుడు నేను క్రీస్తుప్రభువు దయచేయు క్రైస్తవ సమాధానము, అంత్య తో కూడకలుగు సమాధానమునుగూర్చియు ఒక పెద్ద మాట్లాడుచుంటిని. ఒక విద్వాంసుడు ఈ సమాధానము నిజముగ క్రీస్తుయొక్క దానమా, లేక నా తలంపు, నా యూహయొక్క ఫలితముకాదని వారెట్లు తెలియునని యడిగెను. అందుకు నేను, 'అది నాయోచనవలన కలుగునదైనయెడల, పండితులు ఆత్మతత్వశాస్త్ర ప్రమాణము లెరిగినవారైనందున యీ సమాధానము ననుభవింపవలసినదే, గాని వారికెంతమాత్రము అట్టి సమాధానము తెలియద'ని చెప్పితిని.

## ఆత్మీయ అంధత్వము

అది నాకు ఒక గుడ్డిభిక్షుకునిగూర్చి జ్ఞాపకము చేసినది: వాడు ఒకప్పుడు ఎండలో కూర్చుండి, ఆ వేడిని సంతోషముతో ననుభవించుచుండెను: అప్పుడు వానిని సూర్యునిగూర్చి యేమి తలంచుచున్నావని అడిగినప్పుడు, వాడు, అటువంటిది లేనేలేదనెను. ఆకాశములో సూర్యుడను ఒక పెద్ద బంతి వ్రేలాడుచున్నదన్నమాట ఉత్తపిచ్చిమాట. నేననుభవించుచున్న యీ వేడిమి నా స్వంతదేహములోని వెచ్చని రక్తములోనుండి వచ్చినదేగాని వెలపలనుండి యెంతమాత్రము రాలేదనెను. ఆ పండితుని, ఆ గుడ్డివానిగూర్చి యేమితలంచుచున్నావని యడిగితిని. అందుకతడు, వాడు గుడ్డివాడును వెర్రివాడునై యున్నాడనెను. అప్పుడు నేను, అవును నీవును ఆత్మీయముగా గుడ్డివాడును, విద్యాపరుడైన వెర్రివాడవునై యున్నావు, అందుచేతనే నిజమైన సమాధానము లేనట్టును, దానికాధారమైన సమాధాన ప్రభువును చూడలేనందున ఆయన లేడన్నట్టును మాట్లాడుచున్నావని యంటిని. నేను మాట్లాడుచున్న యీ సమాధానము రక్షణయొక్క ఫలితమై యున్నది. అది హృదయములోనుండి భయమును తీసివేసి, ఆత్మను సమాధానముతో నింపును.

కొందరు నీతిబోధకులు రక్షణకొరకు క్రీస్తుశక్తి యవసరములేదని, అట్టి శక్తియే లేదని వాదించుదురు. అది మన స్వంతప్రయత్నములవలననే దొరుకునని వారందురు. ఈ మాటలలో కొంత సత్యమున్నట్టు కనుపించినను, విశ్వాసులయొక్క యనుభవము అది అసాధ్యమని రుజావుచేయుచున్నది.

పంజరములో పక్షికి ఉన్న కండ్లతో తాను స్వేచ్ఛగా తిరుగగల లోకమును చూడగలిగినను, ఆ లోకమును అందుకొనగల తన రెక్కలలో

శక్తియున్నను, అది పారిపోవుటకు ప్రయత్నించినప్పుడు పంజరముయొక్క కడ్డీలవల్ల యెట్లు ఆపివేయబడుచున్నదో, అలాగే మన మనోబలము ఆత్మీయమైన స్వాతంత్ర్యము సంపాదించుకొనగలమని మనము తలంచునట్లు చేసినను, దానికొరకు మనము ప్రయత్నించినప్పుడు పాపము, చెడువాడుకలను బంధకములచేత మనమేమియు చేయలేని ఖైదీలవలె నున్నట్లు కనుగొందుము. వలలో చిక్కుకున్న చేప సముద్రవిశాలమును చూచి తాను ఈది తప్పించుకొనగలననుకొనవచ్చునుగాని, అది ఆ వలలో చిక్కుకొని యున్నది. మరియు ఆ చేపను చంపునది ఆ వలకాదుగాని దానిని నీటిలో నుండి వెలపలికి లాగుటకు చేయబడిన సాధనముచేత అది నీటిలోనుండి వెలపలికి యీడ్వబడి నేలమీద దానికి చావు కలుగును. అటువలెనే పాపమను వల, మనకు జీవమునియ్యగల దేవుని సన్నిధినుండి ఆయనశక్తినుండి తప్పించి చివరకు మనలను మరణమునకు ఈడ్చుకొని పోవును.

నేను ఇంతవరకు వర్ణించిన క్రొత్తబోధనుబట్టి విశ్వాసులు తొందరపడ నక్కరలేదు. అట్టి బోధ అభిప్రాయములు పూర్వముకూడ నుండినవి. నాటి కాలమైనపిమ్మట అవి అంతరించి పోయినవి. అప్పటి కవి ప్రజలను బహుగా వశపరచుకొనును, కాని చివరకు మరి క్రొత్తబోధ అభిప్రాయములు వచ్చి వాటిని కొట్టివేయును. కాని క్రీస్తుప్రభువు ఈలాగు అభిప్రాయములు మారుచుండినను ఏకరీతిగానే యున్నాడు, నేటికి అలాగే యున్నాడు, ఎందుకనిన ఆయన నిన్న నేడు నిరంతరము ఒకేరీతిగ నుండువాడు.

కొందరు యౌవనులు, ముఖ్యముగా విద్యార్థులు తమ ఉపాధ్యాయులకు పండితులకు క్రీస్తునందు విశ్వాసములేదు గనుక మనస్సులో కలవరపడుదురు. గొప్పవారు గొప్పవరములుగలవారు క్రీస్తును విసర్జించితే మేమెట్లు ఆయనను విశ్వసింపగలమని యందురు. అందుకు ప్రత్యుత్తరము సులువుగ నియ్యవచ్చును. తమకు అప్పగింపబడిన వరములను సరిగా వాడుకొననివారినిగూర్చి క్రీస్తుప్రభువు ఒకప్పుడు, లేనివారికి వారికి కలిగినదికూడ తీసివేయబడునని చెప్పెను. వారికి లేనిది వారియొద్దనుండి యెట్లు తీసివేయబడును? అందుకు ప్రత్యుత్తరమేమనిన: వారు సద్వినియోగపరచుకొనిన వరములు శక్తులు నిశ్చయముగా వారియొద్దనుండి తీసివేయబడును. మరియు, వారికి మిగిలియున్న యుక్తాయుక్త వివేచనకూడా వారు పోగొట్టుకొందురు. తమకు కలిగిన జ్ఞానము నాగరికత క్రీస్తుమతముద్వారానే

కీరు సంపాదించిరి కాని తమకు అట్టి ఆశీర్వాదములను తెచ్చిన ఆ సువార్త బోధనే వారు నిరాకరించుచున్నారు. యూదానుగూర్చి ప్రభువు చెప్పిన మాటలు, నాతో రొట్టె భుజించినవాడే నాకు విరుద్ధముగ తన మడిమె నెత్తెను, అనునవి మనకు వీరి విషయములో జ్ఞాపకమునకు వచ్చును. ఈలాగు అనేకమంది విద్యాపరులు నేడు క్రీస్తుప్రభువును శత్రువులకు ద్రోహముగా అప్పగించుచున్నారు. యూదాయొక్క ద్రోహము క్రీస్తుకు హానిచేయ లేదు గాని, యూదాకు తన హస్తములతో మరణము సంభవించెను. ఆలాగే క్రీస్తుకు హానిచేయ యత్నించుచున్నవారు, తమ జ్ఞానమను చెట్టున వ్రేలాడ దీసికొను అపాయములో నున్నారు.

అయినప్పటికి క్రీస్తు శక్తియొక్క సత్యము నెరిగిన విశ్వాసులు అది లేదనువారిని శత్రుభావముతో చూడరాదు. ప్రార్థనద్వారాను ప్రేమగల పరిచర్యద్వారాను వారిని క్రీస్తుతట్టు ఆకర్షింప యత్నించవలెను. వారిని రాళ్లతో కొట్టుటకు బయలుదేరినయెడల వారి మనస్సులోని సదుద్దేశమును చంపివేయుదురు. తమ యుద్దేశమునకు భంగము కలిగించుకొని, వారిని యే గుంటలోనుండి యెత్తవలెనని కోరిరో దానిలోనికే వారిని పడద్రోయుదురు.

మనము సువార్తనుగూర్చి సిగ్గుపడ నవసరములేదు. మన యనుభవము వలన నది దేవుని శక్తియని తెలిసికొంటిమి. కాని మనము దీనిని మనమాట వలననే కాక, మన బ్రతుకువలనను క్రీస్తువంటి యాత్మ అనగా ప్రేమ, స్వార్థ త్యాగములవలనను దానిని కనుపరచవలయును.

## తరువాత ప్రయాణములు

ఆయన ఇండియాకు తిరిగి వచ్చినపిమ్మట విశ్రాంతి అత్యవసరముగ నుండి నందున కొన్నివారములవరకు తిరిగి సువార్త బోధకొరకు బయలుదేరుటను తలపెట్టలేకపోయెను. తన హిమాలయపర్వతములలోని చల్లని గాలియు విశ్రాంతియు ఆయన శరీరమును, మనస్సును బలపరచి, పరదేశములో ఆయన యెన్నటికి నిరీక్షింపలేని మనోనెమ్మదిని కలిగించెను.

1922 సంవత్సరపు చివరి నెలలో ఉత్తర హిందూస్థానమందలి పలు పట్టణములను దర్శించి కాన్ఫరెంసులలోను భక్తికూటములలోను ప్రసంగించెను. డిల్లీ, అంబాలా, లూదియానా, అలహాబాద్, కాశీ, మంట్‌గొమరీ, లాహొరు మొదలైన పట్టణములను దర్శించి క్రిస్మసు దినములలో

విశ్రాంతికొరకు సబాటు అను చోటికి వెళ్లెను. నవంబరుమాసములో న్యూజీలాండుకు, ఇటలీకి రమ్మని సముద్రపు తంతివార్త వచ్చినను ఆయన ఆ దేశములకు పోవుట కంగీకరించలేదు.

1923 సం॥ జనవరిలో సాధువు కరాచికి వెళ్లి అనేక కూటములు నడిపెను. వానిలో నొకదానికి అక్కడి జ్యుడిషల్ కమిషనరు అగ్రాసనాధిపతిగా నుండెను. అక్కడినుండి మైక్ పూరి సహారంపూరు మొదలైన పట్టణములకు వెళ్లెను. ఏప్రిల్ నెలలో ముసలివాడైన ఆయన తండ్రి పరలోకగతుడైనట్టు వార్త వచ్చెను. అదృష్టవశాత్తు కొంతకాలము క్రిందట ఆయన రాంపూరుకు వెళ్లినప్పుడు ముసలివాడైన ఆయన తండ్రియేగాక బంధువులందరు ఆయనను బహు సంతోషముగా చేర్చుకొనిరి. ఏప్రిల్ నెల 10 తేదిని, 'రాంపూరులో మా తండ్రిగారు చనిపోయిరి. ఆయనను మహిమలో తిరిగి చూతును గనుక నాకు విచారములేదు. ఆయన క్రైస్తవుడుగ చనిపోయెను. మా యెడబాపు శరీరమందుమాత్రము కొద్దికాలమునకేనని వ్రాసెను.

ఇది సంభవించిన కొద్దికాలములోనే సిమ్లాలోని ఒక బ్యాంకు దివాలా తీసినందున టిబెట్టులోని తన పనికొరకు స్నేహితులిచ్చిన డబ్బు సుమారు అంతయు నష్టమైపోయెను. దానినిగూర్చి ఆయన, 'నేను సొమ్మును నమ్ముకొనుటలేదు. అది దయచేసినందుకు ప్రభువుకు వందనములు చెల్లించితిని, దానిని తీసివేసినందుకాయన నామమును స్తుతించుచున్నాను. నా నమ్మిక ఆయన పరలోక బ్యాంకుమీద నున్నది. అది యెన్నటికి దివాలా తీయదు'ని వ్రాసెను.

మేమాసము రెండవవారములో స్నేహితులకు వీడ్కోలుపు ఉత్తరములు వ్రాసి టిబెట్టుకు పైలుదేరెను. అప్పటినుండి చాలాకాలమువరకు ఆయనను గూర్చిన సమాచారము తెలియకుండెను. అంతట బొంబాయిలో నొక వార్తాపత్రికలో నిశ్చయమైన వార్త అని, ఆయన సజీవుడుగ లేడని— ప్రచురించెను. ఆ వార్త ఈ దేశపు పత్రికలలోను ఐరోపాలోని పత్రికలలోను ప్రచురింపబడెను. లండన్ డెయిలీ న్యూసను పత్రికలో, సాధు సుందరసింగను హిందూదేశపు క్రైస్తవుడైన గూఢమతవాది టిబెట్టులో మూర్ఖులైన బౌద్ధులచేత హతుడాయెనని నమ్మతగిన వారివలన వింటిమని ప్రచురింపబడెను. కొన్ని దినములవరకు తంతివార్తలకు తృప్తికరమైన ప్రత్యుత్తరములు రానందున, సత్యము తెలియక బహు ఆందోళము కలిగెను. విచారసూచకముగ అస్సాములో అనేక పాఠశాలలు మూయబడెను.

అప్పుడు కోట్ఘురుద్వారా ఆయనక్కడున్నట్లు తంతివార్త వచ్చెను. పిమ్మట ఆయన స్వహస్తములో వ్రాయబడిన ఉత్తరములో తన్నుగూర్చి అబద్ధపు వార్త ప్రకటింపబడినందుకు విచారపడుచు, అక్కడ 'మతసంబంధమైన రాచకీయసంబంధమైన ఆటంకములు'చేత తాను ఆ దేశమునువిడిచి తిరిగి రావలసివచ్చినట్లు తెలిపెను. ఈ యాశాభంగములవలన టిబెట్టుకు సువార్త అందించవలెనని తన జీవితకాలమునకు చేసికొనిన తీర్మానము మారలేదు, గనుక ఆయన, 'పరలోకమునుండి ఒక దూతవచ్చి టిబెట్టుకు వెళ్లవద్దని చెప్పినను నేను తప్పక వెళ్లుదును'ని వ్రాసెను.

అటుపిమ్మట సువార్త బోధించుటకు సాధువు పలుప్రదేశములకు వెళ్లెను. ఉర్దుభాషలో కొన్ని ధ్యానములు వ్రాసెను. అవి ఇంగ్లీషులోనికి తర్జుమ చేయబడెను. అక్టోబరుమాసములో న్యూజీలాండుకు రమ్మని పిలుపు వచ్చినను వెళ్లుటకు ఒప్పుకొనలేదు. 'టిబెట్టుకు తప్ప మరియేదేశమునకు పోవుటకు ఇండియాదేశమును విడిచిపోను'ని ఆయన చెప్పెను. ఉత్తర తిరువాన్కూరులో మరమన్నా అను చోట జరుగు మార్థోమా భక్తికూటములకు అవసరముగా రమ్మని పిలుపు వచ్చెను; కాని ఆ సమయమందే అస్సాములో జరుగనున్న కూటమునకు వెళ్లుదునని వాగ్దత్తము చేసియున్నందున తిరువాన్కూరుకు వెళ్లలేకపోయెను.

## సాధువునుగూర్చిన గ్రంథములు

సాధువునుగూర్చి కొన్నేండ్లనుండి యీ దేశములోను ఇతరదేశములలోను పలువిధములైన గ్రంథములు ప్రచురింపబడెను. ఇండియాకు వెలపల ఆయనపేరు తెలియబడకపూర్వమే, ఇండియనులు ఆయననుగూర్చి వ్రాయనారంభించిరి. ఆయన క్రైస్తవ పరిశుద్ధుడనదగినవాడైనందున ఒక భాషలో వ్రాయబడిన చరిత్ర ఇతరభాషలలోకి వెంటనే తర్జుమచేయబడి దేశమందంతట ఆసక్తితో చదువబడెను.

ఆయన యీ దేశములో నెక్కువగ తెలియబడినకొలది, ఆయన బ్రతుకురీతిని, సేవపద్ధతిని, అందరును ముఖ్యముగ విదేశీయులు ఖండింప మొదలుపెట్టిరి. ఈ ఖండన యెల్లప్పుడు దయతో చేయబడలేదు. మరియు తరువాత ఆయన చరిత్రలో ఆయనకు కలిగిన ఘనతనుబట్టి చూడగ ఆ విదేశీయులు ఈ దేశపు సంగతులు గ్రహింపక అట్లు ఖండించినట్లు తెలియవచ్చెను. 'ప్రజలు నాకు విరుద్ధముగ మాట్లాడనియెడల నాలో నేదో గొప్ప

లోపమున్నదని నాకు తెలియున'ను మాటలు చెప్పి ఆయన ఆ ఖండనను అంగీకరించువాడు.

ఆయన బ్రతుకులో జరిగిన అద్భుతములను ఆశతో నమ్మినవారు, ఆ యద్భుతకార్యములను కనిపెట్టి, అవి ఆయన 'దేవునివలన పిలువబడినవాడ'నుటకు నిరాక్షేపణీయమైన నిదర్శనమైనట్లు అంగీకరించిరి, కాని మరికొందరు వాటినిగూర్చి యేమనుటకు తెలియకుండిరి; ఈలాగు అభిప్రాయభేదము బయలుదేరెను. రెవరెండు సి. డబ్లియు. ఎమెట్ అను పండితుడు 1921-వ సంవత్సరములో నొక పత్రికలో 'సాధు సుందరసింగు అద్భుతముల'ను శీర్షికతో వ్రాసిన వ్యాసములో ఆయన అద్భుతముగ పదేపదే గొప్ప అపాయమునుండి విడిపింపబడిన సంభవములను వివరింప యత్నించెను. వీటిలో దేవుడు రెండువిధములుగ పనిచేయుచున్నట్లు కనిపెట్టవచ్చును. తన దాసులను విడిపించుటకుగాని సహాయము చేయుటకుగాని తన దూతను పంపవచ్చును, లేక, తన యాత్మచేత మనుష్యుల హృదయములో పని చేయవచ్చును. అమానుషమైన వ్యక్తులెవరో అసాధారణమైనరీతిగ తమకు సహాయమునకు అడ్డుపడుటనగా కొందరు మొట్టమొదట ఆశ్చర్యముగ తలంచవచ్చును; గాని దేవుని ఆత్మ సాధువువంటి మనుష్యునితో పనిచేసి, తద్వారా ఆయనతోడి ప్రజలలో మంచిది చేయుటకుండు శక్తులను లేపి దేవునిశక్తిని గ్రహించునట్లు చేయుట గొప్ప సంగతికాదా?......అక్కడ ఎవరో ఉన్నట్టు మేము నమ్ముచున్నాము. దైవాత్మ 'పరిశుద్ధుల ఆత్మలలో ప్రవేశించి, వారిని దేవుని స్నేహితులనుగాను ప్రవక్తలనుగాను చేయును; మరియు తన సృష్టియైన మానవమనస్సులలో పనిచేసి, ఆ మనస్సులలోనే యున్న ప్రకృతి బాహ్యమైన దైవసాన్నిధ్యమును గ్రహించునట్లు వారిని ముట్టి, గుండెలు ఝల్లుమనునట్లు చేయును.

అయితే సాధువుచేసినట్టు చెప్పబడిన అద్భుతములనుగూర్చి ఎమెట్ గారు ఏమియు చెప్పుటలేదు. సాధువుకూడా అవి జరుగుట అసాధ్యమని చెప్పకున్నను, వాటినిగూర్చి ఎక్కువుగ మాట్లాడడు. కాని తరుచుగ తన చేతులలో శక్తి యేమియు లేదని సాక్ష్యమిచ్చుచు, ప్రార్థనకు ప్రత్యుత్తరముగ క్రీస్తుశక్తి ప్రత్యక్షమగుటయే అద్భుతమని చెప్పుచుండును.

అనేక సంవత్సరముల క్రిందట అద్భుతములు తన సువార్త బోధకు సహాయపడుటకు బదులు ఆటంకమును కలిగించునని సాధువుకు స్పష్టమాయెను. గనుక 1918-వ సంవత్సరములో ఆయన దక్షిణ యిండియాలో

సంచారము చేయునపుడు నిజముగ ప్రయోజనకరముగాని అద్భుతములు చేయువాడను వదంతిని బలపరచుటకు ఏమియు చేయలేదు.

ఆయన చీనా, జపానులను పశ్చిమదేశములను దర్శించినప్పుడు ఆయా మనుష్యులు వ్రాసిన ఆయన జీవితచరిత్ర నాగరికత కలిగిన లోకమందంతటను చదువబడెను. ఆయన ప్రసంగములు ఇంగ్లీషులోను, ఇతరభాషలలోను చిన్నపుస్తకములలోను, వార్తాపత్రికలలోను ప్రచురింపబడినప్పుడు అనేక దేశములలో ఆయననుగూర్చి, ఆయన అభిప్రాయములనుగూర్చి తర్కింపసాగిరి. ఈలాగు మంచి వదంతులద్వారాను దుర్వదంతులద్వారాను దేవునిమార్గమును సాధువు తన పద్ధతిని నెమ్మదిగ అందరికి అందింపగలిగెను.

1920-వ సంవత్సరములో ఆయన పశ్చిమదేశములను మొదట దర్శించినప్పుడు ఆయనకంటె స్వతాత్యాసమైన మనస్సు కలిగినవారు ఆయననుగూర్చి, ఆయన అనుభవములనుగూర్చి, ఆయన పనినిగూర్చి తూర్పుదేశములలోను పశ్చిమదేశములలోను ఆయనబోధవల్లను ఆయన విచిత్ర విగ్రహమును చూచుటవల్లను కలుగు మార్పులనుగూర్చి విచారించి తర్కింపసాగిరి. క్రీస్తుమతము తూర్పునుండి వచ్చినందున, పశ్చిమదేశములలోని ఆసక్తిగల క్రైస్తవులనేకులు ఆ దివ్యమైన జీవము నూతన ప్రవాహముగ తిరిగి తూర్పునుండియే రావలెనని కనిపెట్టుట సహజమే. మరియు ఆ నూతన జీవము ఈ మధ్య జరిగిన గొప్ప యుద్ధమువలన దేవుని మరచునట్లు ముసుకు కప్పబడిన కోట్లకొలది ప్రజలలో నిజమైన ఉజ్జీవము కలిగించునని వారు నిరీక్షించుచున్నారు.

పశ్చిమదేశమందలి క్రీస్తుసభ లోకరక్షకునిగూర్చి చిరకాలమునుండి తెలిసికొనినదైనను, ఆయన తన ప్రాణత్యాగముచే రక్షించిన లోకము యొక్క అక్కరను నేటికిని తీర్చలేకపోవుట శోచనీయము. తరతరములుగ యీ సామాన్యమైన సువార్త సత్యములు ఆయా మనుష్యుల మనస్సులలో వారివారి బుద్ధి ననుసరించిన యాకారమును పొందినందున, ఆ సువార్త లోకములో చేయవలసిన గొప్పపనికి శక్తిలేనిదగుచున్నది; ఏమనిన, పంచేంద్రియములను వశపరచుకొనగల బాహ్యాచారములయందుగాని, సభా పరిపాలనా సంబంధమైన గొప్ప యేర్పాటులయందుగాని, నిజమైన నూతన జన్మము కనుపించుటలేదు. అనేక శతాబ్దములనుండి వాడుకలో నున్నందున గౌరవము పొందుచున్న పారంపర్యబోధలు క్రీస్తుయేసునందలి జీవమును పోలిన జీవమునే యీయన జూపును, గాని, ఆయన జీవముమాత్రమే నిజమైన తృప్తిని కలిగించును. ప్రతివారును, క్రీస్తువంటి మనుష్యుని చూపు

మాని యడుగుదురు. స్వీడన్ దేశపు ప్రధానాధ్యక్షుడు సుందరసింగును చూపి, 'ఆయనలో సువార్త యెట్టిమార్పును చెందలేదు. క్రీస్తుమత చరిత్రలో సుందరుడే లోకమునకు క్రీస్తు నగుపరచగలిగిన ప్రథమ పురుషుడు. యేసుక్రీస్తు సువార్త ఈ హిందువుని ఆత్మలో ఏమార్పు చెందకుండ స్వచ్ఛముగ ప్రతిఫలించుచున్నదని చెప్పుచున్నాడు.

ఆయనకు 'క్రీస్తుయేసునందు నూతన సృష్టితప్ప' మరి దేనితోను పని లేదు. క్రీస్తుసభలోని ఆయా తెగలయందు ఆయనకు అభిరుచిలేదు. ఇవి లేనియెడల క్రీస్తుసభ 'లోకములో పరలోకమునలె నుండును'ని ఆయన చెప్పుచుండును. ఆయనను కనిపెట్టి, గమనించి, ఆయననుగూర్చి వ్రాసిన వారు, మనుష్యులు క్రీస్తు జీవమును పొందుటకై స్వచ్ఛమైన ఆయనజీవితము వలన నిజమైన జీవమును అనుసరించుటకు పురికొల్పబడుచున్నారని ఏకగ్రీవముగ అభిప్రాయపడుచున్నారు.

మరియొకరిట్లు వ్రాసిరి: — 'క్రీస్తుమతము నశించునదికాదు. తూర్పు నుండి అది తిరిగి రాగలదు. ఆరిపోవుచున్న బలిపీఠముమీద మరల అగ్నిజ్వాలను ప్రజ్వలింపచేయుగల క్రొత్త అపొస్తలులలో సాధువు మొదటివాడుగ నుండవచ్చును.'

కానన్ స్ట్రీటరు 'సాధువ'నుపేరను వ్రాసిన గ్రంథమునుగూర్చి సోడర్ బ్లోము ప్రధానాధ్యక్షు డిట్లు వ్రాసెను: క్రీస్తుమత చరిత్రలో అద్భుతములు చేయుగల విశ్వాసపరుడను భ్రమనుపుట్టించి, తన జీవితకాలములోనే కానన్ స్ట్రీటరువంటి శాస్త్రోక్తముగా విచారణచేయువానిచే క్రమముగ పరీక్షింపబడిన పరిశుద్ధమైన యోగ్యతగల మహా పురుషుడు నేనెరిగినంతవరకు ఈ సాధువు తప్ప మరియొకరు లేరు. ఈ కానన్ స్ట్రీటరు ఈ సాధువును పరీక్షించుటలో తన పాండిత్యమునకు తగినట్టు ఆయనను ఖండించుటయేగాక ఆయనయెడల సానుభూతినిగూడ కనుపరచియున్నాడు?

కానన్ స్ట్రీటరు ఈ తరము వారిని వశపరచుకొనగలిగిన ఒక మహా పురుషుడైనట్టు సుందరుని వర్ణించియున్నాడు. ఆయనకుండిన తీవ్రమైన మతావేశ యనుభవములచేతనే యితరులకు ప్రయోజనకరమైన సేవచేయుటకు సాధువు ప్రేరేపింపబడుచున్నందున యిట్టి ప్రజాసేకరము కలవాడాయెను.

సాధువు దర్శించినదేశములో ఆయనకుముందును, వెనుకను ఆయననుగూర్చిన గ్రంథములు వెల్లియుండెను. ఆయన వెళ్లలేని రష్యా, ఇటలీ

దేశములలో వాటి తర్జుమలు వెళ్లెను. అప్సారా ప్రధానాధ్యక్షుడు పత్రికలలో ఆయననుగూర్చి వ్రాసెను. లూథరు సుందరసింగను పుస్తకమును రచించెను. ఇంతియేకాక 1922-వ సంవత్సరము ఏప్రిల్ నెలలో 'ఒక హిందువుని ఆత్మలో గూఢమైన క్రీస్తుమతము కలిగించిన మార్పు'ను అంశమునుగూర్చి పలుమిషనుల పత్రికలలో ఒక ముఖ్యమైన వ్యాసము వ్రాసెను. ఆయా మతములనుపోల్చి పరీక్షించిన పండితోత్తముడను ప్రఖ్యాతిపొందిన ఆయన సాధువునుగూర్చి యిట్లు వ్రాసెను:—

గూఢ మతావలంబకుల దేశమైన యిండియానుండి వెలసిన యీ క్రీస్తుమతములోని గూఢమైన సంగతులను సాధించిన యీ సాధువువలన మనము నేర్చుకొనునదేమి? బైబిలు గ్రంథమును ఇండియాలోని వేదాంతులు చదివినప్పుడు వారు దానినిగూర్చి తలంతురని మన మింతవరకు ఊహించిన సంగతులు మనకు సిగ్గుకలిగింపవలసినదే. ఇది ఆశ్చర్యకరమైన విషయమే. ఆయనలో సువార్త యొట్టిమార్పును పొందలేదు, అది మన మెరిగిన సువార్తయే. కాని అది కొన్నివిషయములలో మనకు ఆశ్చర్యమును కలిగించు విధముగ ఆయన గ్రహించి వివరించును. అందువలన మనము ఇండియానుగూర్చి కొంత తెలిసికొనుటయేకాక, ఇంతవరకు ఈ సువార్త పాశ్చాత్యులకు చెందినట్లున్నను ఇప్పుడు కొంత రూపాంతరము పొందియున్నది. క్రీస్తుమత చరిత్రలో సుందరుడు లోకమునకు క్రీస్తు నగపరచ గలిగిన ప్రథమ పురుషుడు. యేసుక్రీస్తు సువార్త ఈ హిందువుని ఆత్మలో, ఏమార్పు చెందకుండ స్వచ్ఛముగ ప్రతిఫలించుచున్నది. ఆయనలో విశేషమైన సంగతి క్రీస్తుమతము హిందుమతము మిశ్రమమగుటకాదుకాని స్వచ్ఛమైన బైబిలు క్రీస్తుమతము నూతనవిధముగ ప్రకటింపబడుచున్నది.

సాధువును కొన్ని సంవత్సరములనుండి అన్యోన్యముగ నెరిగిన ఒకరిట్లు వ్రాసిరి:—

స్వీడెన్‌లో నొక సభలో సాధువునుగూర్చి గొప్ప సభయెదుట చెప్పుచు ఇట్లనెను: గాంధి, రబేంద్రనాత్ టాగోర్, సాధువు అను ముగ్గురు గొప్ప ఇండియనుల నెరుగుదును. వారిద్దరు క్రీస్తుబోధకు వశ్యమైనవారు, కాని మనముందర నున్న సాధువు క్రీస్తుకు తనను సంపూర్ణముగ వశపరచుకొనినవాడు.

సాధువు ఇండియాలోని క్రీస్తుసభకు రాయబారిగ నున్నాడు. అది ఆత్మీయముగ నెట్టి కార్యమును చేయగలదో దానికి ఆయన రుజువై

యున్నాడు. విదేశీయులయొద్ద నేమియు నేర్చుకొనకుండను, వారి ప్రాప కముగాని సహాయముగాని లేకుండను, క్రీస్తుయొక్క అధికశక్తిగల గూఢ మైన బోధను తనదిగ జేసికొని అందరిని ఆకర్షించగల విచిత్రమైన పురుషు డుగ ఆ బోధను తన ప్రవర్తనయందు ప్రత్యక్షపరచుచున్నాడు.

విశ్రాంతికొరకు ఆయన యిండియాకు తిరిగి వెళ్లి అక్కడాయన పని మార్పుచేత నూతనబలము పొంద నిరీక్షించుచున్నాడు. పశ్చిమమున ఆయన తనపని యిప్పటికి ముగిసినదని తలంచుచున్నాడు. కాని అలాగు తలంచ వలసి వచ్చినదని వేలకొలది ప్రజలు విచారపడుచున్నారు.

సువార్తలో బయలుపరచబడిన క్రీస్తుయొక్క శక్తి నిజమైన విశ్వాసి హృదయములో కనుపించునని సాక్ష్యమిచ్చుటకే సాధు సుందరసింగు పశ్చిమదేశములకు వచ్చెను. కాని ఇప్పుడు ఆయన తనపని ముగించి నట్టు తలంచుచున్నాడు. ఎన్నికష్టములు కలిగినను ఈ సాక్ష్యమిచ్చుట తన ప్రభువునెడల తన విధియని తలంచి, దానిని ముగించెను. కాని ఆయన సాక్ష్యమిచ్చిన ప్రతిదేశపు జనులును, 'మీ ప్రభువునెడల మీవిధి యేమను ప్రశ్నకు ప్రత్యుత్తర మీయవలెను. ఆయన వచ్చి వెళ్లినపిమ్మట అక్కడి ప్రజలజీవితము పూర్వమువలె నుండ నేరదు. ప్రజలు ఆయనమాటలను లక్ష్యపెట్టవలెను, లేక, పూర్వముకంటె చెడ్డవారు కావలెను. ఇట్టివారిని గూర్చి ప్రభువు 'మృతులలోనుండి యొకడు లేచినను వారు నమ్మరని' చెప్పినమాట సత్యమగును. ఐరోపాదేశమునకు ప్రస్తుతము మతోజ్జీవము అత్యవసరముగ కావలసియున్నది. మన ప్రభువు, నీ సిలువనెత్తుకొని నన్ను వెంబడించుమని చెప్పినమాటలు ఆయనకాలమందువలెనే నేటికిని విధ్యుక్త మైయున్నది. సుందరసింగునందు రూపాంతరము పొందించు క్రీస్తుయొక్క శక్తి సంపూర్ణమై ఆధిపత్యముకలదాయెను. అందువలన ఆయన తన ప్రభు వుకు విధేయుడై, తన సిలువనెత్తుకొని ఆయనను వెంబడించుచున్నాడు.

అన్నివిధములైన మతాభిప్రాయములుగల ప్రజలును క్రీస్తుయొక్క వినయదాసుడైన యీయననోటనుండి, ఎవనివలె యేమనుష్యుడును ఎన్నడు మాట్లాడలేదో ఆ ప్రభువుయొక్క వర్తమానమును వినియున్నారు. ఒక వార్తాపత్రిక నుడివినటుల 'పశ్చిమదేశస్థులకు తూర్పుదేశస్థుని పెదవుల ద్వారా నిజమైన సార్వత్రిక మతాభిమానము ఆయన నేర్పుచున్నాడు.'

ఒంటరిగ చలితో ఆకలితో, తలవాల్చుటకు చోటులేకుండ, 'చీకటి లోను మరణచ్ఛాయలోను కూర్చుండిన' యాత్మలకొరకును తన యజమానుని

కొరకును అత్యావేశముగలవాడై సుందరసింగు మంచుతో కప్పబడిన టిబెట్టు లోని యెడారులలో పాటుపడుచున్నాడు, ఆయన మనకండ్లకు మరుగైపోయి నట్టు ప్రభువు దృష్టికి మరుగైపోడు. ప్రభువాయన ప్రక్కను నడుచుచు, ఆయనతో సంభాషించుచు, పనిచేయుచు, శ్రమ ననుభవించుచుండును.

'దేవుని సముఖమున పరిశుద్ధులయెదుట హతసాక్షులయెదుట మనము కూడుకొనినప్పుడు ఇహమందు నిజమైన క్రైస్తవబ్రతుకు బ్రతుకనియెడల మనమెంత సిగ్గుపడుదుము' అని ఆయననిన మాటలు ఇప్పటికిని ఆ యేకాంతమైన ఉన్నత ప్రదేశముః నుండి మన చెవులలో ప్రతిధ్వనించుటలేదా? ఇవి క్రొత్త మాటలుకావు కాని సుందరుని సహవాసియైన స్ట్రీక్సుచెప్పినట్లు అవి తన యజమానునికొరకు ఆకలి, చలి, చెర, హింసలకు దీర్ఘకాలమనుభవించిన వాని నోటనుండి వచ్చినప్పుడు ఎంతో అధికారముతోను శక్తితోను మన చెవుల బడుచున్నవి.

శా. దేవా! మానవవంశరత్నమ! దయాదివ్యాస్పదా! వహ్నికీ
లావిస్ఫార మయూఖలోచన! ధరన్ లక్ష్యంబుగా మానలేన్
నీవున్ సంచరణంబొనర్చి శ్రమల న్నెక్కొంటి మారీతి నే
నీవున్ శ్వాసల నింపినాఁడ, విటుఁరమ్మీ! దేవ! నాయొద్దకున్.

మ. మనుపూజించెడి నాహృదీశుఁ డెడఁదం బొందింపకున్నట్టి యా
మును పే నామది చల్లనౌచు, మరణంబుంగాంతు నే మొకదా!
నిను నీలోకమునం గనుంగొనని యీ నేత్రంబులెన్నండు నుం
గనఁగాఁ జాలవుగాదె, నీదు పరలోకశ్రేష్ఠ మహాత్మ్యమున్.

# అనుబంధములు

## సీక్కులు

గంగా, సింధు అను రెండు పెద్ద నదులమధ్యనుండు పంజాబులో సీక్కుల సంస్థానములున్నవి. వీటికి ఉత్తరమున టిబెట్టు, చీనాదేశములను వేరుపరుచు హిమాలయ పర్వతములున్నవి. ఈ సంస్థానములకు రెండు ముఖ్యపట్టణములు, అమృతసరు, లాహోరు.

సీక్కు మతమును స్థాపించిన గురువు నానక్. ఆయన రాయపూర్ అనుచోట 1469-వ సంవత్సరములో పుట్టెను. బాల్యమునుండి ఆయన లోక[illegible]ను విసర్జించి, దైవభక్తిపరుడై యుండెను. ఆయన తండ్రి పారమార్థికము నుండి ఆయన మనస్సును త్రిప్పవలెనని ఒకప్పుడు ఆయనచేతికి కొంత సొమ్మిచ్చి ఏదో లాభము కలుగగల వ్యాపారము చేయుమని పంపెను. మార్గమున ఆకలిగానున్న కొందరు ఫకీర్లను చూచి, 'ఇహలోకలాభము స్వల్ప కాలముండునది; కష్టములోనున్న వీరి బాధనుతీర్చి నిత్యమైన లాభము సంపాదించుకొందునని చెప్పి, తండ్రి ద్రవ్యమును వారికి పంచిపెట్టెను. ఫకీర్లు ఆకలితీరినతరువాత, ఈయనకు, దేవుడు ఒక్కడేనని చాలాసేపు బోధించిరి. ఆ మాటలు ఈయన సంతోషముతో అంగీకరించెను. ఆయన ఇంటికి తిరిగి పోయినప్పుడు తండ్రి, తన ద్రవ్యముతో ఫకీర్లకు ఆహారము పెట్టినట్లు విని, ఆయనను దూషించి, దెబ్బలుకొట్టెను. ఆ పరగణా అధిపతియైన రాయి బోలారు, అది విని, తండ్రిని ఆయనను ఇకనెన్నడు కొట్టరాదని చెప్పి నానక్‌ను బహు ఘనపరచి, వినయముతో ఆయనకు నమస్కరించెను.

అప్పుడు నానక్ కాషాయవస్త్రమును ధరించి, సాధువు వ్రతమును పూనుకొని, త్వరలోనే బహు మంచివాడని పేరుపొందెను. హిందువుల పుణ్యక్షేత్రములకును మక్కాకును యాత్ర చేసి, హిందూమతమును, మహమ్మదీయ మతమును సంస్కరించుటకు పూనుకొనెను. ఆయన వెళ్లినచోట నెల్ల దేవుడొక్కడనియు, ఆయన సర్వవ్యాపియనియు బోధించెను. ఈ రెండు జాతులవారు పరస్పర వైషమ్యము కలిగియున్న పరగణాలో జన్మించినను,

వారు అన్యోన్యానురాగముతో జీవించునట్లును, పవిత్రమైన భక్తితో దైవారాధన చేయునట్లును ఆయన పాటుపడెను.

నానక్ దేవు డొక్కడనియు, విగ్రహారాధన మానవలసినదనియు నేర్పి, ఆ విధముగ అప్పుడున్న మతములను సంస్కరింపవలెను గాని, వాటి నాశనము చేయవలెనని ఆయన ఉద్దేశింపలేదు. ఆయన మరణించక పూర్వమే ఆయనను వెంబడించినవారు ప్రత్యేకమైనతెగగా ఏర్పడి, సీక్కులనబడిరి. సీక్కనగా శిష్యుడని అర్థము. నానక్ హిందూశాస్త్రములలోనుండిని, తురకల ఖురానులోనుండిని తనకు తోచినట్టు తన గ్రంథములో వ్రాసికొనెను. ఆది గ్రంథ్ అను సీక్కుల వేదములో, అనేక అధ్యాయములు నానక్ స్వయముగా పద్యకావ్యముగ వ్రాసెను. ఆయన కులభేదములను బొత్తిగ రద్దుచేసి, అందరిని సమానులని బోధించెను. మరియు ఉదయమున దేవుని స్తుతించి, మన శరీరమును ఆయనకు సమర్పించుటే, ఆయన కంగీకారమైన సేవయని నానక్ చెప్పెను.

నానక్ చనిపోయిన తరువాత పదిమంది గురువులు వెలసిరి; వారిలో ప్రసిద్ధిగాంచినవారు అర్జునుడు, గోవిందుసింగు అనువారు. అర్జునుడు కొన్ని విషయములలో వారి గురువులందరిలో ప్రఖ్యాతినొందినవాడు. ఆయన బహు అనుభవముగలవాడును సాగసైనవాడును కవీశ్వరుడునై యుండెను. ఆయన 1581 సంవత్సరమునుండి 1606 సంవత్సరములో ఆయన మరణము వరకు వారిని యేలెను. ఆయనయే అమృతసర్ అను గొప్ప సరస్సును త్రవ్వించి, దానిమధ్య ఒక ద్వీపములో బంగారు ఆలయమును కట్ట నారంభించెను. ఇవి జరుగుచుండగ ననేక పద్యములను రచించి ప్రసిద్ధిగాంచిన ఆది గ్రంథ్ అను గ్రంథమును పూర్తిచేసెను. ఆయననుగూర్చి దుర్వార్తలున్నను చక్రవర్తియైన అక్బరు ఆయన స్నేహితుడాయెను. అక్బరున్నంతవరకు సమస్తము బాగుగ జరిగెను కాని ఆయన తదనంతరము మూర్ఖవైరాగ్యము కలిగిన ఆయన కుమారుడైన జిహాంగీరు రాజ్యపరిపాలనకు వచ్చినప్పుడు అర్జునునిమీద పూర్వము మోపబడిన పాతనేరములకు జవాబిచ్చుటకై పిలువబడెను. గ్రంథ్ అను గ్రంథములో మహమ్మదీయమతమునకు హిందూమతమునకు అవమానకరముగనున్న కొన్ని అధ్యాయములు బొత్తుగ తీసివేయవలెను లేక మార్చవలెనని జిహాంగీరు కోరెను. అర్జునుడు ఒక్క మాటయినను మార్చుటకు ఒప్పుకొనలేదు. మరియు, ఇందుకొరకై యీ

అనిత్యమైన శరీరము పోవలసినయెడల నది గొప్ప అదృష్టముగ నెంచుకొందు నని యనెను.

అందుకు ఒప్పుకొనకపోయినందున ఆయన ప్రాణమును బలిగా నర్పించ వలసివచ్చెను. ఆయన శత్రువుల కప్పగించినందున వారు చిత్రవధచేసి ఆయనను చంపివేసిరి కాని వారు కోరినట్టు ఆ గ్రంథములో ఒక మాటయైన ను మార్చబడలేదు. క్రొత్తగా వెలసిన ఈ తెగవారిని మహమ్మదీయులు జహాంగీరు పరిపాలనక్రింద ఘోరముగ హింసించినందున ఎవరికిని హాని చేయకుండ నుండగోరిన దైవభక్తిగల ఈ జనులు యుద్ధవీరులుగా మారి, తాము హింసించిన వారిమీద పగతీర్చుకొనవలెనని ప్రతిజ్ఞ చేసికొనిరి. తమ గురువైన అర్జునుడు హతసాక్షిగా తురకల చేతులలో చంపబడినప్పుడు వారందరు మత వైరాగ్యముగల వీరులుగా బైలుదేరిరి.

సీక్కు నాయకులందరును తమ్మును వెంబడించువారిని ఇహ సౌఖ్యములను ఎక్కువుగ ననుభవింపరాదనియు, తక్కిన మతములలోని కఠిన వైరాగ్యము నవలంబింప నక్కరలేదనియు హెచ్చరించుట గమనింపదగిన యంశమే. ఆ జనాంగమువారికి సామాన్యమైన బ్రతుకు బ్రతుకవలెననియు, ప్రతిదినము స్నానముచేసి శుభ్రముగ నుండవలెననియు తమ నాయకులు, తమ పరిశుద్ధ గ్రంథము బోధించినట్టు మతచట్టముల ననుసరింపవలెననియు నేర్పబడినది. మత్తుపదార్థములను పుగాకును వారు వాడకూడదు. ఈ చట్టములు నిజమైన సీక్కులందరును అనుసరింప బద్ధులై యున్నారు.

పదిమంది గురువులలో నొకడైన తేగ్ బహదూర్ ఇండియాకు తెల్ల వాడు వచ్చి మొగల్ చక్రవర్తుల ప్రభుత్వమును చిన్నాభిన్నములుగ చేయు నని ప్రవచించినందున 1675 సంవత్సరములో ఔరంగజేబు చక్రవర్తిచేత చంప బడెను.

సీక్కుల గురువులలో పదియవవాడును చివరివాడునైన గోవింద్ సింగ్ సీక్కులను ఒక మతమునకు చెందిన యుద్ధవీరులైన జనాంగముగ జేసి వారిలో నిర్భయము రాజభక్తియును విశేష లక్షణములు వృద్ధిపొందించెను. ఆ లక్షణములు నేటికిని వారిలో విశేషముగ కనుపించును. ఈయనను దాదాపుగా నానక్‌తో సమానముగ గౌరవించుదురు. గోవింద్ ఖడ్గ ములో నొక సంస్కారమును నియమించి, అది పొందినవారినందరిని సమానులుగ నెంచబడుదురని ఆజ్ఞాపించెను. ఆ సంస్కారము పొందిన

వారందరికి గౌరవనామముగ సింగను (సింహము) బిరుదునిచ్చెను. మరియు సింగు లెవరును తలవెండ్రుకలు కత్తిరించుకొనకూడదను ఆజ్ఞ అప్పుడే జారీ చేయబడెను. గోవింద్ సింగు శక్తికార్యములు గలిగిన నాయకుడైనందున వేల కొలది జనుల నాకర్షించి తన సౌందర్య విగ్రహముచేతనే వారిని మచ్చు వేసినట్టు ఒకటిగ నుంచగలిగెను.

పరిశుద్ధ గ్రంథము ఆలయములుండగ సీక్కు జనాంగమును నడిపించు టకు గురువులతో నవసరముండదని చెప్పి, తన మరణానంతరము ఐదుగురు సీక్కు లెక్కడ కూడుదురో వారి మధ్యను తానుందునని వాగ్దత్తము చేసెను. అర్జునుడు ప్రవచించినటులనే ఇంగ్లీషువారు ఇండియా దేశము నేలుదురనియు, నిజమైన సీక్కులందరు వారికి సహాయము చేయుదురని ప్రవచించెను. అతడు ముప్పదిమూడేండ్లు అధిక ప్రయాసతో నాయకుడుగనుండి 1708 సంవత్సర ములో చనిపోయెను.

నూరేండ్లయినపిమ్మట తమనాయకుల ప్రవచనములు మరచి, బ్రిటిషు వారికి విరోధముగ లేచినప్పుడు సీక్కులు ఓడింపబడిరి. పిమ్మట బ్రిటిషు వారి పక్షమై 1857 సంవత్సరములో జరిగిన తిరుగుబాటులో వారి చక్ర మండలము రక్షించిరి. అప్పటినుండి వారు అధిక రాజభక్తితో బ్రిటిషువారి పక్షమై, అనేకయుద్ధములలో శౌర్యముతో పోరాడిరి.

సీక్కుల ఆలయములు మిద్దె కప్పుకలిగిన కట్టడములు. ఆరాధనకు వచ్చువారు నిలువబడి ఆరాధింతురు. వారి ప్రార్థనలు, సంకీర్తనలు బహు సాధారణమైనవి. వారి "గ్రంథ్" అను వేదమునుండి కొంతచదివి, వారి గురువు, గ్రంథమును ధ్యానించుమని ప్రజలను హెచ్చరించును. భక్తిపరులైన సీక్కులు ప్రతిదినము తమవేదము చదువుకొని ఆరాధన జరుపుకొందురు. తమ చివరి గురువైన గోవిందు తమను దేవునియొక్క విశేషమైన కాపుద లకు అప్పగించెనని సీక్కులు నమ్ముదురు.

## గడచిన గొప్పయుద్ధములో టిబెటీయులుచేసిన సహాయము

ఒక ఇంగ్లీషు వార్తాపత్రికలో ఈ మాటలున్నవి:

ఇంతవరకు తమ పొరుగువారి స్నేహముకొరక, ఒంటరిగా ఉన్నతమైన పర్వతములమీద వసించుచున్న టిబెటీయులు ఒక లక్షమంది యుద్ధవీరులను గడిచిన గొప్ప యుద్ధములో ఇంగ్లీషువారికి సహాయముగ పంపుదుమని

మని చెప్పిరి. ఇకమీదట లహాస్సాపట్టణమునకు భయపడ నవశ్యములేదు. మతవైరాగ్యమును సంశయమును కలిగిన టిబెటీయుల ప్రధాన లామా తన యొక్క ఏకాంతస్థానమునుండి బయటికివచ్చి, ఇరువదియవ శతాబ్దమందు జరుగుచున్న గొప్ప సంగతులను చూచుటయు, వాటిలో అధర్మమైనవాటిని నాశనముచేయుటకును తమ దేశస్థులలో బలహీనులైనవారిని కాపాడుటకును యుద్ధముచేయుచున్న ఐరోపియనులకు సహాయముచేయుట పూనుకొనుటయు ఆశ్చర్యమే.

అన్యమతస్థులను అన్యజాతివారైన టిబెటీయులు తమ దేశములోనికి ఎవరిని రానీయమని యింతవరకు మొండిపట్టు పట్టియుండిరి. ఇప్పుడు ఆ ద్వారము తెరువబడినందున సువార్త వారికి బోధించుటకు వీలగును. టిబెటీయులను క్రీస్తుపాదములయొద్దకు నడిపించుటకు సాధు సుందరసింగుకు కలిగిన వేదనకు ఫలితముగ వారు క్రైస్తవులయినయెడల ఆయన ఎంతో సంతోషించి తృప్తినొందును. ఆ సుదినము శీఘ్రముగరావలెనని ప్రతి క్రైస్తవుడు దేవుని ప్రార్థించుట ఆవశ్యకము.

"ఇండియా దేశమును పరిపాలించువారెవరు? ఇండియాను విమోచించుటకు కారణముగ నుండకలిగినది యేది? ఈ దేశస్థుల మనస్సులను వశపరచుకొని రాజ్యముచేయుటకు రాజ్యతంత్రము పనికిరాదు. సామధాన, భేద, దండనలను తంత్రములు చాలవు. ఆంగ్లేయసైన్యముల ఫిరంగులును ఖడ్గములును ఈపని చేయలేవు. ఒక జనాంగముయొక్క మనస్సును వశపరచుకొన గలిగిన శక్తి యుద్ధసేనల కెట్లుండగలదు? ఈ శక్తి క్రీస్తు నాధునియందే యున్నది. యేసుతప్ప, క్రీస్తు అను పురుషశిఖామణి తప్ప, మరియెవరును ఇండియా దేశమును తమ స్వాధీనము చేసికొనుటకు పాత్రులుకారు. ఇండియా యను ఈ అతిశ్రేష్ఠమైనరత్నము యేసునాధుని కిరీటమును అలంకరించుననుటకు సందేహములేదు."—"కేషబ్ చంద్ర సేన్"

## సాధు సుందరసింగు ఉపమానములు

సుందరుని ప్రసంగములు. పశ్చాత్తాపము, విశ్వాసము, స్వార్థత్యాగము మొదలైన మూలపాఠములను గూర్చినవి. సహజ ప్రపంచములోనుండి స్వానుభవమునుండి తీసిన ఉపమానములవల్ల ప్రతి అంశములను ఆయన దృష్టాంతపరచును.

వినయము. మెహతరు లేక పాకీవాండ్లలో నుండి ఒక బీదవాడు క్రైస్తవుడయ్యెను, వానినెరిగిన ఒక గొప్పకులస్థుడు వానిలో కలిగిన గొప్ప మార్పును చూచి ఆశ్చర్యపడి, 'నీవు మా యిల్లు ఊడ్చేవాడవే, నీకేమి విద్య రాకపోయినను నేను నిన్ను మర్యాద చేయవలసియున్నది. నిన్ను మార్చిన దేమ'ని యడిగెను.

ఆ పాకీవాడు తనకుకలిగిన నూతన జీవమునుగూర్చి చెప్పెనుగాని ఆ గొప్పకులస్థు డది గ్రహించలేదు. అతనికి ఒక సంగతినిగూర్చి మరీ ఆశ్చర్యము కలిగెను. 'నీ వింత మంచివాడవైనను నీ కేమాత్రము గర్వములేద'ని యడిగెను.

అందుకా పాకీవాడు, 'నేనెందుకు గర్వించవలెను. క్రీస్తుప్రభువు గాడిదనెక్కి యెరూషలేముకు వెళ్లినప్పుడు ప్రజలు బట్టలుతెచ్చి దారిపొడుగున పరచిరి. అయినను ప్రభువుపాదములు ఆ బట్టలు త్రొక్కలేదు. గాడిదమాత్రమే వాటిమీద నడిచెను. గాడిదపాదములకు అంతి ఘనత ఎప్పుడైనను కలిగెనా? ఆయన దానిమీదనుండి దిగినతరువాత అదెందుకును కొరగాదుగదా? ఆలాగే నేనెట్టి గౌరవమునకు పాత్రుడనుకాను, నేను క్రీస్తు ప్రభువును మోయుచున్నాను మీరాయనను ఘనపరచుచున్నారా. ఆయన నన్ను విడిచినయెడల నేనేమియు చేయలేన'ని చెప్పెను.

దేవునితో ఐకమత్యతగల జీవము. మా యనుభవమునుబట్టి మనము దేవునితో ఐకమత్యతకలవారము కావచ్చును కాని మనము దేవుండ్లము కాలేము. చల్లగానున్న యినుపముక్క నిప్పులో పెట్టినప్పుడు అది యెర్రగా కాలును, దానిలో నిప్పున్నది. కాని ఆ యినుపముక్క నిప్పనిగాని, నిప్పే యినుమనిగాని చెప్పలేము. ఆలాగే మనము క్రీస్తులో నున్నను మనము వేరైయుందుము; ఆయన మనలోను మనమాయనలో నుందుముగాని, మనవ్యక్తి వేరుగానే యుండును.

మనము ఊపిరించుచున్నాము, కాని మనుష్యుడు గాలికాదు, గాలి మనుష్యుడుకాదు. ఆలాగే ప్రార్థనద్వారా దేవుని పరిశుద్ధాత్మను ఊపిరించుచున్నాము, కాని మనము దేవుడుకాము. కొంతకాలము క్రిందట హిమాలయపర్వతములలో రెండు గ్రామములు చూచితిని. ఆ రెంటిమధ్య దాటుటకు శక్యముకాని ఒక పెద్దపర్వతముండెను. వాటిమధ్య దూరము తిన్నని దారిని ఎక్కువలేదు, కాని ఒక గ్రామమునుండి మరి యొక దానికి వెళ్లుటకు

చుట్టుదారిని ఒకవారము పట్టును. వాటిలో నొక దానిలోనుండు ఒక మనుష్యుడు ఆ పర్వతముగుండ ఒక సొరంగము త్రవ్వ నిశ్చయించి, అవసర ముంటే అందుకొరకు తన ప్రాణమును సహా పెట్టుదునని చెప్పెను. అతడా పని మొదలుపెట్టి, దానిలో తన ప్రాణముకూడా పోగొట్టుకొనెను. నేనా సంగతి వినినప్పుడు ఆ పర్వతము దేవునిదగ్గరకు మనలను వెళ్లకుండా చేయు చున్న పాపమువలె నున్నదని తలంచితిని. ప్రభువువైన యేసుక్రీస్తు తన ప్రాణము పెట్టి జీవముగల మార్గమును చేసియున్నాడు. ఆయన బుద్ధిపూర్వ కముగా తన ప్రాణము పెట్టెను, ఆయనను తమ రక్షకునిగా అంగీకరించెడి వారందరికి మార్గము తెరువబడియున్నది.

ఉత్తమమైనది. ఒకసారి నేను పర్వతములమీద ప్రయాణము చేయు చుండగా ఒక చిన్నదానిని కలిసికొంటిని. ఆమె గొప్పయింటి పడుచు. ఆమె వట్టికాళ్లతో యాత్రచేయుచున్నందున ఆమె పాదములనుండి రక్తము కారుచుండెను. ఎందుకింత శ్రమపడుచున్నావని యడుగగా శాంతి సమా ధానములకొరకు వెదుకుచున్నాను, నా యాత్రాంతమందు అవి దొరుకునని నమ్ముచున్నాను. అవి దొరకనియెడల నీళ్లలోపడి మునిగిపోదునని చెప్పెను. ఆమె వెదుకుచున్నవి సంపాదించి తీరవలెనని దృఢనిశ్చయము కలిగియున్నట్టు కనిపెట్టితిని. అప్పుడు నేను, ఈ భాగ్యవంతురాలైన చిన్నది తన యిల్లు విడిచి రక్షణను ఇంత శ్రద్ధగా వెదుకుచుండగా క్రైస్తవులుగా పుట్టినవారు ఇంత కష్టపడకుండా యీ గొప్ప యీవులు కలిగియుండియు వారు వాటిని అశ్రద్ధచేయుట యెంత ఆశ్చర్యమని తలంచితిని. ఆ యాత్రలో ఆమెకు సమాధానము దొరకలేదుగాని ఆమెకు ఒక మిషనేరీ కనిపించి క్రీస్తు ప్రభు వునుగూర్చి చెప్పెను. నేను తరువాత ఆమెను చూచితిని. ఆమె నాతో, నేను వెదుకుచున్నదంతయు కనుగొంటిని, మనుష్యులు నన్ను చంపవచ్చును, నేను ఉత్తమమైనదాని కనుగొంటిని. అది నాయొద్దనుండి యెన్నటికిని తీసి వేయబడదని చెప్పెను.

మీరు భూమికి వెలుగైయున్నారు. దీపముయొక్క వత్తి కాలి పోతేనేగాని దీపము వెలుగియ్యదు. వత్తి నూనెకును మంటకును మధ్య నున్నది. నూనె చాలా యుండవచ్చును, వత్తిలేనియెడల వెలుగుండనేరదు. గనుక యితరులకు వెలుగిచ్చుటకు మనము స్వార్థత్యాగము చేసికొనుటకు సిద్ధముగ నుండవలెను.

మీరు భూమికి ఉప్పైయున్నారు. ఉప్పు ప్రయోజనకారిగా నుండుటకు అది కరుగవలెను. ఉప్పు ఎండిన రాళ్లవలె నున్నయెడల అది ఆహారమునకు రుచినియ్యదు అది నీళ్లలో కరిగినయెడల ఆహారమున కంతకు రుచినిచ్చును. అలాగే ఒక్కొక్క క్రైస్తవుడు: వాడు తనను ఎప్పుడును ఇతరులకు సమర్పించుకొనుచుండవలెను. వాడు కనుబడకుండ నశించిపోయి నట్లు ఉండవచ్చును, అది నిజమైన సంగతికాదు. ఎవరికొరకైతే తనజీవమును పెట్టెనో వారిలో వాడు జీవించుచుండును.

క్రీస్తులో సురక్షితముగ నుండుము. మనము కొద్దిపాటి వారము, భూమియొక్క ఆకర్షణ గొప్పదైనను మనమేదైనను చేతిలోపట్టు కొనినప్పుడు భూమియొక్క ఆకర్షణ దానిని మనచేతిలోనుండి లాగుకొన లేదు. అలాగే మనము క్రీస్తుప్రభువు చేతిలోనున్నప్పుడు మనము సురక్షిత ముగ నున్నాము గనుక భూసంబంధమైనవాటికి మనమీద శక్తియుండ నేరదు.

క్రీస్తుప్రభువునందు దేవుడు. దేవుడు ప్రతిదానిలో నున్నాడని హిందువులు తరుచుగ చెప్పుదురు. నేను దాటవలసిన ఒక నదియొద్దనకు ఒకప్పుడు వచ్చితిని. నన్ను దాటించుట కక్కడ పడవేమియు లేనందున యెట్లు దాటుదునాయని యనుకొనుచుంటిని. అంతలో ఒక మనుష్యుడు గాలిలేని తిత్తినిచూపించి, నీవు దానిమీద నే దాటవలెనని చెప్పెను. అప్పుడు నేను దానిలో గాలిపోసి, దాటిపోతిని. అప్పుడు నాకొక తలంపు వచ్చెను: నా చుట్టును ఎంతో గాలియున్నది, కాని నాయవసరములో నాకేమి సహాయము చేయలేకపోయెను. అది ఆ తిత్తిలో పోసినప్పుడే నాకు పనికివచ్చెను. అలాగే క్రీస్తు ప్రభువు అవతారము అవసరములేదని చెప్పుట, నదిని దాటుటకు గాలితోనిండిన తిత్తి యవసరములేదని చెప్పినట్టే యుండును.

మన బలహీనత. గుడ్డులోని పిల్ల ముడుచుకొని కొద్దిపాటి చోట నుండును. దానికి తల్లియొక్క వెట్టదనము తగులుచున్నది. పొదిగినంత కాలము తల్లి దాని నెంతో జాగ్రత్తచేయును. కాని ఆ పిల్ల చూడలేదు గనుక దానికేమియు తెలియదు. దానికి రెక్కలున్నవిగాని అది వాటిని వాడుకొనలేదు. అలాగే దేవుడు మనకు సమృద్ధియైన జీవము కలిగించు వరకు మనము ముడుచుకొని ఆయన నెరుగక యుందుము.

**సమృద్ధియైన జీవము.** ఒక మనుష్యుడు చాలా జబ్బుగా నుండి తన పడకమీదనుండి లేవలేకయుండెను. వాని యిల్లు నిప్పంటుకొనినప్పుడు వాడు తప్పించుకొనవలెనని ప్రయత్నించెనుగాని వానికి శక్తి లేకపోయెను. వాడు బిగ్గరగా కేకవేసి తనశక్తికొలది బయటికిపోవుటకు ప్రయత్నించెను. గాని వాడు కాలి చచ్చిపోయెను. మరి యొకడు సమృద్ధియైన బలముగలవాడైనందున వచ్చి నిప్పు ఆర్పివేసెను గాని అతడు ఆలస్యముగా వచ్చినందున ఆ రోగిని రక్షించలేకపోయెను. మరియొక మనుష్యుని యెరుగుదును, వాడు బహు జబ్బుగానుండి రుచి తప్పియున్నందున, రుచిగల ఆహారము ముందర పెట్టినను వాని కిష్టములేకపోయెను. వాడది తినలేకపోయినందున అంతకంతకు బలహీనుడయ్యెను. ఆలాగే అనేకమంది క్రైస్తవులకు ఆత్మీయమైన సంగతులలో అభిరుచిలేదు. వారికి జీవమున్నది గాని సమృద్ధియైన జీవము లేదు. బౌద్ధమతము హిందుమతము అనేక మంచి సంగతులు బోధించును గాని క్రీస్తుప్రభు వొక్కడే యీ సమృద్ధియైన జీవమియ్యగలడు. అనుభవముచేతనే జీవమునకును క్రీస్తుప్రభువు అనుగ్రహించు సమృద్ధియైన జీవమునకును ఉండు వ్యత్యాసమును మీరెరనను గ్రహించగలరు.

**శ్రమానుభవముయొక్క అవసరము.** పట్టుపురుగు దాని గూటిలోనుండి బయటికి రావలెనని కొట్టుకొనుచుండెను. అదియెరుగనివాడొకడు నొప్పితో బాధపడుచున్నదనుకొని, అది బయటికి వచ్చుటకు సహాయముచేసెను. కాని త్వరలో అది ఆటుఇటు కొట్టుకొని చచ్చిపోయెను. మిగిలిన పట్టుపురుగులు ఏ సహాయము లేకుండ శ్రమతో తన్నుకొని బయటికి సంపూర్ణమైన జీవముతో వచ్చెను. వాటి రెక్కలు గూటిలో తన్నుకొన్నందున బయట యెగురుటకు శక్తి గలవయ్యెను.

**జీవజలము.** కొందరు మనుష్యులు టిబెట్టులో ప్రయాణము చేయుచుండిరి, వారిలో నొకనికి బహు దాహమయ్యెను. కాని త్రాగుటకు నీళ్లు లేకపోయెను. వారు పోవుచుండగా చుట్టు చవుడునేలగల నీటి గుంటలు కనుపించెను. వెంటనే ఆ దప్పికొనినవాడు ఆ నీటితో దాహము తీర్చుకొన జూచెను. ఆ ప్రదేశము నెరిగినవారు సురక్షితమైన స్థలము చేరువరకు ఆగుమని బ్రతిమాలుకొనిరి, గాని వారిమాట వినక, నేను జాగ్రత్తగా పోదునని చెప్పి నీటిలో దుమికెను. చేతినిండ నీళ్లు తీసికొని త్రాగ మొదలుబెట్టెను. వాడు తన స్నేహితులను పిలిచి తనివితీర త్రాగుచున్నానని చెప్పెను.

వాడు మాట్లాడుచుండగానే ఊబిలో దిగిపోసాగెను. త్వరలోనే వాడు సగమువరకు దిగబడెను. ఎవరును దగ్గరకుబోయి వానిని తప్పింప తెగించ లేకపోయిరి. వాని స్నేహితులు వానికేమి సహాయముచేయలేకుండా వాడు ఊబిలో దిగబడి కనబడకుండపోవుట చూచిరి. వానివలెనే అనేకులు పాపపు బ్రతుకను నీటిని త్రాగుచు దౌర్భాగ్యులుగా నశించుచున్నారు.

**సాధువు మారుమనస్సు పొందుట.** ఈ గ్రంథకర్త మనవి చేసినందున సాధు సుందరసింగు తాను మారుమనస్సు పొందిన విధమును వివరించి, ఏ మార్పులేకుండా దీనికి అనుబంధముగ ప్రచురింపబడవలెనని కోరెను. అలాగే యీ పుస్తకము 17-వ. పుటలో అచ్చువేయబడినది.

**హిబ్బర్టు జర్నల్.** 1921-వ సంవత్సరము జనవరిమాస పత్రికలో ఆక్సుఫర్డ్ ఎమ్మెట్ అను వేదాంతశాస్త్రజ్ఞుడు సాధు సుందరసింగుయొక్క అద్భుతములనుగూర్చి వ్రాయుచు, సుందరుడు మారుమనస్సుపొందుటను ఇంకను ఎక్కువుగ తెలుపవలెననెను. ఆయనగాక ఇంక ననేకులు అలాగే కోరిరి. గనుక సాధువు దానినిగూర్చి యిట్లు వ్రాసెను.

నేను క్రీస్తు మతమునకు పరమ శత్రువునై మిషనెరీలకు విరుద్ధముగ మాట్లాడుటయేకాక వారిని హింసించితిని. క్రీస్తు మత మబద్ధమని హిందు మతమే సత్యమని నేను తలంచినందున బైబిలు గ్రంథమును చింపి కాల్చి వేసితిని. ఒకనాడు మాతండ్రియెదుట బైబిలుమీద కిరిసీను చమురుపోసి తగులబెట్టితిని. మాతండ్రి అలాగుచేయకుండ అడ్డగింపయత్నించెను గాని నేను మూర్ఖమైన వైరాగ్యముకలిగి దేవుని కిష్టమైనపని చేయుచున్నానని తలంచితిని గనుక ఆయనకు నేను లోబడలేదు.

నేను బైబిలు కాల్చినపిమ్మట బహు దౌర్భాగ్యస్థితిలో నుండి యేమియు విశ్రాంతి లేకయుంటిని. నేను బైబిలు కాల్చిన మూడు దినములకు హిందు మతము నాకేమియు ఆదరణ నియ్యనందున బ్రతుకుట అసాధ్యమైనందున ఆత్మహత్య చేసికొన నిశ్చయించితిని. ఉదయమున 3 గంటలకు లేచి, చలి నీళ్లలో స్నానముచేసి ప్రార్థింప మొదలు బెట్టితిని. 'ఒక దేవుడున్నయెడల, ఆయన నాకు రక్షణమార్గము చూపవలెను, లేనియెడల రైలు పట్టాలమీద పరుండి ఆత్మహత్య చేసికొందు' నంటిని.

నాలుగున్నరవరకు ప్రత్యుత్తరము రాలేదు. అప్పుడు ప్రకాశమానమైన వెలుగు వచ్చెను. ఆ వెలుగులో ప్రియరక్షకుడైన క్రీస్తు యొక్క మహిమగల ముఖము కనుపించెను. మేకులతో గాయపరచబడిన తన తిరుహస్తములను చూపి, ఆయన, 'నన్నెందుకు హింసించెదవు? ప్రియుడా, సిలువమీద నీకొరకు ప్రాణము పెట్టితిని. లోకమునకు అందువలననే రక్షణ కలుగును'ని చెప్పెను. నేనువినిన యీమాటలు నా హృదయములో మెరుపు వలె దూసికొనిపోవగా వెంటనే నాకు పరమానందము కలిగెను. అప్పుడు నేను నిత్యత్వమువరకు మారిపోతిని?

నాతో మాట్లాడినపిమ్మట క్రీస్తు ప్రభువు అదృశ్యుడైనను ఆయన దయచేసిన సమాధానము నాలో ఎన్నటెన్నటికి నిలుచును. ఇది వట్టి యూహ కాదు. బౌద్ధుడుగాని కృష్ణమూర్తిగాని కనుపించితే, నేను వారిని పూజించుచుంటిని గనుక అది యూహ కావచ్చును. కాని నేను ద్వేషించుచున్న క్రీస్తు కనిపించుట అద్భుతమే, అది ఆయన సజీవుడైనట్టు రుజువైయున్నది. అది స్వప్నము కానేరదు, ఎందుకనిన, చల్లనినీళ్లలో స్నానముచేసినపిమ్మట నెవరును కలలుకనరు. మరియు స్వప్నము ఎవరి బ్రతుకును మార్చలేదు. అది మిథ్య కాదు, యాథార్థమే.

సుందరసింగ్.

PRINTED AT THE DIOCESAN PRESS, MADRAS—1942. A5069